శ్రీశ్రీగురు గౌరాంగౌ జయతః



# శ్రీవ్రజ మాధురి

రచన

ఓం విష్ణుపాద శ్రీశ్రీమద్భక్తి విలాస తీర్థగోస్వామి మహరాజుల

అనుగ్రహముచే

**త్రిదండి శ్రీమద్భక్తి సుధీర దామోదర మహరాజు**

సంపాదకులు

ఓం విష్ణుపాద శ్రీశ్రీమద్భక్తి హృదయవనదేవగోస్వామి మహరాజుల

అనుగ్రహముచే

**శ్రీపాద రమణకృష్ణ దాసు**

ప్రకాశకులు :

త్రిదండి శ్రీభక్తి ప్రమోద జనార్దన మహారాజు

శ్రీరామానంద గౌడీయ మఠము

కొవ్వూరు - 534 350 ✆ 31229

ప్రతులు : 3,000

శ్రీశ్రీమద్భక్తి హృదయ వనదేవగోస్వామి మహారాజుల

శతజయంత్యుత్సవములు

జనవరి 20 నుండి 26 వరకు 2001

**SRIVRAJA MAADHURI**

**BY**

**TRIDANDI SRIMADBHAKTI SUDHIR DAMODARA MAHARAJ**

ముద్రణ: శ్రీలక్ష్మీగణపతిబైండింగ్ వర్క్సు. కొవ్వూరు - 534 350. ✆ 31575

# మున్నుడి

జగత్కల్యాణార్థము లీలాపురుషోత్తముడగు భగవంతుడు అర్చామూర్తిగాను పుణ్యక్షేత్రముగను, అవతరించి మాయాగ్రస్థజీవులు మరల తన దివ్య సన్నిధానమును చేరు మార్గమును చూపును. పరమభాగవతోత్తములు అట్టి క్షేత్రములను సేవించి, భగవదనుభూతిని పొంది, క్షేత్ర మాహాత్మ్యమును కొనియాడిరి. ఈ చిన్న గ్రంథములో క్షేత్రావతరణమునకు కారణము, భారతదేశమునందు విఖ్యాతినొందిన చతుర్విధ ధామములు, సప్త మోక్షదాయికా క్షేత్రములు వర్ణితములైనవి. భగవానుని సకల అవతారములలో లీలాపురుషోత్తముడగు వ్రజేంద్రనందన శ్రీకృష్ణుడెట్లు సర్వోత్కృష్టమో అటులనే సమస్తక్షేత్రములలోను లీలాపురుషోత్తముడు సర్వచిత్తాకర్షకములగు నవనీత చౌర్యము, గోచారణము, గోవర్ధనోద్ధరణము, రాసలీల చేసిన గోలోక బృందావన ధామములు సర్వోత్కృష్టము. మరియు భగవానుడు ఈ ప్రపంచములో అవతరించు నప్పుడు "**స్వపార్షదస్వీయధామ సహ అవతరి**" అనినట్లు తన నిత్య పార్షదులతోను, తన నిత్య లీలాస్థలమగు గోలోక మథుర బృందావనాది ధామములతో ఆయా స్థలములందు అవతరించును. ఇతర క్షేత్రములలో భగవానుడు కేవలము అర్చామూర్తిగ ప్రకాశించుచు భక్తుల కోరికలను నెరవేర్చుచున్నాడు. కాని గోకుల బృందావనాది ధామములలో భగవానుడు కేవలము అర్చారూపముతో అవతరించి యుండుటయేగాక అచట నిత్యము తన భక్తులతో లీలలు చేయుచుండును.

"అద్యాపి సెఇ లీలా కరేన్ గౌరరాయి ।
కానా కానా భాగ్యవాన్ దేఖివారే పాయి ॥"

భగవానుడు ఇప్పటికిని ఆయాలీలలను చేయుచున్నాడు. భాగ్యవంతులగు కొందరు మాత్రమే వానిని దర్శింపగలరు.

ఈ గ్రంథమందు విశేషముగ వ్రజమండల మాహాత్మ్యమును గూర్చియు, ఎచ్చటెచ్చట భగవానుడు ఏయే లీలలు చేసెనో వానిని విపులముగ వివరించితిమి. బృందావనమునందలి శ్రీకృష్ణుని లీలాస్థలములు కాలక్రమమున కనుమరుగయిపోగా వానిని ఉద్ధరించుటకు, భగవానుని శ్రీవిగ్రహసేవను ప్రకాశము చేయుటకు శ్రీకృష్ణచైతన్య మహాప్రభువు తమ శిష్యులగు గోస్వాములకు ఆదేశమునిచ్చెను. వారేవిధముగ

ఆయాక్షేత్రములను శ్రీవిగ్రహసేవను ప్రకాశము చేసిరో ఆవిషయములను, శ్రీలమాధవేంద్రపురి శ్రీకృష్ణచైతన్య మహాప్రభువు గోస్వాములు వ్రజమందెట్లు నివసించిరో ఈ గ్రంథమందు తెలుపబడియున్నది.

**'శ్రీవ్రజమాధురి'** అను నీ గ్రంథము శ్రీభక్తిరత్నాకరము, శ్రీచైతన్య చరితామృతము, బ్రహ్మసంహిత అను గ్రంథములు ఆధారముగ వ్రాసితిమి. కొన్ని కొన్ని స్థలముల ఇతిహాస ప్రాముఖ్యములను, లీలా విశేషములను మా గురు భ్రాతలు వ్రజభజన పరాయణులునగు శ్రీపాద మథురానాథ దాస బాబాజీ మహారాజుగారు, శ్రీపాద భక్తి సర్వస్వగోవింద మహారాజుగారు, శ్రీపాద భక్తి విబుధవామన మహరాజుగారు తెల్పిరి. వారికి మా ధన్యవాదములు. భాషా పరిజ్ఞానము లేక పోయిననూ మా భావములను తెలుపగ శ్రీకె.కృష్ణరాజుగారు, శ్రీపి.వి.వి.యస్.శాస్త్రిగారు, కుమారి యస్. కృష్ణకుమారి గారు తెలుగున వ్రాసి ఇచ్చిరి. వారికి శ్రీశ్రీగాంధర్వికాగిరిధారుల ఆశీస్సులు కలుగు గాక యని ప్రార్థించుచున్నాము. వ్రాత ప్రతిని సరిచూచి తగు మార్పులు చేయుట యందు శ్రమ చేసిన శ్రీపాద రమణకృష్ణదాసుగారికి, ప్రూఫులు సరిచూచిన శ్రీభక్తి ప్రమోద జనార్దనమహరాజుకు బృందావనాధీశ్వరులైన శ్రీశ్రీరాధాకృష్ణులు ప్రేమభక్తినొసంగుగాక! సకాలములో ఈ గ్రంథమును ముద్రించి ఇచ్చిన శ్రీలక్ష్మీగణపతిప్రింటిగ్‌వర్క్సు వారికి మాధన్యవాదములు.

ఎన్నియో దినముల నుండి ఈ గ్రంథమును వ్రాయుటకు సంకల్పించినప్పటికిని శ్రీహరిగురువైష్ణవుల అనుగ్రహముచే ఈనాటికి పూర్తయినది. ఈ శ్రీవ్రజమాధురి యనునీగ్రంథము వ్రజభజన పరాయణులైన శ్రీశ్రీమద్భక్తిహృదయ వనదేవ గోస్వామి మహరాజుగారి శతజయంత్యుత్సవముల సందర్భముగ భక్తుల కందించుచున్నందులకు ఎంతగనో ఆనందించుచున్నాము.

ఇట్లు

**శ్రీరామానందగౌడీయమఠము,**
**కొవ్వూరు 10-1-2001**

**త్రిదండి శ్రీభక్తిసుధీర దామోదరమహరాజు**



ఓం విష్ణుపాద 108 శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి ప్రభుపాదులు



శ్రీజగన్నాథ మందిరము, పూరీ.



శ్రీద్వారకాధీశ మందిరము, ద్వారకా.



శ్రీరామేశ్వరము

# విషయాను క్రమణిక

శ్రీ శ్రీగురు గౌరాంగౌ జయతః

# శ్రీ వ్రజ మాధురి

## 1. క్షేత్రావతరణము

పదునాలుగు లోకములతో గూడిన ఈ బ్రహ్మాండములో భూలోకము సర్వోత్కృష్టమైనది. అందులో జంబూద్వీపము మిగుల శ్రేష్ఠము. దానిలో భారతవర్షము మిక్కిలి పవిత్రమైనది. దీనిని కర్మభూమి, ధర్మభూమి, తపో భూమియని శాస్త్రములు పేర్కొనినవి. జీవులు సత్కర్మలనాచరించుటకు, భగవదారాధన చేయుటకు ఈ భూలోకమునందే యవకాశము గలదు. మిగిలిన లోకములలో కేవలము భూలోకమునందాచరించిన కర్మల ఫలితములను యనుభవింపవలసి యుండును. ఎనుబది నాలుగు లక్షల జీవరాశులలో మానవ జన్మము సర్వోత్కృష్టమైనది. ఏలననగా, సత్ అసత్ విచారణ చేయు శక్తి మానవులకే ఉన్నందున వారు భగవదారాధన చేసి యాతని దివ్య సన్నిధానమునొందుటకు చక్కని యవకాశము గలదు. ఇట్టియవకాశము పశుపక్ష్యాదులకు లేదు. మానవులకంటే దేవతలు శ్రేష్టులేయైననూ నిరంతరము భోగ విలాసములయందు మగ్నులై యుండుట వలన వారికి భగవదారాధన చేయు నవకాశముండదు. కావుననే దేవతలు గూడ ఈ భూలోకమున మానవజన్మకై భగవంతుని ప్రార్థింతురు.

జీవులు భగవంతుని యొక్క విభిన్నాంశములు. జీవులయొక్క యునికి లేదా జన్మస్థానము చిన్మయమగు అప్రాకృత వైకుంఠ ధామమునకును, ప్రాకృత జగత్తునకును నడుమ గల తటస్థరేఖ. చిన్మయ జగత్తును జలముగను, మాయిక (ప్రాకృత) జగత్తును భూమిగను భావించినయెడల ఆ రెండింటిని విభజించు సూక్ష్మరేఖయే తటమనబడును. ఈ సంధి స్థానముననే జీవశక్తి యున్నది. ఇచట జన్మించిన జీవులలో కొందరు భగవద్ధామమును దర్శించి ఆయనను సేవింప ఆయన ధామము వైపు వెడలిరి. కొందరు ప్రాకృత జగత్తునందలి మాయ యొక్క విచిత్రతవైపు మొగ్గుచూపగ బలవత్తరమగు మాయ దుర్బలురగు జీవులను తన వైపున కాకర్షించుకొని సూక్ష్మ, స్థూల శరీరములచే వారి స్వరూపమును కప్పివేసినది. ఈ విధముగ స్వస్థాన చ్యుతుడైన జీవుడు అనాదికాలమునుండి పాపపుణ్య కర్మలను చేయుచు పదునాల్గులోకములలో భ్రమించుచున్నాడు. పుణ్య కర్మల వలన ఊర్ధ్వలోకములైన భూ భువః స్వః మహ జన తపః సత్య లోకములకు, పాపకర్మల వలన అధోలోకములైన అతల వితల సుతల తలాతల రసాతల మహాతల పాతాళ లోకములకు వెడలుచుండును. భగవంతుని యొక్క బహిరంగ శక్తియగు దుర్గాదేవి ఈ బ్రహ్మాండమునకు అధిష్ఠాన దేవత. ఈమె భగవదారాధన చేయు జీవులకు బ్రహ్మాండము ఆవలనున్న ద్వంద్వాతీతమగు

వైకుంఠధామమునకు దారిచూపును. భగవదారాధన చేయని జీవులను సుఖ దుఃఖములనెడి ద్వంద్వములతో గూడిన ఈ బ్రహ్మాండమునందే త్రిప్పుచుండును.

మాయిక జగత్తులో మునిగితేలుచున్న జీవులను తన దివ్య సన్నిధానమునకు కొనిపోవుటకు కరుణామయుడగు భగవంతుడు వైకుంఠమున గల దివ్య క్షేత్రములను భారతదేశమునందవతరింప జేసెను. అందువలన దీనిని క్షేత్రావతరణమని చెప్పవచ్చును. అంతియే గాక భగవంతుడు స్వయముగ ఆయాక్షేత్రములయందు అర్చా రూపములతో ప్రకాశమయ్యెను. బదరీయందు నారాయణుడు, పూరీక్షేత్రమందు జగన్నాథుడు, తిరుపతిలో వేంకటేశ్వరుడు, శ్రీరంగమున రంగనాథుడు, పండరీపురమున పాండురంగడు, తిరువనంతపురమున అనంత పద్మనాభుడుగ వెలసెను.పవిత్రములైన గంగ,యమున, సరస్వతీ, నర్మద, సింధు, గోదావరి, కావేరి మున్నగు నదులను మానస సరోవరము, బిందు సరోవరము, నారాయణ సరోవరము, పావన సరోవరము, పుష్కర తీర్థము, రాధాకుండము , శ్యామ కుండము మున్నగు అసంఖ్యాకములైన సరోవరములను గూడ ఈ లోకమునందవతరింప జేసెను. మానవులు ఆయా క్షేత్రములను దర్శించి ఆయా పవిత్రనదులయందు సరోవరములయందు స్నానమాచరించి, అర్చా మూర్తులను సేవించినను అచట నివసించినను భగవత్సాన్నిధ్యమును తప్పక పొందగలరు.

ప్రాచీన కాలమునుండి అనేకులు తీర్థ పర్యటన చేసి వారి జన్మలను చరితార్థము చేసికొనినట్లు పురాణేతిహాసములందు పెక్కు దృష్టాంతములు గలవు. సత్యయుగమున ప్రహ్లాదుడు, త్రేతాయుగమున శ్రవణకుమారుడు, ద్వాపరయుగమున విదురుడు, మైత్రేయుడు, బలరాముడు, పంచ పాండవులు తీర్థ పర్యటన గావించినట్లు భారత, భాగవత, రామాయణములలో చెప్పబడినది. తీర్థ పర్యటన చేయుట భారతీయ సంస్కృతి. బద్ధ జీవులు పాపవిముక్తికొరకు తీర్థపర్యటన చేయుదురు. కాని ముక్తపురుషులు "తీర్థీ కుర్వన్తి తీర్థాని" అనినట్లు తమ పర్యటన ద్వారా తీర్థములను కూడ పవిత్రము గావింతురు. అంతేగాక అచ్చట భగవదారాధన చేసి భగవత్సాక్షాత్కారమును క్షేత్ర వైభవానుభూతిని పొందెదరు. తీర్థయాత్రలను చేయుటచే భుక్తిని కోరువారు ఐహిక సుఖములను, ముక్తిని కోరువారు ముక్తిని పొందెదరు. తీర్థ విధులను పాటించుచు పితృ తర్పణాదులను చేయువారు పితృఋణము నుండి విముక్తులగుదురు. భగవత్కృపనుగోరి భాగవతోత్తములు చూపిన ఆదర్శమార్గములో తీర్థపర్యటన చేయువారు భగవత్కృపా కటాక్షమును పొందెదరు.

నేడు పెక్కుమంది పైవిధముగ గాక తీర్థయాత్రలను విలాసయాత్రలుగ చేయుచున్నారు. దానివలన వారికి వృథాశ్రమయే గాక పుణ్యక్షేత్రముల పట్ల అపరాధము గూడ కలుగును. కావున క్షేత్రమహిమ నెరింగి పవిత్రభావముతో తీర్థయాత్రలు చేయుట శ్రేయస్కరము.

# ౨. చతుర్విధ ధామములు

క్రిందటి అధ్యాయములో భారతదేశమునందలి పుణ్యక్షేత్రములు భగవత్కృపచే ఆయన యొక్క సంకల్పానుసారము పుడమిపై నవతరించినవని తెలిసికొంటిమి. అట్టి క్షేత్రములలో అత్యంత ప్రధానమైనవి నాలుగు. అవి ఉత్తరమున బదరికాశ్రమము, దక్షిణమున రామేశ్వరము, తూర్పున శ్రీ జగన్నాథక్షేత్రము, పడమర ద్వారకా పట్టణము. వీటినే చారి (నాలుగు) ధామములందురు. ఈ క్షేత్రములు భారతదేశము యొక్క నలువైపుల ఎల్లలుగ యుండుట వలన వీటిని దర్శించునపుడు సమస్త పుణ్య క్షేత్రములను గూడ దర్శింపవచ్చును.

**1.బదరికాశ్రమము:-**

రెండువేలమైళ్ళు పొడవు, మూడువందల మైళ్ళు వెడల్పు గల హిమాలయ పర్వతములలో నున్న అనేక క్షేత్రములలో విఖ్యాతి గాంచినది శ్రీ బదరికాశ్రమము. బదరీ (రేగి) వృక్షములతో నిండియున్న కారణమున దీనికి బదరికాశ్రమమని పేరు వచ్చినది. అవతారపురుషులగు శ్రీనరనారాయణ ఋషులు తపస్సు చేసిన స్థలమీ బదరికాశ్రమము. ఇంద్రుడు శంకించి నరనారాయణుల తపస్సును భంగపరచుటకై అప్సరసలను పంపెను. కాని ఆదిపురుషుడగు నారాయణఋషి యావిషయమును గ్రహించినవాడై తనను సేవించుచున్న దివ్యరూపము గల అనేక స్త్రీలను యోగమాయాబలముచే వారికి ప్రత్యక్షము గావించెను. వారి రూప ప్రభావముచే స్వర్గలోకమునుండి వచ్చిన అప్సరసలు తేజోవిహీనలై వెలవెల బోయిరి. నారాయణఋషి తన ఊరువు నుండి యొక అప్సరసను సృష్టించి ఇంద్రలోకమునకు ఆభూషణముగ పంపెను. ఆమెయే ఊర్వశి.

శ్రీనరనారాయణులు బదరియందు అర్చారూపముతో నిత్యము దేవతలచే పూజింపబడుచుండెను. కాలక్రమమున బౌద్ధులు ఆ అర్చామూర్తులను గంగానదిలో పడవేయగా భగవదాదేశముచే శ్రీమచ్ఛంకరాచార్యులు వానిని వెలికి తీసి పునఃప్రతిష్ఠించి వైదిక ఆగమ నియమప్రకారము నిత్యకైంకర్యమును ఏర్పాటు చేసెను.

బదరికాశ్రమమును గూర్చి శ్రీమద్భాగవతములో స్వయముగ శ్రీకృష్ణుడు ఉద్ధవునితో ఇట్లు చెప్పెను.

గచ్ఛోద్ధవ మయాఽఽదిష్టో బదర్యాఖ్యాం మమాశ్రమమ్ ।
తత్ర మత్పాద తీర్థోదే స్నానోప స్పర్శనైః శుచిః ॥ (భా.11. 29.41.)

ఉద్ధవా! నీవు నాయాజ్ఞననుసరించి నాయాశ్రమమగు బదరికాశ్రమమునకు వెడలుము. అచట నా చరణ రజముచే పవిత్రముగ చేయబడిన తీర్థమునందు స్నాన, ఆచమనాదులను చేసి పవిత్రుడవు కమ్ము.

శ్రీకృష్ణద్వైపాయన వ్యాసదేవుడు శ్రీమద్భాగవతమును రచించిన పవిత్రస్థలము శ్రీ బదరికాశ్రమము. ఆయన యిచ్చటనే తనపుత్రుడగు శుకమహర్షికి ప్రప్రథమముగ శ్రీమద్భాగవతమును చెప్పెను. ఈస్థలమును 'శమ్యాప్రాస'మని కూడ అందురు.

## 2.పూరీ క్షేత్రము:-

నాలుగు ధామములలో రెండవది పూరీక్షేత్రము. ఈక్షేత్రమందు పురుషోత్తముడు జగన్నాథుడునగు భగవంతుడు విరాజమాను డగుచుండుటచే నిది పురుషోత్తమ క్షేత్రమనియు జగన్నాథక్షేత్రమనియు పేరొందినది. ఇది శంఖాకృతిలో యుండుటచే 'శంఖక్షేత్ర'మనియు, భగవంతునియొక్క స్వరూపశక్తియైన శ్రీదేవియొక్క ప్రభావముచే నిండియుండుట వలన 'శ్రీక్షేత్ర'మనియు యనెదరు. 'శ్రీ'శబ్దమునకు సర్వలక్ష్మిమయి అంశినియగు శ్రీరాధికయని మరొక యర్థము. ఏక్షేత్రమునందు మధుర రసో పాసకభక్తులు శ్రీశ్రీరాధిక యొక్క సేవామాధుర్య ఔదార్య ప్రభావములను అనుభవించుచుందురో అదియే శ్రీక్షేత్రము. శ్రీనీలమాధవుడే జగన్నాథస్వామిగ ప్రకటమగుట వలన దీనికి 'నీలాచలక్షేత్ర' మని పేరువచ్చినది. శ్రీల బృందావనదాస ఠాకూరు మహాశయులు రచించిన శ్రీచైతన్యభాగవతమునందు స్వయముగ శ్రీకృష్ణుడే శివునకు ఈ శ్రీక్షేత్రమహిమ నీవిధముగ చెప్పినట్లు వ్రాయబడినది ."శివా! నా పరమగోప్యమైన, అతి రహస్యమైన స్థానము పురషోత్తమ క్షేత్రము. అది సింధుతీరమునందు వటవృక్షము వద్ద నీలాచల నామముతో అతి రమ్యస్థానముగ వెలుగొందుచున్నది. ప్రళయకాలమునందు అనంత బ్రహ్మాండములు లయమొందినప్పటికి ఈక్షేత్రము మాత్రము చెక్కు చెదరక అట్లే యుండును. ఇచ్చట నేను యుండి భువనమంగళ కార్యములను చేయుచుంటిని. ఇచ్చటనున్న క్రిమి కీటకాదులు, జంతువులు గూడ చతుర్భుజధారులైన దేవతామూర్తులే! ఇచ్చట శయనించినంత మాత్రమున ప్రణామము చేసినట్టి లేదా సమాధియందున్నట్టి ఫలితము లభించును. భ్రమణము చేసినంతనే ప్రదక్షిణ ఫలము, పరస్పర సంభాషణ మాత్రముచే నన్ను స్తుతించిన ఫలము కలుగును. నానామముతో ప్రసిద్ధినొందిన ఈ జగన్నాథక్షేత్రము నాకత్యంత ప్రియమైనది.

ఒకానొకప్పుడు ద్వారకా పట్టణమునందు శ్రీకృష్ణునియొక్క పదునారువేల నూట యెనమండుగురు మహిషులు బృందావనమునందు శ్రీకృష్ణుడు విహరించిన విధమును, బృందావన వైశిష్ట్యమును వివరించవలసినదిగ రోహిణిదేవిని అభ్యర్థించెను. రోహిణి అత్యంత పులకితగాత్రయై తన్మయముతో గోపికల మాహాత్మ్యమును, వారితో శ్రీకృష్ణుని ప్రేమమయ విహారమును చెప్పసాగెను. కృష్ణ బలరాములు అచ్చటకు వత్తురను శంకతో సుభద్రను ద్వారము వద్ద కావలయుంచెను. ఇంతలో కృష్ణబలరాములచ్చటకు ఏతెంచిరి. వారిరువురు వెలుపలనే యుండి రోహిణీదేవి వివరించుచున్న బృందావనలీలలను శ్రవణము చేయుట వలన కలిగిన స్మృతిచే

మధురభావముతో (సుభద్రతో సహా) వారు ముప్పురు అష్టసాత్త్విక వికారములు కలిగి విచిత్రాకృతులను దాల్చిరి. అప్పుడు నారదుడు శ్రీబలరామ సుభద్ర శ్రీకృష్ణులను దర్శించి పరమానందభరితుడై ఆరూపములతోనే వెలయుడని ప్రార్థింపగ జగన్నాథక్షేత్రమున అట్లే వెలసెను.

కలియుగ పావనావతారి, సాక్షాత్ శ్రీరాధాకృష్ణ మిళిత తనువు యగు శ్రీచైతన్య మహాప్రభువు సన్యాసానంతరము అవతారకాలములో చివరి పదునెనిమిది సంవత్సరములు ఈ జగన్నాథ క్షేత్రమునందుండి యుగధర్మమైన నామసంకీర్తనమును ప్రచారముచేసి తన అంతరంగ పార్షదులగు శ్రీస్వరూప దామోదర రాయరామానందుల తో పండ్రెండు సంవత్సరములు కృష్ణప్రేమ యొక్క విప్రలంభరసమును ఆస్వాదించిరి. నిరంతరము కృష్ణవియోగముచే విరహోన్మాద చేష్టలతో రేయింబవళ్ళు గడిపిరి. ఒక్క క్షణములో ఆయన అవయవములు క్షీణించెడివి, మరుక్షణములో ఉబ్బుచుండెడివి. అప్పుడప్పుడు హస్తములు, పాదములు, శిరస్సు శరీరమునందు కుంచించుకుపోయి కూర్మరూపమున నుండెడివారు. ఈ విధముగ అద్భుత భావ శరీరమును ప్రకాశింపచేయుచు శ్రీకృష్ణదర్శనము లేక విరహముతో "నా ప్రాణనాథుడైన శ్రీకృష్ణుడెచటనున్నాడు? వ్రజేంద్రనందనుని ఎక్కడ పొందెదను? ఈ మనో దుఃఖమునెవరు తెలిసికొనగలరు? వ్రజేంద్రనందనుని దర్శనము లేనిచో నాగుండెలు బ్రద్దలగుచున్నవి" అని ఈ విధముగ విహ్వాల మనస్కులై విలపించుచుండిరి రాధయొక్క భావముతో ఇట్టి కృష్ణ విరహమను విప్రలంభరసమును "గంభీర" అను స్థలమున ఆస్వాదించుటచే ఈ క్షేత్రమునకు "రసక్షేత్రమ"ని పేరువచ్చినది.

నీల మాధవుడు తన భక్తుడైన ఇంద్రద్యుమ్న మహారాజును అనుగ్రహించి దారు బ్రహ్మరూపములో అర్చామూర్తిగ నిచట వెలసెను. ఇంద్రద్యుమ్న మహారాజు అత్యంత ప్రీతితో జగన్నాథ మందిరమును నిర్మించెను. తరువాతి కాలములో శ్రీజగన్నాథుడు శత్రువులగు కంచిరాజు చోళరాజులతో స్వయముగ యుద్ధము జేసి తన సేవకుడగు గజపతి మహారాజును రక్షించి తన భక్త వత్సలతను చాటెను.

శ్రీజగన్నాథునకు ప్రతిదినము బాల్యభోగము, రాజ భోగము,మున్నగు బహు విధములగు ద్రవ్యములతో నైవేద్యము చేయుదురు. ఈ నైవేద్య ప్రసాదమును అనేకమంది భక్తులకు విక్రయించు చోటును 'ఆనంద బజారు' యందురు. దేశ నలుమూలలనుండి జనులు రథయాత్ర మహోత్సవమును తిలకించి జగన్నాథ ప్రసాదమును గొని పోవుదురు.

**3.రామేశ్వరము :-**

దక్షిణ భారతదేశమున సముద్రతీరముననున్న రామేశ్వరము ఒక ద్వీపము. భక్తులు కాశి నుండి గంగాజలమును తెచ్చి ఇచ్చటనున్న శ్రీరామలింగేశ్వరునకు అభిషేకము జేసి సర్వపాపవిముక్తులై కృతార్థులగుదురు. దేశ నలుమూలలనుండి అధిక సంఖ్యలో భక్తులు వచ్చి రామేశ్వరుని సేవింతురు. ఇచటి నుండి యే హనుమంతుడు లంకను దాటెనని ప్రతీతి. రాజ్యములు మారిననూ నగరములు శిథిలమైననూ ఈ క్షేత్రమట్లే యున్న కారణమున దీనిని 'మార్పులేని నగరమ'ని యందురు. శ్రీరాముడు బ్రాహ్మణుడగు రావణాసురుని సంహరించి లంకాపురమునుండి వచ్చునప్పుడు బ్రహ్మహత్యా దోష నివారణార్థము శివలింగమును ప్రతిష్ఠించినట్లు చెప్పుదురు. అందువలననే ఇచ్చటి శివుని పేరు రామేశ్వరుడు. "రామః ఈశ్వర యస్య సః" అనగా శ్రీరాముడు ఎవరికి ఈశ్వరుడో ఆతడు రామేశ్వరుడని అర్థము. ఇచట రాముడు శివుని ఆరాధించి, లోకమునకు ఆదర్శము చూపెనని శాస్త్రకారులు చెప్పుదురు. శ్రీరాముడు శివుని ప్రతిష్ఠచేయు నిమిత్తము శివలింగమును తెచ్చుటకు ఆంజనేయుని కాశీక్షేత్రమునకు పంపెను. ఆంజనేయుడు శివలింగమును తెచ్చుట ఆలస్యమయిన కారణమున సీతాదేవి ఇసుకతో శివలింగమును జేయగా రాముడు ఆలింగమును ప్రతిష్ఠించెను. తరువాత ఆంజనేయుడు తెచ్చిన కాశీవిశ్వనాథ లింగమును ప్రక్కగ ప్రతిష్ఠించిరి. ఈ దేవాలయములోని మూడవ ప్రాకారము పెక్కు శిల్పకళలతో 1320 స్తంభములతో నిర్మింపబడి కడు విచిత్రముగ యుండును. రామేశ్వరము ద్వాదశ జ్యోతిర్లింగములలో యొకటి.

**4. ద్వారక :-**

శ్రీకృష్ణుడు కంసుని వధింపగా కంసుని భార్యలగు అస్తి,ప్రాప్తి తమ తండ్రియగు జరాసంధునకు ఆవార్తను తెలిపిరి. తన కుమార్తెల కట్టి దయనీయమగు స్థితి సంభవించినందులకు జరాసంధుడు కోపించి, పృథివిని యాదవ శూన్యముగ జేయదలచి పదునేడు మారులు అసంఖ్యాకమగు సైన్యముతో మథురను ముట్టడించి కృష్ణ బలరాములతో యుద్ధముజేసెను. కాని భూభార హరణమునకై యవతరించిన శ్రీకృష్ణ భగవానుడు జరాసంధుని వధింపక యాతని సైన్యమును మాత్రము సంహరించెను. శ్రీకృష్ణుడు బలరామునితో గలసి కాలయవనుని సంహరింప వెడలుచు జరాసంధుడు మరల తమ పట్టణమును ముట్టడించునని శంకించి మానవులు చొరరాని విధముగ పండ్రెండు యోజనముల విస్తీర్ణము గల యొక దుర్గమును సముద్ర మధ్యమున నిర్మించి తన యోగమాయా బలముచే ఆత్మీయులనందరను ఆపట్టణమునకు జేర్చెను. అదియే 'ద్వారకా' పట్టణము. నేటికిని సముద్ర మధ్యమున నున్న యా పట్టణమున శ్రీకృష్ణుడు ద్వారకాధీశునిగ అత్యంత వైభవముతో సేవింపబడుచున్నాడు. ఈ ద్వారకా పట్టణము అరేబియా సముద్రమునందు గలదు.

--o--

# 3.సప్త మోక్షధామములు

అయోధ్యా మథురా మాయా కాశీకాంచీహ్యవంతికా ।
పురీద్వారవతీచైవ సప్తైతా మోక్షదాయికాః ॥

అయోధ్య, మథురా, మాయా, కాశీ, కాంచీ, అవంతికా, ద్వారావతీ యను యేడింటిని సప్త మోక్షదాయికలని చెప్పుదురు. ఏలనన ఈ క్షేత్రములను దర్శించిన యెడల భగవత్కైంకర్య రూపమగు మోక్షము లభించును.

**1. అయోధ్య :-**

అయోధ్య మర్యాద పురుషోత్తముడగు శ్రీరామచంద్రుని జన్మభూమి. బృందావనమునందు అడుగడుగునా కృష్ణమందిరములున్నట్లే అయోధ్యలో కూడ అంతట రామాలయములు కనబడును. ఇది దశరథ మహారాజు పుత్రకామేష్టియాగము చేసిన స్థలము మరియు కోసలదేశమునకు రాజధాని. సూర్యవంశచక్రవర్తియగు దశరథమహారాజు పరిపాలనచేయు సమయమున 13 యోజనముల విస్తీర్ణము కలిగిన ఈ అయోధ్య, కాలాంతరమున శిథిలమై నామమాత్రము మిగిలియున్నది. విక్రమాదిత్యుడు తన పరిపాలన కాలములో రామచంద్రుని చరితమునసనుసరించి లుప్తములైన లీలాస్థలములను రామకోట, రాజభవనము మున్నగు దేవాలయములను పునరుద్ధరించెను. ఇచట ముఖ్యముగ రామచంద్రుడు ఆవిర్భవించిన శ్రీరామలాలా మందిరము, రామకోట, కనకభవనము (రామచంద్రుడు స్వయముగ నివసించిన భవనము) , హనుమాన్ ఘడీ, సంకటమోచన హనుమాన్ మందిరము, రాజమహల్, రాజగద్దీ - పట్టాభిషేము జరగిన స్థలము, కౌసల్యాభవనము, రామాంతఃపురము, ఆనందభవనము, కైకేయి కోపగృహము మున్నగునవి గలవు. ఇచ్చట రామానంది సంప్రదాయ సాధువులు పెక్కుమందియుందురు. శ్రీరామచంద్రుడు అవతారమును చాలించి అయోధ్యపురవాసులతో వైకుంఠమునకేగునపుడు సరయూనది యందు ప్రవేశించిన రేవును ముక్తాఘాట్ యందురు. ఇంకనూ జానకీఘాట్, రామఘాట్, పాపవిమోచనఘాట్ అను పెక్కు రేవులు గలవు.

**2. మథుర :-**

లీలాపురుషోత్తముడగు శ్రీకృష్ణుని యొక్క జన్మభూమి మథుర. మథుర యొక్క మాహాత్మ్యమును గూర్చి పద్మపురాణము, ఆదివరాహపురాణము, వాయుపురాణము,

స్కందపురాణము, శ్రీమద్భాగవతాది గ్రంథములలో సవిస్తారముగ జెప్పబడినది. మథుర భోజపతియగు ఉగ్రసేనుని రాజధాని. పూర్వము మధువనమున శ్రీరామచంద్రుని సోదరుడగు శత్రుఘ్నుడు మధుపుత్రుడైన లవణాసురుని సంహరించి మథురా పురమును నిర్మించెను. దేవకీ వసుదేవులకు కంసకారాగారమున చతుర్భుజరూపముతో దర్శనమిచ్చి తాను సాక్షాత్తుగ భగవానుడేయని లోకమునకు తెలియజెప్పిన క్షేత్రమిది. భగవంతుని యొక్క అవతారకాలమునందు దేవకీగర్భస్థుడగు కృష్ణుని బ్రహ్మ, వరుణ, రుద్ర, ఇంద్రాది దేవతలు ఇచట స్తుతించిరి. భగవానుని యాదేశానుసారము వసుదేవుడు ఆయనను నందగృహమునందుంచి, యోగమాయను మథురకు తీసికొనివచ్చెను. కృష్ణుడు జన్మించినది మొదలు ఆతనివలన తనకు మరణము తప్పదని తెలిసికొనిన కంసుడు వరుసగ పూతన మున్నగు రాక్షసులను ప్రేరేపించి చివరకు చాణూర ముష్టికులతో మల్లయుద్ధమునందు బలరామ కృష్ణులను సంహరింప ప్రయత్నించినప్పటికిని కృష్ణునిచేతిలో కంసుడు మరణింపక తప్పలేదు. కృష్ణుడు కంసుని మథురలో సంహరించిన స్థలమును "కంసటీల" యందురు. కంస సంహారానంతరము కృష్ణుడు విశ్రాంతి తీసికొనిన స్థలమును "విశ్రామఘాట్" అని చెప్పుదురు. కృష్ణ బలరాములు మథురకు వచ్చినప్పుడు రాజవీథులలో వారి యొక్క రూప లావణ్యమును దర్శించిన మథురావాసులు తమ జీవితము ధన్యాతి ధన్యమని భావించిరి. కృష్ణుడు కుబ్జను యనుగ్రహించుట, రజకుని సంహరించుట, కువలయా పీడమను ఏనుగును సంహరించుట ఇచ్చటనే జరగినవి. కంసుని దర్బారునకు పోవు ద్వారమును హోలీగేట్ అనెదరు. శ్రీకృష్ణుడు జన్మించిన కారాగృహమునకు అతి సమీపముననే సత్యయుగమునాటి ఆదికేశవస్వామి దేవాలయము కలదు. పెక్కుమంది యాత్రికులు శ్రీకృష్ణ జన్మస్థానమును దర్శింతురేగాని ఈ యాదికేశవస్వామి దేవాలయమును దర్శింపరు. మథురలో శివుడు భూతేశ్వరుడు, రంగేశ్వరుడు యను పేర్లతో క్షేత్రపాలకుడుగ యున్నాడు. భగవంతుడు వరాహావతారము నెత్తి భూదేవిని ఉద్ధరించి ఎచట అంతర్ధానమునొందెనో ఆస్థలమును శూకర క్షేత్రమని చెప్పుదురు. భగవంతుడు వరాహావతారమెత్తిన ఆ శూకరక్షేత్రము మథురకు పశ్చిమభాగముననున్నది.

**3. మాయ :-**

హరిద్వారమునే 'మాయ' యను పేరుతో వ్యవహరించు చున్నారు. ఏలననగా ఇచ్చట మాయాదేవి యొక్క ఆలయమున్నది. ఈ దేవాలయము సత్యయుగమునాటిది. కేదార్,బదరీ క్షేత్రములకు వెళ్ళుటకు ముఖద్వారముగ నుండుటచే దీనిని హరద్వార్ - హరిద్వార్ అనికూడా పిలచుచున్నారు. పూర్వము సగర చక్రవర్తి పుత్రులకోసము

భగీరథుడు ఘోర తపమాచరించి గంగను భూలోకమునకు రప్పించిన స్థలము ఈ హరిద్వారము. హిమాలయమునుండి గంగ అలకానంద, మందాకిని యను పేర్లతో ప్రవహించుచు భూతలమునకు వచ్చినప్పుడు గంగయని పిలువబడుచున్నది. కుంభమేళా జరుగు నాలుగు స్థానములలో 'హరిద్వార్' ప్రసిద్ధిగాంచినది. దక్షప్రజాపతి యజ్ఞము చేసిన స్థలము "కన్ఖళ్" ఇచ్చటనే యున్నది.

మాయ యనగా రాధాకృష్ణ మిళిత యవతారమగు శ్రీకృష్ణచైతన్య మహాప్రభువు ఆవిర్భవించిన స్థలము శ్రీధామ మాయాపురమని కూడ చెప్పుదురు. శ్రీల ప్రభోదానంద సరస్వతీ ప్రభువులవారు "నవద్వీప శతకము" లో దీని రహస్యమును వ్యక్తము చేసిరి. శ్రీమన్మహాప్రభువు తన నిత్యపార్షదులతో యవతరించి నామరసమును ఆస్వాదించిన స్థలము శ్రీనవద్వీపధామము. ఈ నవద్వీపము నవవిధ భక్తికి ప్రతీక. ఆ తొమ్మిది ద్వీపములు యేవియనగా గంగానదికి తూర్పు దిక్కున (i) అంతర్ద్వీపము (ఆత్మనివేదనము), (ii) సీమంతద్వీపము (శ్రవణము), (iii) గోద్రుమద్వీపము (కీర్తనము), (iv) మధ్యద్వీపము (స్మరణము); ఈ నాలుగు ద్వీపములు, పశ్చిమమున (v) కోలద్వీపము (పాదసేవనము), (vi) ఋతుద్వీపము (అర్చనము), (vii) జహ్ను ద్వీపము (వందనము), (viii) మోదద్రుమద్వీపము (దాస్యము), (ix) రుద్రద్వీపము (సఖ్యము) గలవు. ఈ ద్వీపములందు వరుసగా బ్రహ్మ, పార్వతీదేవి, ఇంద్రుడు, సప్తఋషులు, వరాహదేవోపాసకుడగు నొక విప్రుడు, ఋతువులలో రాజగు వసంతఋతువు (మిగిలిన ఋతువులతో గలసి), జహ్నుముని, శ్రీసీతాదేవి, రుద్రుడు తపస్సు చేసి శ్రీమన్మహాప్రభువును దర్శించి ప్రేమానందమునొందిరి. పదునారు క్రోసుల పరిమితి గల ఈ నవద్వీపధామము పద్మాకృతితోనున్నది, అంతర్ద్వీపము నడుమ కర్ణిక భాగముగను, మిగిలిన ఎనిమిది ద్వీపములు పద్మము యొక్క రేకులవలెను ఉన్నవి. శ్రీధామ మాయాపురమున శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతీగోస్వామి ప్రభుపాదులు గౌడీయవైష్ణవులకు మూలకేంద్రమగు శ్రీచైతన్య మఠమును క్రీ.శ.1918 సం॥లో స్థాపించి, భారతదేశము నలుమూలల 64 భక్త్యంగములకు ప్రతీకగా 64 గౌడీయ శాఖామఠములను స్థాపించిరి.

### 4. కాశీ :-

అత్యంత పురాణ ప్రసిద్ధమైన దీకాశీక్షేత్రము. దీనికే వారణాసియనిపేరు. ఇది శివుని రాజధాని. పూర్వము శిబిచక్రవర్తి, హరిశ్చంద్రుడు ఈ కాశీక్షేత్రమును పాలించిరి. కాశి పట్టణము ధనుస్సు ఆకారమున యున్నందున దీనిని ధను: క్షేత్రమని యందురు.

ఇచ్చట గంగ ఉత్తరవాహినియై ప్రవహించు చున్నది. శ్రీమద్భాగవతము, పద్మపురాణములలో కాశీయొక్క వైశిష్ట్యము వర్ణింపబడియున్నది. ద్వాదశ జ్యోతిర్లింగములలో కాశీ విశ్వేశ్వరుడొకడు. ఇచట శివుడు ఆశ్రిత జనులను రక్షించు చుం డును. కాశీక్షేత్రమునందు మరణించిన వారికి కర్ణమునందు శివుడు రామమంత్రము నుపదేశించును. పెక్కుమంది భారతీయులు కాశీక్షేత్రమును దర్శించుట, అచ్చట కొంతకాలము నివసించుట, శ్రాద్ధాది తీర్థ విధులను పాటించుట చేయుచుందురు. శివశక్తి స్వరూపిణియగు అన్నపూర్ణ కాశీ అన్నపూర్ణగ పేరొంది నిరంతరము సర్వులకు అన్నదానము చేయుచుండును. ఇచ్చట తులసీదాసు 'రామచరితమానస' మను గ్రంథమును రచించి రామునకు ప్రీతిపాత్రుడయ్యెను. తులసీదాసును సమస్త విపత్తుల నుండి హనుమంతుడు రక్షించిన స్థలమిది. ఇచ్చటనే సంకటమోచన హనుమాన్ దేవాలయము గూడ కలదు. కబీరు, తులసీదాసు, సమర్థ రామదాసు మున్నగు పెక్కుమంది భక్తులీ కాశీక్షేత్రమున శివునియనుగ్రహము వలన రామసాక్షాత్కారము నొందిరి.

**5. కంచి :-**

ఈ పుణ్యక్షేత్రము యొక్క విశేషమేమనగా సాక్షాత్తు విష్ణు భగవానుని నామముతోనే "విష్ణుకంచి" యని ప్రసిద్ధిగాంచినది. ఇచ్చటి అర్చామూర్తిని 'వరదరాజు' యని పిలతురు. ఈదేవాలయము సత్యయుగమునాటిది. ఇచ్చట శివుడు క్షేత్రపాలక రూపముతో వెలసెను. అందువలన దీనికి 'శివకంచి' యని పేరు వచ్చినది. భక్తులు ముందుగ శివుని దర్శించి ఆయన ఆశీర్వాదముతో విష్ణువును దర్శింతురు. శ్రీసంప్రదాయ ప్రధానాచార్యులగు శ్రీరామానుజాచార్యుల వారు ఇచ్చటనే విద్యాభ్యాసముచేసి ఆ తరువాత కంచి వరదరాజు సాక్షిగ త్రిదండ సన్యాసమును స్వీకరించి శ్రీసంప్రదాయమును విరివిగ ప్రచారము చేసిరి. ఇచ్చట శంకర సంప్రదాయమునకు సంబంధించిన శ్రీకంచికామకోటి పీఠము గూడ కలదు.

**6. అవంతిక :-**

సర్వవిద్యలకు మూలస్వరూపులు, సర్వజ్ఞులునగు బలరామకృష్ణులు అవంతీపుర నివాసియగు సాందీప మునికడ విద్యనభ్యసించిన గొప్ప పుణ్యక్షేత్రము అవంతిక. దీనిని ప్రస్తుతము ఉజ్జయిని యని పిలచుచున్నారు.

సాందీపముని ఆశ్రమమును ఇప్పటికిని ఇచ్చట దర్శింపవచ్చును. శ్రీకృష్ణుడు ఉద్ధవునకు అనేక తత్త్వ విషయములను ఉపదేశించుచు అవంతీదేశ నివాసియగు

'త్రిదండిభిక్షువు' కథను వివరించెను. ఇదియే శ్రీమద్భాగవతములో భిక్షుగీతమను పేర ప్రసిద్ధిగాంచినది. ఈ కథద్వారా భగవంతుడు సమస్త సుఖ దుఃఖములకు మనస్సే కారణమనియు సర్వకాల సర్వావస్థల యందు మానవుడు సమాహిత చిత్తుడై సహనము కలిగి మెలగుచూ అజ్ఞాన కల్పితమగు ఈ సంసారము నుండి వెలువడి తనయందు బుద్ధిని సంపూర్ణముగ నియమించవలెననియు, అదియే యోగ సారమనియు వివరించెను. త్రేతాయుగములో శ్రీరామచంద్రమూర్తి ఈ యవంతీపురముననే విశ్వామిత్ర ఋషికి పరిచర్యలు చేసి ఆతని కృపను పొందెను. ద్వాదశ జ్యోతిర్లింగములలో యొకటియగు ప్రఖ్యాతి గాంచిన మహాకాళేశ్వరాలయము, పవిత్రమగు సిప్రానది ఇచట గలవు. కుంభమేళ జరుగు నాలుగు స్థానములలో ఈ యవంతిక యొకటి. (మిగిలిన మూడు - హరిద్వార్, అలహాబాద్, నాశిక్.) ఇతిహాసము ననుసరించి ఈ అవంతిక ఒకప్పుడు భట్టి విక్రమార్కుని రాజధానిగ యుండెడిది. ఆతని కొలువులో తొమ్మండుగురు ఆస్థాన పండితులు నవరత్నములని ఖ్యాతినొందిరి. వారిలో భవభూతి, కాళిదాసుల ఆశ్రమములు ఇప్పటికిని సిప్రానదీ తీరమున నున్నవి. కాళిదాసు ఇచ్చటనే మహాకాళియొక్క అనుగ్రహమునొంది కావ్యములను రచించెను. ఈ ఉజ్జయిని భోపాల్ నుండి నాగ్దా వెళ్ళు మార్గములోనున్నది. పూర్వము జనమేజయ మహారాజు సర్పయాగము చేసిన చోటుగావున దీనిని 'నాగదహ' యనియు 'నాగ్దా' యనియు అందురు. ఇది ఉజ్జయినికి ఇరువది కిలోమీటర్ల దూరముననున్నది.

**7. ద్వారావతి :-**

శ్రీకృష్ణుడు కాలయవనునితో యుద్ధమునకు వెడలు సమయమున జరాసంధుడు వచ్చి తమ బంధువులకు కీడు కలుగచేయుననియు, అందువలన మానవులు చొరరాని యొక దుర్గమునందు వారిని ఉంచి తదుపరి కాలయవనుని సంహరించుటకు నిశ్చయించుకొనెను. అందులకై సముద్రములో పండ్రెండు యోజనముల విస్తీర్ణము కలగిన దుర్గమును, దానిలో ఆశ్చర్యకరమగు నగరమును నిర్మించెను. అదియే ద్వారక. ఆనగరమున విశ్వకర్మ తన శాస్త్రీయనైపుణ్యమునంతను ప్రదర్శించెను. తగు విధముగ రాజమార్గములు, వీథులు, చత్వారములు తీర్చి దిద్దబడియుండెను. దేవతావృక్షముల చేత, లతలచేత శోభిల్లు ఉద్యానవనములతోను, సువర్ణ శిఖరములు గల ఎత్తైన స్ఫటికమయములగు మేడలు, గోపురములు యుండెను. సువర్ణ కలశములు, అశ్వశాలలు మున్నగు ప్రకోష్ఠములు, మహామరకతమయ భూములు, పద్మరాగాది మణిమయ శృంగ సమన్వితములు రజత పీత లోహ నిర్మితములు, సువర్ణ నిర్మితములు

నగుగృహములు, దేవతా గృహములు, చంద్రశాలలు ఆనగరశోభను ఇనుమడింప చేయుచున్నవి. అట్టి ద్వారకా పట్టణములో తన ఆత్మీయులందరితో శ్రీకృష్ణుడు పరమానందముతో సుఖముగ నుండెను. శ్రీకృష్ణుడు రుక్మిణి, సత్యభామ, జాంబవతి, మిత్రవింద, కాళింది, నగ్నజిత్తి, భద్ర, లక్ష్మణ యను పట్టమహిషులను; నరకాసురుడు అపహరించిన పదునారు వేల మంది రాజకన్యలను అత్యంత వైభవముగ వివాహము చేసికొని ఈ ద్వారకయందే నివసించెను. ఇప్పటికిని రుక్మిణి మున్నగు పట్టమహిషుల వివాహ స్థలములు దర్బారులు ఇచ్చట కానవచ్చుచున్నవి. నారదుడు శ్రీకృష్ణభగవానుని యొక్క గార్హస్థ్యలీలను దర్శించి విస్మయమునొందెను. ద్వారకావాసులకు ఎన్నడును విపత్తులు కలుగవని శ్రీకృష్ణుడు అభయమిచ్చెను. ద్వారకా వాసులిప్పటికిని యావర ప్రభావము వలన రక్షింపబడుచున్నారు. ద్వారకలో రుక్మిణీ దేవాలయము కలదు.

పూర్వము సూర్యగ్రహణ సమయమున ద్వారకనుండి కృష్ణుడు, హస్తినా పురమునుండి పాండవులు, బృందావనము నుండి రాధిక మున్నగు గోపికలు కురుక్షేత్రమునకు వచ్చిరి. ద్వారకాధీశుడగు శ్రీకృష్ణుని యొక్క రాజవైభవమును చూచిన రాధిక సంతృప్తినొందక ఆతనితో యమునా తీరములలో కుంజ వనములలో గోపవేషముతో విహరించవలెనని కోరెను. శ్రీరాధిక కోరిక ప్రకారము శ్రీకృష్ణుడట్లే క్రీడించెను. అనంతరము వారి వారి స్వస్థలములకు వెళ్ళు సమయమున కృష్ణుడు రాధికను, గోపికలను ద్వారకానగరమునకు రావలసినదిగ కోరెను. కృష్ణుని కోరిక ప్రకారము రాధిక తన పరివారముతో ద్వారకకు వెడలగ రుక్మిణి, సత్యభామ మున్నగు మహిషులు శ్రీమతి రాధికను రాజలాంఛనములతో ఆహ్వానించి విందుకు ఏర్పాటు చేసెను. రాధిక తన ప్రభావము చేత గోలోక బృందావనము నచట నిర్మించి, అందు నివసించుచుండగ ఆ వైభవమును చూచిన రుక్మిణి, సత్యభామ మున్నగు మహిషులు "కృష్ణా! రాధికచే నిర్మింపబడిన ఈ బృందావన శోభను దర్శింపగ, నీవు బృందావనములో చేసిన లీలలన్నియు మాకు జ్ఞప్తికి వచ్చుచున్నవి. కావున ఆ లీలలన్నిటిని మరియు సర్వోత్కృష్టమగు రాసలీలను మాకు ఇచ్చట చూపవలయు"నని ప్రాధేయపడెను. రాసేశ్వరి యనుమతి యున్నచో తాను తప్పక చేయగలనని శ్రీకృష్ణుడు వారికి చెప్పెను. అప్పుడు మహిషులు రాధిక కడకు వెడలి అర్థింపగా ఆమె యంగీకరించెను. రాధా కృష్ణులిరువురు ఆ నవబృందావనములో గోపికలతో రాసక్రీడ చేసెను. ద్వారకా పట్టమహిషులే గాక బ్రహ్మాండములోని సర్వులు యాలీలలను దర్శించి కృతార్థులైరి. ఆ రాసక్రీడ జరగిన స్థలమునే ఇప్పుడు " గోపితల్ " యని చెప్పుచున్నారు. ఆ స్థలమంతయు గోపీచందనము (ద్వారక మట్టి) గ మారెను. శ్రీకృష్ణుని యొక్క అనుగ్రహమును కాంక్షించు గౌడీయ వైష్ణవులు, మధ్వులు యాచందనమును తిలకముగ ధరించుటను నేటికిని మనము చూచుచున్నాము.

--೦--

# 4. గోలోక ధామము

గోలోకము సర్వోర్ధ్వ స్థితియందున్న శ్రీకృష్ణుని యొక్క నిజధామము. దాని క్రింది భాగమున హరిధామము అనగా మహావైకుంఠ పరవ్యోమము, అనంతరము దాని క్రింద సదాశివుని యొక్క ముక్తిధామము, దానిక్రింద దేవీధామము విరాజ మానమగుచున్నవి. ఆది పురుషుడగు గోవిందుడే పైధామములనన్నిటిని తన యొక్క ప్రభావముచే నిరంతరము విద్యమానమగు నట్లు చేయుచున్నాడు. గోలోకమునందలి వృక్షములన్నియు సర్వఫలప్రదములగు కల్పవృక్షములే. భూమి యంతయు చింతామణిమయమే. జలాశులు అమృతమయములు. సాధువులు ఆ గోలోకమును మాయాగంధ రహితమైనదనియు, సర్వోత్కృష్టమగు శ్వేతద్వీపమనియు వర్ణించుచున్నారు. భగవంతుని యొక్క నిత్యధామమే గోలోకమనియు పరవ్యోమమనియు రెండుపేర్లతో పిలువబడుచున్నది. గోలోకమునే కృష్ణ లోకమని కూడా అందురు. ఈ గోలోకము తామరపుష్పమునందున్న కర్ణికగను దాని చుట్టు వైకుంఠము లోని ప్రకోష్టములు రేకులుగను ప్రకాశించుచున్నవి.

సహస్రపత్ర కమలం గోకులాఖ్యం మహత్పదమ్ ।
తత్కర్ణికార తద్ధామ తదనన్తాంశ సమ్భవమ్ ॥ (బ్రహ్మసంహిత)

సర్వోత్కృష్టమగు కృష్ణధామమే గోకులము. అది అనంతుని యంశ ద్వార నిత్య ప్రకటితమై యున్నది. ఆ గోకులము సహస్ర పత్రములతో గూడియున్న చిన్మయ కమల విశేషము. దాని నడుమనున్న కర్ణికారమే శ్రీకృష్ణుని నివాసస్థానము.

అంతటి వైభవముతో కూడిన గోలోకధామము భగవత్సంకల్పముచే భూలోకమునందు అవతరించినది. శ్రీకృష్ణభగవానుడు మథురలో అవతరించినప్పుడు ఆతనితో పాటుగ ఆతని ధామము కూడ ఇచట అవతరించినది. ఈ విషయమును శ్రీల రూపగోస్వామి ఉపదేశామృతమునందు ఇట్లు వివరించిరి.

వైకుంఠాజ్జనితో వరా మధుపురీ తత్రాపి రాసోత్సవాద్
బృందారణ్య ముదారపాణి రమణా త్తత్రాపి గోవర్ధనః ।
రాధాకుండమిహాపి గోకులపతేః ప్రేమామృతాప్లావనాత్
కుర్యాదస్యవిరాజతో గిరితటే సేవాం వివేకీ న కః ॥

శ్రీకృష్ణుడు జన్మించిన కారణము చేత వైకుంఠము కంటె మథురశ్రేష్టమగుచున్నది. మథురామండలములో బృందావనము, గోవర్ధనము, రాధాకుండము ఒకదానికంటె

మరియొకటి వరుసగా శ్రీకృష్ణుని లీలావిలాసములచే శ్రేష్ఠములగు చున్నవి. కావున భజన విజ్ఞులు, రసజ్ఞులు రాధాకుండమును నిరంతరము సేవింతురు.

ఈ మథురామండలము యొక్క మాహాత్మ్యము వివిధ పురాణములందు ఈ విధముగ చెప్పబడినది.

సా -గోప్రధాన - దేశత్వాత్ సర్వా శ్రీమథురోచ్యతే ।
గోలోక ఇతి గూఢోఽపి విఖ్యాతః స హి సర్వతః ॥

(బృ.భా.2 - 5 - 80)

ఈ మథురయందు గోసంపద ప్రధానముగ యుండుట వలననూ, శ్రీకృష్ణుని రహస్యలీలలు జరిగిన స్థలమగుట చేతనూ, గూఢమైన దయ్యునూ గోలోకమని సర్వత్ర ఖ్యాతినొందినది.

వింశతిర్యోజనానాన్తు మాథురం మమ మణ్డలమ్ ।
పదే పదేఽశ్వమేధీయం పుణ్యం నాత్ర విచారణమ్ ॥

(ఆది వరాహ పురాణము)

నా యొక్క మథురామండలము ఇరువది యోజనముల విస్తీర్ణము కలిగియున్నది. అచట ప్రతి పదక్షేపమునందును అశ్వమేధయజ్ఞ పుణ్యము లభించును. ఈ విషయమున తర్కమునకు తావు లేదు.

న విద్యతే చ పాతాళే నాన్తరీక్షేన మానుషే ।
సమన్తు మథురాయాహి ప్రియం మమ వసున్ధరే ॥

(ఆది వరాహ పురాణము)

ఓ వసుంథరా! మథురతో సమానమగు స్థానము నాకు పాతాళమునందుగాని, మానవలోకమునగాని, అంతరీక్షమునగాని నిశ్చయముగ లేదు.

సత్యం సత్యం మునిశ్రేష్ఠ బ్రువే శపథ పూర్వకమ్ ।
సర్వాభీష్టప్రదం నాన్యన్మథురాయాః సమం క్వచిత్ ॥

(బ్రహ్మాండ పురాణము)

ఓ మునిశ్రేష్ఠా! నేను శపథము చేసి నిజముగ సత్యము పలుకుచున్నాను. సర్వాభీష్టములనొసంగుటలో మథురతో సమానముగ వేరొక స్థానము మరెచ్చటనూ లేదు.

క్షేత్రపాలో మహాదేవో వర్తతే యత్ర సర్వదా ।
యత్ర విశ్రాన్తి తీర్థంచ తత్రకిం దుర్లభం ఫలమ్ ॥
త్రివర్గదా కామినాంచ ముముక్షుణాం చ మోక్షదా ।
భక్తీచ్ఛోర్భక్తిదా సా వై మధురామాశ్రయేద్బుధః ॥

(స్కంద పురాణము)

మధురయందు మహాదేవుడు సర్వదా క్షేత్రపాలునిగను, విశ్రామఘట్టమను తీర్థస్థానమును విరాజిల్లుచుండగా అచ్చట యే ఫలితము దుర్లభముగ నుండును? (అనగా దుర్లభమగునేదియునూ లేదు) ఆ మధుర భోగములను కోరు వారికి త్రివర్గదాయిని గనూ (అనగా ధర్మార్థకామముల నొసంగునది గను), మోక్షమును గోరువారికి మోక్షము నిచ్చునదిగనూ, భగవత్సేవను కోరువారికి భక్తిప్రదాయినిగను యున్నది. కావున విజ్ఞుడగు వ్యక్తి అట్టి మధురను ఆశ్రయించుట కర్తవ్యము.

తన్మండలం మధురంహి విష్ణుచక్రోపరిస్థితమ్ ।
పద్మాకారం సదాతత్ర వర్తతే శాశ్వతం నృప ॥

(ఆదివరాహ పురాణము)

ఓ రాజా! నిత్యమగునా మధురామండలము పద్మాకారముతో నుండి విష్ణుచక్రముపై శాశ్వతముగ విరాజిల్లుచున్నది.

మహారుద్రో మకారః స్యాత్ ధుకారో విష్ణుసంజ్ఞకః ।
రకారోఽన్తస్థో బ్రహ్మస్యాత్ త్రిశబ్దం మాధురం భవేత్ ॥

(పద్మపురాణము)

'మ,ధు,ర' యను మూడు శబ్దములచే ఏర్పడిన 'మధుర' లోని 'మ'కారము మహారుద్రుని, 'ధు' కారము, విష్ణువుని 'ర'కారము బ్రహ్మను సూచించుచున్నవి.

అహో మధుపురీ ధన్యా వైకుంఠాచ్చ గరీయసీ ।
దినమేకం నివాసేన హరౌ భక్తిః ప్రజాయతే ॥ (పద్మ పురాణము)

అహో ! శ్రీమన్నారాయణుని ధామమగు వైకుంఠమున కంటెనూ శ్రేష్ఠమైన మధుర నిజముగ ధన్యమైనది. అచట ఒక్కరోజు నివసించినచో శ్రీహరి పాదపద్మములయందు భక్తి ఉత్పన్నమగును.

ఉత్తరేణ తు 'గోవిన్దం' దృష్ట్వా దేవం పరం శుభమ్ ।
నాసౌ పతతి సంసారే యావదాహూత సంప్లవమ్ ॥

(ఆది వరాహ పురాణము)

ఆ పద్మము యొక్క ఉత్తర పత్రమున నున్న పరమ కళ్యాణదాతయగు 'గోవిందదేవు'ని దర్శించిన వ్యక్తి ప్రళయకాలము వరకు ఇక సంసారమున పతితుడు గాడు.

ఆ పద్మము యొక్క దక్షిణ పత్రముననున్న దివ్యరూపమైన మహావరాహమూర్తియే సాక్షాత్తు కేశవుడు. ఆ మూర్తిని దర్శించినచో బ్రహ్మలోకమున పూజనీయులగుదురు. జ్యేష్ట శుక్ల ద్వాదశినాడు మథుర విశ్రామ ఘాట్‌లో స్నానము చేసి ఆదికేశవుని దర్శించిన వారు పరమగతినొందెదరు.

నతత్ పుణ్యైర్న తద్దానైర్న తపోభిర్న తజ్జపైః ।
న లభ్యం వివిధైర్యాగైర్లభ్యతే మదనుగ్రహాత్ ॥
శ్రీవిష్ణు కృపయా నూనం తత్రావాసో భవిష్యతి ।
వినా కృష్ణ ప్రసాదేన క్షణమాత్రం న తిష్ఠతి ॥

(ఆది వరాహ పురాణము)

బహు పుణ్య - దాన - తపస్సు - జపముల వలనగాని లేదా వివిధ యాగముల ద్వారాగాని మథురావాసము లభించదు. కాని నా యొక్క (భగవానుని) కృప వలననే లభించును.

హరౌ యేషాం స్థిరా భక్తిర్భూయసీ యేషు తత్కృపా ।
తేషామేవ హి ధన్యానాం మథురాయాం భవేద్రతిః ॥

( పద్మ పురాణము)

శ్రీహరియం దెవరు అవిచలితమగు భక్తి కలిగియుందురో, ఎవరిపై శ్రీహరి యొక్క పరిపూర్ణ కృప యున్నదో అట్టి ధన్యులు మాత్రమే మథురా ధామము యందు ప్రీతికలిగి యుందురు.

సచ తద్వ్రజలోకానాం శ్రీమత్ప్రేమానువర్తినా ।
కృష్ణ శుద్ధతరేణైవ భావేనైకేన లభ్యతే ॥ (బృ.భా.ద్వి 5 - 81)

సుప్రసిద్ధమగు ఆ గోలోకప్రేమను ఎవరు యనువర్తించుచు శుద్ధభావముతో శ్రీకృష్ణునే భజింతురో వారు మాత్రమే ఆ గోలోకమును పొందెదరు.

తాదృగ్భగవతి ప్రేమా పారమైశ్వర్యదృష్టితః ।
సదా సమ్పద్యతే నైవ భయగౌరవ సమ్భవాత్ ॥ (బృ.భా.ద్వి. 5 - 82)

శ్రీకృష్ణుని ఎవరు సర్వదా ఐశ్వర్య జ్ఞానముతో భయగౌరవాదులు కలిగి సేవింతురో వారికి గోలోకప్రేమ ఎన్నడును లభించదు.

లౌకిక ప్రాణసుహృద్బుద్ధ్యా స సిధ్యతి ।
లోకాలోకోత్తరో యోఽసావతిలోకోత్తరోఽపి య : ॥ ("5 - 83)

ఆ ప్రేమ కేవలము లౌకిక వ్యవహారము ననుసరించి శ్రీనందనందనుని ప్రాణ బంధువుగ అనుభూతి నొంది సేవించినచో సిద్ధించును. కాని ఆప్రేమ లౌకిక ప్రేమవంటిదే యైననూ అది పృథివ్యాది లోకములందుగాని, పరవ్యోమమునందున్న వైకుంఠమునందుగాని లేదు.

శ్రీకృష్ణుని యొక్క పరమ రహస్యమగు వైభవసారమంతయు ఆగోలోకమునందే ప్రకాశించుచున్నది. వైకుంఠమునకు కూడ పైభాగముననుండుటచే గోలోకము ప్రపంచమునకే మకుటాయమానముగ నున్నది.

అట్టి గోలోకధామమును చేరి ఆయనను సేవించుటకు సృష్టికర్తయగు బ్రహ్మకు స్వయముగ శ్రీకృష్ణుడు అష్టాదశాక్షరములతో గూడిన మంత్రరాజమును ఉపదేశించెను. బ్రహ్మ యీ మంత్రమును తన మానసపుత్రుల కుపదేశించెను.ఇది భాగవత సారమైయున్నది. ఎవరు అష్టాదశాక్షర మంత్రమును సద్గురువు ద్వారా పొంది అనుశీలనము చేయుదురో వారు కూడ సంసార బంధనము నుండి ముక్తులై సాక్షాత్ గోలోకమున శ్రీకృష్ణుని నిత్య సేవలో ప్రవేశింతురు.

--o--

# 5. ద్వాదశవనములు

ధర్మరాజు, శ్రీకృష్ణుని యొక్క ప్రపౌత్రుడగు వజ్రనాభుని ద్వారకనుండి తీసికొని వచ్చి మథురాపట్టణమునకు రాజుగ చేసెను. ఒకరోజున పరీక్షిత్ మహారాజు వజ్రనాభుని దర్శించుటకు మథుర వచ్చెను. అపుడు వజ్రనాభుడు పరీక్షిన్మహారాజుతో - "ప్రభూ! నేను మథురానగర రాజ్య పదవిలో యున్నప్పటికి నిర్జన వనమునందే నివసించు చున్నట్లున్నది" యని ఆవేదన వ్యక్తము చేయగా, పరీక్షిత్తు వజ్రనాభుని ఓదార్చి, అతనిని శాంతపరచు నిమిత్తము శాండిల్య ఋషిని ఆహ్వానించెను. అప్పుడు శాండిల్య ఋషి వారితో యిట్లనెను - "నాయనలారా! మీరు ఈ వ్రజ భూమి యొక్క మాహాత్మ్యమును వినుడు. ఈ భూమి సత్త్వరజస్తమో గుణముల కతీతమగు పరబ్రహ్మ స్వరూపమైనది. సర్వవ్యాపకమగుట వలన 'వ్రజ'మని పిలువబడుచున్నది. ఇది వినాశములేనిది. సదా ఆనందమయమైనది. ముక్త పురుషులకు ఉపాస్య భూమి. కాలత్రయమున కతీతమై ప్రళయకాలమందు కూడ వికారరహితమై యుండును. అందువలన నీవు నా ఆదేశమునను సరించి ఎచ్చటెచ్చట ఏయే లీలలు జరిగినవో ఆ విధముగ నగరములను స్థాపింపుము. దాని వలన మీకు మనఃశాంతి కలుగును. "వజ్రనాభుడు శాండిల్యఋషి యాదేశానుసారము వ్రజమండలమునందు సర్వత్ర భ్రమణము చేసి కృష్ణ సంబంధములైన లీలాస్థలములనన్నింటిని ప్రకటించెను. కొన్ని చోట్ల గ్రామములను, కొన్ని చోట్ల నగరములను, కొన్ని చోట్ల కూపములను, మరికొన్నిచోట్ల శ్రీవిగ్రహ స్థాపనాది కార్యములను నెరవేర్చెను. కాని కాలక్రమములో అవియన్నియు లుప్తప్రాయములయ్యెను.

కలియుగ పావనావతారియు, కరుణాసాగరుడును, స్వయం భగవానుడునగు శ్రీచైతన్య మహాప్రభువు సర్వ జీవులకు శ్రీకృష్ణ ప్రేమనందించుటకై యవతరించి, యావద్భారతదేశమును పర్యటించుచు శ్రీబృందావన క్షేత్రమున కేతెంచిరి. అచట స్థావర జంగమములను కృష్ణప్రేమలో ముంచెత్తిరి. వ్రజమునందు సర్వత్ర పరిభ్రమణము గావించుచు శ్రీరాధాకుండ శ్యామకుండములను ఆవిష్కరించిరి. లుప్తమైన శ్రీకృష్ణలీలాస్థలములను, శ్రీవిగ్రహ సేవను తన అనుయాయులగు శ్రీరూప సనాతనుల ద్వారా ప్రకాశింపచేసిరి.

నిత్యసిద్ధ గౌరపార్షదుడగు శ్రీరాఘవగోస్వామి, శ్రీనివాసాచార్యులు నరోత్తమ దాసులకు వ్రజమండలమంతయును దర్శింపజేసెను. అది కేశవున కత్యంత ప్రియమై, అపూర్వ మాధుర్యమయమై, శుభప్రదమై, పాపహారిణియై విలసిల్లుచున్నది. ఈ వ్రజమండలము ద్వాదశ వన యుక్తమైయున్నది. వాటిని గురించి పద్మపురాణములో ఈ విధముగ చెప్పిరి.

భద్ర - శ్రీ - లౌహ - భాండీర -మహా - తాళ - ఖదిరికాః ।
బహుళా - కుముదం -కామ్యం - మధు - బృందావనం తథా॥
ద్వాదశైతాన్యరణ్యాని కాళిన్ద్యాః సప్త పశ్చిమే ।
పూర్వే పంచవనం ప్రోక్తం తత్రాస్తి గుహ్యముత్తమమ్ ॥

(పద్మపురాణము)

మధువనము, తాళవనము, కుముదవనము, బహుళావనము, కామ్యవనము, ఖదిరవనము, శ్రీబృందావనము - ఈ ఏడు వనములు యమునా నదికి పశ్చిమమునను శ్రీభద్రవనము, భాండీరవనము, బిల్వవనము, లౌహవనము, మహావనము అను ఐదు వనములు తూర్పు వైపునను గలవు.

**1. మధువనము :-**

పూర్వము 'మధు'యను రాక్షసుడు శివుని మెప్పించి అమరత్వమును కోరెను. శివుడు అతనికి త్రిశూలమును నివ్వగ గర్వితుడై ఆతడు లోక కంటకముగ నేర్పడెను. శ్రీకృష్ణుడు ఆతనిని సంహరించిన కారణమున దీనికి మధువనమని పేరువచ్చెను. ఈ మధుదైత్యుని కుమారుడు లవణాసురుడు. శ్రీరాముని యాదేశము ననుసరించి శత్రుఘ్ను డీయసురుని సంహరించి మధురాపట్టణము నేర్పరచెను.

ఆది వరాహ పురాణము నందు మధువనమును గూర్చి యిట్లున్నది - "మధువనమని చెప్పబడు ఈ విష్ణుధామము రమణీయమై సర్వోత్కృష్టమై యున్నది. దీనిని దర్శించిన మానవుల సర్వాభీష్టములు నెరవేరును. ఈ వనములో నీలిపద్మములతో శోభిల్లు స్వచ్ఛ జలపూర్ణ కుండములున్నవి. ఆకుండములందు స్నానమాచరించిన వారి అభీప్సితములు నెరవేరును."

ఇచ్చట మధుకుండమున్నది. మధువు యనగా తేనె. అందువలన కూడ ఈవనమునకు మధువనమని పేరు వచ్చినది. ఈ మధువనమునందే ధృవుడు తపస్సు చేసెను. ధృవుని తపస్సునకు మెచ్చి భగవానుడు ప్రత్యక్షమై ఆతనికి ధృవపదము నొసంగెను. ఇచట ధృవనారాయణుల, శత్రుఘ్నుడు బలరాముల, గిరిరాజు యొక్క మందిరములు యున్నవి. ఇచటనే అంబరీషుడు గూడ తపస్సు చేసెను. భోజ వంశీయులు దీనిని పాలించిరి. ఇచట "మహోలి" యను గ్రామమున్నది.

స్వాయంభువ మనువు పుత్రుడు ఉత్తానపాదుడు. ఉత్తానపాదునకు సునీతి, సురుచి యను ఇరువురు భార్యలు గలరు. సునీతికి ధృవుడు, సురుచికి ఉత్తముడు

జన్మించిరి. ఒక రోజున ఉత్తానపాదుడు సురుచి కుమారుడైన ఉత్తముని తన యొడిలో కూర్చుండ బెట్టుకొని ముద్దాడుచుండెను. ఇంతలో సునీతి కుమారుడగు ధృవుడు గూడ తండ్రి యొడిలో కూర్చుండ నభిలషించెను. కాని సురుచి తన సవతికొడుకగు ధృవునిపై ఈర్ష్య గలదియై రాజసమక్షముననే అనేక దుర్భాషలాడి - "ధృవా! నీవీ రాజ సింహాసనమును అభిలషించితివేని తపస్సుచే భగవానునారాధించి, ఆతని యనుగ్రహముచే నాగర్భమున జన్మింపు" మనెను. సురుచి పలికిని యామాటలను వినిన ధృవుని హృదయము మిగుల కాతరచెందెను. సునీతి జరగిన వృత్తాంతమును తెలిసికొని నిట్టూర్పులు విడచుచు, దుఃఖితమనస్కయై ధృవునితో ఇట్లనెను - "వత్సా! నీవు యితరులు యపకారము చేసితిరని భావింపవలదు. జీవుడు పూర్వజన్మమున ఎవరికేని కష్టము కలిగించినచో యాతడీ జన్మమున యట్టిదుఃఖమును తప్పక యనుభవించును. నీ సవతి తల్లి పలికినట్లు నీవు శ్రీహరిని తపస్సుచే మెప్పించి యాతని యనుగ్రహమును పొందుము. పూర్వము బ్రహ్మ, మనువు, ఇంకను పెక్కుమంది ముముక్షువులు గూడ ఏకాగ్రచిత్తులై యా హరిని యారాధించి లౌకిక యలౌకిక సుఖములను, మోక్షమును గూడ పొందిరి" యనెను.

ధృవుడు తల్లి పలికిన యావాక్కులను హృదయంగమము చేసికొని గృహమునుండి బయల్వెడలి భగవదారాధనకై ధృఢసంకల్పితుడయ్యెను. స్థిరచిత్తుడైన ధృవుని ప్రయత్నమును జూచి శ్రీహరి దయతో నారదుని యాతని వద్దకు పంపెను. నారదుడు ఏతెంచి, "వత్సా! నీవు ఐదు సంవత్సరముల బాలకుడవు. ఈ వయస్సులో మానావమానములకు తావు యుండదారు. నీతల్లి యొక్క పరుష వాక్యములను వినిన మాత్రముననే నీవు యలిగి భగవానుని యనుగ్రహము నొంద యభిలషించుచున్నావు. కాని యా భగవానుని మానవమాత్రుడైన వాడెవ్వడునూ సంతోషబెట్టుట సాధ్యమైన విషయము కాదు. బహుజన్మలలో యన్వేషించిననూ యా భగవానుని మునులు సైతము తెలిసికొనలేక పోవుచున్నారు. అందువలన నీవు ఈ నిష్ఫలమగు పట్టుదలను విడువుము" యని చెప్పగా ధృవుడు " స్వామీ! సురుచి దుర్వాక్య బాణములచే నాహృదయము దెబ్బతినినది. ఇప్పుడు మీ యుపదేశ వాక్యములను నేను గ్రహింపజాలను. నా పూర్వీకులెవ్వరునూ పొందనిది, ముల్లోకములలో యుత్కృష్టమగు స్థానమును పొందనభిలషించుచుంటిని. కావున దయచేసి దానికై సులభ మార్గము తెలుపు" మనెను. ధృవుని మాటలను వినిన నారదుడు మిగుల సంతసించి - "కుమారా! నీకు శుభమగుగాక! నీవు యమునా తటమునందున్న పరమ పావనమగు మధువనమున కేగుము. అచట మంగళప్రదమగు భగవానుని రూపమును యేకాగ్ర చిత్తముతో

ధ్యానింపుము. అట్లైన నీవు శీఘ్రముగనే శ్రీహరియొక్క యనుగ్రహమును, పరమశాంతిని పొందగలవు యని చెప్పి ద్వాదశాక్షర మంత్రమును యుపదేశించెను. నారదుని యుపదేశానుసారము రాజకుమారుడగు ధృవుడు పురుషోత్తముని యారాధనయందు ప్రవృత్తుడాయెను. మూడు దినముల కొక్కమారు పండ్లను స్వీకరించుచు మొదటి మాసమును, ఆరుదినముల కొక్కమారు యెండుటాకులను స్వీకరించుచు రెండవ మాసమును, తొమ్మిది దినముల కొక్క మారు నీటిని త్రాగుచు మూడొవ మాసమును, పంద్రెండు దినముల కొక్కమారు వాయువును భక్షించుచు నాల్గవ మాసమును గడపెను. ఐదవ మాసములో ప్రాణవాయువులను జయించి యొంటికాలిపై స్థాణువు వలె నిశ్చలముగ యుండి వాసుదేవ పరబ్రహ్మమును ధ్యానించెను. కఠోరమగు ఆతని తపో తేజమును సహింపలేక ముల్లోకములు కంపింప సాగెను. ఆతడు యొంటి కాలిపై నిలబడి యుండగా వాని కాలి బొటనవ్రేలి వత్తిడిచే భూమి క్రుంగిపోయెను. ధృవుని యిట్టి తీవ్రమగు తపస్సునకు మెచ్చిన శ్రీమన్నారాయణుడు గరుత్మంతుని యధిరోహించి యాతనిని యనుగ్రహించుటకు మధువనమునకు వచ్చెను. ధృవుడు ముందుగ దివ్య కాంతులతో ప్రకాశించు రూపమును తన హృదయ పద్మమున దర్శించెను. కాని యా రూపము వెంటనే అంతర్హితమయ్యెను. అపుడు ధృవుడు కన్నులు తెరచి చూడగ శంఖ చక్ర -గదా - పద్మములు ధరించిన చతుర్భుజములు గలవాడు; శ్రీవత్సలాంఛనము, కిరీటము, కుండలములు, కేయూరములు, కౌస్తుభాద్యాభరణములు గలవాడు; పచ్చని పట్టు వస్త్రమును ధరించినవాడు మనస్సునకు నేత్రములకును యానందమును వృద్ధిజేయువాడును, భక్తులకు యాశ్రయమునిచ్చువాడును, సర్వపురుషార్థములకు నిలయమైనవాడును, వరములనొసగు వారిలో శ్రేష్ఠుడును యగు శ్రీహరిని దర్శించెను. ఆ భగవానుని దివ్య రూపమును దర్శించిన ధృవు డాయన రూపమాధుర్యమునకు అచ్చెరువొంది, దండప్రణామమాచరించి, యంజలిబద్ధుడై స్తుతింప దలచెను. కాని యాతని నోటమాట రాలేదు. ధృవుని మనస్సులోని విషయమును గ్రహించిన భగవానుడు తన శంఖముతో వాని కపోలమును స్పృశించెను. వెంటనే ధృవునకు వాక్శక్తి వచ్చి హరినిట్లు స్తుతించెను.

యో ఽన్తః ప్రవిశ్య మమ వాచ మిమాం ప్రసుప్తాం
సంజీవయత్యఖిలశక్తిధరః స్వధామ్నా ।
అన్యాంశ్చ హస్త చరణ శ్రవణత్వగాదీన్
ప్రాణాన్నమో భగవతే పురుషాయ తుభ్యమ్ ॥ (భాగ.4.9.6)

చక్షురాద్యఖిల జ్ఞాన క్రియాశక్తిని ధరించినవాడవు, చిచ్ఛక్తితో లోపల ప్రవేశించి నిద్రాణమై యున్న నా యీ వాక్ఛక్తికి, ఇతరములగు హస్త పాద కర్ణ త్వగాదులైన యింద్రియములకు చైతన్యమును కలుగజేసినవాడవు, అంతర్యామి పురుషుడవునగు నీకు నమస్కరించు చున్నాను.

ధృవుని తపస్సునకు, స్తోత్రమునకు సంతసించిన భగవానుడు అతనికభీష్టమగు వరమును కోరుకొనుమనెను. అప్పుడు ధృవుడిట్లు పలికెను-

స్థానాభి కామస్తపసి స్థితోఽహం
త్వాం దృష్టవాన్ సాధు మునీంద్ర గుహ్యామ్ ।
కాచం విచిన్వన్నివ దివ్యరత్నం
స్వామిన్ ! కృతార్థోఽ స్మి వరం న యాచే ॥

(హరిభక్తి సుధోదయము 7-28)

" స్వామీ! నాతండ్రి ఒడిలో స్థానమును నా సోదరుడు పొందగా నేను గూడ ఆ స్థానమును వాంఛించియు పొందజాలక తల్లి ప్రేరేపింపగా తపస్సునొనర్చితిని. కానీ, మునీంద్రులకు సహితము అందని నిన్ను లెస్సగ దర్శింప కలిగితిని. గాజును వెదుకబోయి రత్నమును పొందినట్లు నిన్ను దర్శించి కృతార్థుడనైతిని. కనుక ఏవరమును కోరజాలను."

అతో న యాచే వరమీశ! యుష్మత్
పాదాబ్జ భక్తః సతతం మమాస్తు ।

" కావున దేవదేవా! నే నితరమగు వరమును దేనిని కోరను. నిరంతరము నీపాద సరసీరుహ భజనయే నా కనుగ్రహింపుము."

ఇట్లు ప్రార్థింపగ శ్రీహరి అత్యంత దుర్లభమైన ధృవలోకమును ప్రసాదించెను. శ్రీహరి యొక్క కృపకు పాత్రుడైన ధృవుడు ఆ తరువాత ముప్పదియారువేల సంవత్సరములు రాజ్యమును పాలించి యజ్ఞస్వరూపుడైన భగవంతుని యారాధించి, ఆతని ధామమును చేరికొనెను.

**2. తాలవనము: -**

తాలవనమనగా మిగుల దట్టమైన తాటి చెట్లతో గూడిన వనము యని యర్థము. ఈ వనమును ప్రస్తుతము 'తార్సీ' యని పిలచుచున్నారు. ఇది మధువనమునకు

నైఋతి దిశగ రెండుమైళ్ళ దూరమున నున్నది. ఇచ్చట ధేనుకాసురుడను రాక్షసుడు నివసించుచుండెడివాడు. ఆతడు పూర్వజన్మలో బలిచక్రవర్తి యొక్క కుమారుడగు సాహసికుడు. దుర్వాసుని శాపము వలన గర్ధభ రూపము నొంది ధేనుకాసురుడయ్యెను. కంసుని యాదేశానుసారము ఇతడు యా తాలవనములోని కెవరిని ప్రవేశింపనీయక రక్షించుచుండెను. ఒకానొక రోజున కృష్ణ బలరాములు తమ సఖులతో ఆవులను మేపుకొనుచు యా వనసమీపమున కేతెంచిరి. శ్రీదామ సుదామాది చెలికాండ్రు యనతి దూరములో సుగంధయుక్తమైన, పరిపక్వమైన తాటిపండ్లను పసిగట్టి రామకృష్ణులతో నిట్లనిరి - " ఓ కృష్ణా! దట్టమైన యా తాటి వనమున అసంఖ్యాకములగు తాటిపండ్లు యున్నవి. మాకు యవి తినవలెనని మిగుల కోరికగయున్నది. కాని యచట ధేనుకాసురడను నొక భయంకర రాక్షసుడు యున్నాడు"యని చెప్పగా బలరాముడు హుంకరించి గోపాలురతో వేణు శృంగములను పూరించుచు యా వనమున ప్రవేశించి ఒక తాటి వృక్షమును రెండు చేతులతో పట్టుకొని గట్టిగ కదిలించగ పెద్ద శబ్దము చేయుచు పెక్కు తాటి పండ్లు క్రిందరాలెను. ఆ శబ్దము వినిన వెంటనే ధేనుకాసురుడు కోపముతో యచ్చటకు వచ్చి తన వెనుక కాళ్ళతో బలరాముని వక్ష స్థలముపై వేగముగ తన్నెను. తిరిగి ఆయన వైపు క్రోధముతో రాగా బలరాముడు తన ఎడమచేతితో వెనుక రెండు కాళ్ళను పట్టుకొని ఆకాశమున త్రిప్పుచు తాటి చెట్లపై విసరెను. అధాటికి అనేక తాటి వృక్షములు నేలకూలెను. ధేనుకాసురుడు కూడ మరణించెను. కృష్ణుని స్నేహితులందరూ ఆనందముతో తాటి పండ్లను భుజించుచు బలరాముని ప్రశంసించిరి. ఈ తాలవనములో సంకర్షణ కుండము యున్నది. ఈ కుండమందు స్నానమాచరించిన కృష్ణ పదప్రాప్తి కలుగును.

ధేనుకాసురుడనగా తన కడ యధికముగ యున్న వాటిని ఎవ్వనికిని యే మాత్రమును ఈయని వాడు అని అర్థము. దేహమునే సర్వస్వముగ భావించి అధికముగ కూడ బెట్టువాడు, ఇతరుల ధనమును కాజేయువాడు మరుసటి జన్మలో గాడిదగ పుట్టును. అతడే ధేనుకాసురుడు. అవిద్య వలన ఏర్పడిన దేహాత్మాభిమానము నశింపనంతవరకు సంసార బంధనము నశింపదు. (ధేనుకాసురుని బలభద్రుడు సంహరించుట యనగా జీవునకు అవిద్య వలన ఏర్పడినదేహాధ్యాసమును గురువు సదుపదేశము ద్వారా పోగొట్టుట యని యర్థము.)

**3. కుముద వనము :-**

కుముదము అనగా కలువపూవు యని యర్థము. ఈ వనములో బాగుగ వికసించిన పెక్కు కుముదములు గల మనోహరమైన ఒక సరోవరము కలదు. ఇది

శ్రీకృష్ణుని విహారస్థలమై నానావిధ వర్ణములతో గూడిన వృక్షములతోను, సరోవరములతోను అలరారుచున్నది. కృష్ణ బలరాములు సఖులతో గూడి గోచారణ చేయునపుడు ఇచట గోపాలురతో కలసి సరోవరములో స్నానమాచరించి భోజనలీలగావించెడివారు. బలరామ కృష్ణులను గోపాలురు కలువపూల మాలలతో అలంకరించెడివారు. ఈ వనమును దర్శించువారు విష్ణులోకమున పూజితులగుదురు. ఇచట కపిలుడు తపస్సు చేసిన స్థలము, శాంతను మహారాజు తపమాచరించిన స్థలము. శాంతను కుండము యున్నవి.

ఈ వనములో కృష్ణుడు దంతవక్రుని సంహరించెను. అందువలన దీనిని 'దతి' ఉపవనమనియు, 'దతిహ'యనియు పిలతురు. దంతవక్రుడు జయ విజయులలో ఒకడు. అతడు తన స్నేహితులగు శిశుపాలుడు మున్నగువారు శ్రీకృష్ణునిచే నిహతులైరి యని తెలిసికొని క్రుద్ధుడై శ్రీకృష్ణునితో యుద్ధమునకు దిగెను. కరూష దేశోద్భవుడగు యా దంతవక్రుడు దురభిమానియై కృష్ణుని అనేక పరుష వాక్కులతో దూషించుచు గదతో శిరముపై కొట్టెను. శ్రీకృష్ణుడాతని పరుషవాక్కులకు, గదాఘాతములకు చలింపక కౌమోదకీ యనుగదతో వాని వక్షఃస్థలముపై కొట్టెను. శ్రీకృష్ణుని యా గదాఘాతమునకు వాని గుండెలు బ్రద్దలయ్యెను. నోటరక్తము క్రక్కుకొనుచు కాలుసేతులు కొట్టుకొనుచు ఆతడు ప్రాణహీనుడై నేలకొరిగెను. శిశుపాలుని వలెనె దంతవక్రుని దేహము నుండి సూక్ష్మము, విచిత్రమునగు నొక తేజస్సు బయల్వెడలి అందరూ చూచుచుండగ శ్రీకృష్ణునిలో ప్రవేశించెను.

శ్రీకృష్ణ బలరాములు ద్వారకలో నివసించుచున్న సమయమున ఒకనాడు సంపూర్ణ సూర్యగ్రహణము సంభవించినది. ఆ సందర్భమున ద్వారక నుండి కృష్ణ బలరాములతో వసుదేవుడు, ఉగ్రసేనుడు, అక్రూరుడు మున్నగు యాదవులు కురుక్షేత్రమునకు వచ్చిరి. బృందావనము నుండి గోప గోపికలతో గూడి నందమహరాజు గూడ అచట కేతెంచెను. అప్పుడు వారు పరస్పర దర్శనము వలన కలిగిన హర్షముచే గాఢాలింగనము చేసికొని పరమసంతుష్టులైరి. దీర్ఘకాలము నుండి కృష్ణ విరహముచే సంతప్తులైన గోప గోపికల శరీరములు కృష్ణ దర్శనముచే పులకితములయ్యెను. కంఠములు రుద్ధమై, నేత్రముల నుండి ప్రేమాశ్రువులు రాలెను. అప్పుడు వారు కృష్ణుని బృందావనమునకు రమ్మని ఆహ్వానింపగ కృష్ణుడు దంతవక్ర వధానంతరము యమునానది కావలనున్న నందగోకులమునకు వెడలెను. నందాది గోపకులు శ్రీకృష్ణుని చూచి యానందముతో ఆయనకెదురేగి "ఆయిరే! ఆయిరే! (రమ్ము,రమ్ము)"యనుచు ఆహ్వానించెను. మరియు కృష్ణుని యచట ఎంతయో గౌరవించెను. రమ్మని పిలచుట

వలన "ఆయిరే" యనియు, గౌరవించినందున "గోరాయి" యనియు నామధేయములు గల రెండు స్థలములు ఇచ్చట గలవు.

**శ్రీసటీకరా :-**

శ్రీకృష్ణుడు యమళార్జున భంజనము చేసిన తరువాత నందమహారాజు గోకుల మహావనము నుండి ఈ సటీకరా ప్రదేశమునకు వచ్చి కొంతకాలము నివసించెను. ఇచట నివసించిన కాలములో ఒక రోజున శ్రీకృష్ణుడు తన తల్లియగు యశోద వద్ద గోచారణ చేయు నభిలాషను తెలుపగ నామె మిగుల యానందించెను. మార్గశిర శుక్ల అష్టమి శుభ దినమున శ్రీయశోద రోహిణి దేవి పరమయానందముతో బలరామకృష్ణులను గోచారణమునకు పంపిరి. అప్పుడు శ్రీకృష్ణుని వయస్సు రెండు సంవత్సరముల మూడు నెలలు. యశోద రోహిణి ప్రేమోత్సాహములతో బలరామ కృష్ణులకు చక్కని గోపవేషము నలంకరించి పంపనుద్యమింప నందమహారాజు అచటకేతెంచెను. నందుడు వారిద్దరిని ఒడిలోనికి తీసికొని ముద్దిడుకొని ఆనందభరితుడై బలరామకృష్ణుల చేతికి ఆవులను మేపుటకు కర్రలనిచ్చెను. ఆసమయములో గోపాలురు శృంగ వేణువులను వాయించుచు అచ్చటకేతెంచెను. నందుడు కృష్ణుని చేతిలో కర్రనుంచిన కారణమున దీనికి "యష్టికర" అని పేరొచ్చెను. యష్టి అనగా కర్ర, కర యనగా చేతియందు యని యర్థము.

బలరామ కృష్ణులు గోపాలురతో కలసి నానావిధములగు క్రీడోపకరణములను గైకొని వ్రజభూమి దగ్గరగ గోవత్సములను మేపుచు యమునా తీరమునకు చేరికొనిరి. అంతలో వారిని వధింపదలచి వత్సాసురుడను నొక దైత్యుడు కృష్ణుని దూడలలో ప్రవేశించెను.అది చూచి కృష్ణుడు యావిషయమును బలరామునకు చెప్పెను. తరువాత ఏమియు తెలియని వాని వలె యాయసురుని వెంబడించి ఆతడి కాళ్లతో పాటు తోకను వడిసి పట్టుకొని ఆకాశమున గుండ్రముగ త్రిప్పగ ఆ యసురుడు మరణించెను. వాని శరీరమును విసరివేయగ అనేక వెలగ చెట్లు నేలకూలెను. అది చూచి గోపాలురు మేలు మేలని శ్రీకృష్ణుని ప్రశంసించిరి. దేవతలు పుష్ప వృష్టిని కురిపించిరి. వత్సాసురుడనగా అజ్ఞానము. వత్సాసురవధయనగా భగవానుడు జీవుల ఆజ్ఞానము నశింపచేసెనని అర్థము.

మరొకనాడు రామకృష్ణులు ప్రాతఃకాల భోజనము పూర్తిచేసి గోవత్సములను మేపుచు వాటికి నీరు త్రావించుటకై జలాశయముకడకువెడలిరి. వానిని నీరు త్రాగించి తాము కూడ నీటిని త్రాగిరి. విశాలమగు శరీరాకృతి గల బక రూపధారియగు నొక

యసురినచట చూచి అత్యంత భీతులైరి. కృష్ణుడు గోపాలురను వెంటనిడుకొని వీరదర్పముతో ఆయసురుని కెదురేగగా బకాసురుడు కృష్ణుని మ్రింగివేసెను. కృష్ణుని గానక గోపాలురు రోదించుచు మూర్ఛితులైరి. శ్రీకృష్ణుడు బకాసురుని యుదరమున ప్రవేశించి అగ్ని వంటి తేజస్సును ప్రకాశింపచేయగా దానిని భరింపలేక బకాసురుడు కృష్ణుని వెడలగ్రక్కెను. కృష్ణునకేమాత్రము దెబ్బతగులకుండుటచే క్రుద్ధుడై బకాసురుడు తన వాడియైన ముక్కుతో పొడువ కృష్ణుడు వెంటనే వాని ముక్కు రెండు చంచువులను పట్టుకొని గోపాలురు చూచుచుండగనే తృణము వలె చీల్చి వైచెను. అంతట గోపాలురు సంతసించిరి. దేవతలు ఆనందముతో కృష్ణునిపై పుష్ప వృష్టిని కురుపించిరి. దాని ద్వారా బక రూపమగు దంభమును భగవానుడు నిర్మూలనము గావించెనని తెలియవలెను.

## గరుడ గోవిందుడు

త్రేతాయుగములో ఇంద్రజిత్తు నాగపాశముతో రామలక్ష్మణులను బంధించెను. రామలక్ష్మణులను గరుత్మంతుడు ఆ నాగపాశమునుండి విముక్తి గావించెను. అప్పుడు గరుత్మంతునకు శ్రీరామచంద్రుని భగవత్తా గూర్చిహృదయములో సంశయమేర్పడెను. ద్వాపరయుగమునందు శ్రీకృష్ణావతారములో శ్రీకృష్ణుని వైభవమును బృందావన సౌందర్యమును జూచి గరుత్మంతుడు ఆశ్చర్యచకితుడై శ్రీకృష్ణుని యొక్క మాయను తెలిసికొని ఆర్తనాదముతో యాతనిని శరణుపొంది పలువిధముల స్తుతించి కృష్ణుని యొక్క కృపనొందెను. అనంతరము శ్రీకృష్ణుడు గరుత్మంతుని ఓదార్చి, ఆతని స్కంధము నధిరోహించెను. అపుడు త్రేతాయుగమునందలి సంశయము తొలగిపోయెను.

ఒకానొకప్పుడు శ్రీకృష్ణుని సఖుడగు శ్రీదాముడు గరుత్మంతుని రూపమును ధరించగా శ్రీకృష్ణుడు చతుర్భుజ రూపమును ధరించి యాతని స్కంధముపై నధిరోహించి విహరించెను. గరుత్మంతుని సేవకు సంతసించిన శ్రీకృష్ణుడు "నేటి నుండి నా నామమునకు ముందుగ నీనామము యుచ్చరింపబడుగాక!" యనెను. అందువలన ఈ స్థలమునకు 'గరుడగోవింద' యనియు, ఇచ్చట నున్న కృష్ణునకు 'గరుడ గోవిందు' డనియు పేరు వచ్చెను.

## 4. బహుళా వనము :-

ఈ బహుళా వనమును 'బాటీ' యని పిలచుచున్నారు. ఈ వనము వివిధ పుష్పోద్యానములతో, కుండములతో పరమ సమృద్ధి శాలియై అత్యంత శోభాయమానముగ నుండి శ్రీకృష్ణుని యొక్క విహారమునకు యోగ్యమైయున్నది.

విష్ణుపత్ని యగు శ్రీబహుళాదేవి సర్వదా ఈ వనమునందు నివసించుచుండును. కృష్ణభక్తుడగు ఒకానొక బ్రాహ్మణుని యొక్క బహుళయను ఆవు గడ్డి మేయుచు బహుళావనమునందు ప్రవేశించెను. క్షుధార్తురాలైన యొక పెద్దపులి ఆయావును సంహరించుట కుద్యుక్తురాలయ్యెను. అప్పుడు ఆయావు " నేను నా లేగదూడకు కడసారి పాలనిచ్చి నీకు ఆహారమగుదు" నని చెప్పి, తన దూడకు పాలనిచ్చుచు "నీవు చివరిసారిగ పాలను త్రాగుము. ఏలననగా, నేను పెద్దపులికి ఆహారముగ వెడలు చున్నాను" యని పలుకుచు బహువిధములగు నీతినుపదేశించెను. తల్లిని రక్షించుకొనజాలని తనబ్రతుకెందులకని తలపోసి దూడ తానుకూడ ఆహారముగ వెడలెను. వాని మాటలను విినిన యజమానియగు బ్రాహ్మణుడు గోవత్సములను రక్షించుకొనలేని తన బ్రతుకెందులకని బాధపడెను. చివరకు ముగ్వురును పులికడకు వెడలిరి. నారదుడు కృష్ణునకు ఈ విషయమును తెలుపగా కృష్ణుడేతెంచి బ్రాహ్మణుని, గోవత్సమును, గోవును రక్షించెను.

నమో బ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మణ హితాయ చ ।
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః ॥

ఈ వనములో శ్రీవిష్ణువు లక్ష్మీసహితుడై నిరంతరము సుఖముగ విరాజిల్లుచుండును. బహుళా వనమునందు సంకర్షణ కుండము, మానస సరోవరము యున్నవి. చైత్రమాసమున ఈ సరోవరములలో స్నానము చేసిన వారు లక్ష్మీనారాయణుల దర్శనము నొందెదరు. ఇచ్చటనే ప్రఖ్యాతి గాంచిన 'మయూర' యనెడి గ్రామము కలదు. శ్రీరాధాకృష్ణుల ముఖారవిందములను నిరీక్షించుచు అసంఖ్యాకములైన నెమళ్ళు ఇచట నృత్యము చేసినవి.

**5. కామ్యవనము :-**

నందగ్రామమునకు పది కిలోమీటరుల దూరములో కామ్యవనము కలదు. ఇచట శ్రీకృష్ణదేవాలయము, విమలాకుండము, చరణపాహాడ్, భోజనథాలి, బృందాదేవి ఆలయము, వనవాసకాలములో పంచపాండవులు నివసించిన 'చౌరాశిఖంబ' యనెడి స్థలము, ధర్మరాజునకు యక్షునకు సంభాషణ జరిగిన స్థలము, ఆదిబదరీ యున్నవి.

**విమలాకుండము :-**

విమలుడను రాజు తన కుమార్తెల వివాహము గూర్చి ఎంత ప్రయత్నించినను ఫలితము లేకుండెను. చివర కాతడు శ్రీమన్నారాయణమూర్తి గూర్చి తపమాచరించగ

భగవానుడు ప్రత్యక్షమై 'ఓ రాజా! నీ కుమార్తెల వివాహమునకు ఉత్తమ వరుడు గలడు. ఆతడు శ్యామవర్ణము కలిగి, శిరమునందు నెమలిపింఛమును ధరించిన మురళీధారియే. ఆతడొకడే నీ కుమార్తెలకు తగిన వరుడ' ని పలికి అంతర్హితుడయ్యెను. శ్రీమన్నారాయణ మూర్తి యాదేశానుసారము ఆరాజు వరాన్వేషణ చేయగా వ్రజేంద్రనందనుడైన శ్రీకృష్ణుడే తన కుమార్తెలకు తగిన వరుడని గ్రహించెను. ఒకానొక శుభ ముహూర్తమున శ్రీకృష్ణునితో తన కుమార్తెల వివాహమును జరిపెను. తదుపరి ఆ రాజకన్యలతో శ్రీకృష్ణుడు రాసక్రీడ చేసినపుడు వారి శరీరమునుండి పడిన స్వేదము ఒక కుండముగ పరిణమించెను. అదియే విమలాకుండము.

పాండవులు వనవాస కాలమున ఈ వనమునకు విచ్చేసిరి. ఇచ్చట 'చౌరాశిఖంబ' యనెడి ఎనుబది నాలుగు స్తంభములు కలగిన ధర్మరాజు యొక్క సభా మంటపము, ధర్మరాజు కూర్చుండు ఆసనము, కులగురువగు ధౌమ్యుడు కూర్చొన్న స్థలము యున్నవి. ఒకసారి ద్రౌపది బంగారు పద్మములతో శ్రీహరి నర్చింప సంకల్పింపగ ఆ పద్మములను తెచ్చుటకు భీమార్జున నకుల సహదేవులు వెడలి తిరిగి రాలేదు. అప్పుడు ధర్మరాజు స్వయముగ ఆ స్థలమునకు వెడలి చూడగ వారందరును మరణించి యుండిరి. కారణమేమనిన యక్షుని ప్రశ్నలకు వారు సమాధానమీయలేకపోయిరి. ధర్మరాజు యక్షుని ప్రశ్నలన్నిటికి సమాధానమీయగా ఆతడు సంతృప్తిజెంది నలుగురు సోదరులను, బంగారు పద్మములను ఇచ్చెను.

**భోజన థాలి (భోజన స్థలి) :-**

శ్రీకృష్ణుడు గోపాలురతో కలసి ఈ పర్వతముపై పళ్ళెమాకృతిలోనున్న రాతిపై భోజనము చేసెడివాడు. శ్రీకృష్ణుని గోచారణ కాలములో ఆయనవెంట వేయిమంది గోపాలురుండెడివారు. వారందరు కృష్ణుని నలువైపుల కూర్చొని యుండి వారి వారి ఇండ్ల వద్ద నుండి తెచ్చిన భోజనమును కృష్ణునకు ప్రేమతో తినిపించెడి వారు.కృష్ణుడు కూడ వారిచ్చిన వస్తువులను ప్రీతితో స్వీకరించెడి వాడు. అందులో ఒకరు - "కృష్ణా! ఈ రోజు మాయమ్మ లడ్డు ఇచ్చినది, తీసికొనుము" అనగా ఇంకొకరు "మాఅమ్మ రాధావల్లభి యిచ్చినది" మరొకరు దధ్యోదన మిచ్చినదని - ఈ విధముగ కృష్ణునకు తినిపించెడివారు. వారందరూ కూర్చొని ఆనందముతో భోజనము చేసిన స్థలమునకే 'భోజన స్థలి' యని పేరు. ఇప్పటికిని ఆ లీలకు గుర్తుగ ఒక పెద్దరాయి రెండు కంచముల ఆకృతితోను, రెండు చిన్న గిన్నెల ఆకృతిలోను యున్నవి. వాటినే భోజనథాలి (థాలియనగా పళ్ళెము) అందురు.

శ్రీకృష్ణుడు ఒకే సమయములో వేయిమంది సహచరులనుండి వారిచ్చు పదార్థములను ఎట్లు తీసికొనెను. తానొక్కడే వారందరుకు ఎట్లు తినిపించెను యనెడి సందేహము కలుగవచ్చును. శ్రీమద్భగవద్గీతలో **"సర్వతః పాణి పాదం తత్ సర్వతో౽ క్షిశిరోముఖమ్। సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి"** (గీత. 13 .14) అనినట్లు ఆ పరబ్రహ్మతత్త్వము అంతట హస్తములు, పాదములు, నేత్రములు, ముఖములు, కర్ణములు కలిగియున్నది. అది జగత్తునంతటిని వ్యాపించి యున్నది. కావున కృష్ణుడిట్టి కార్యము చేయుటలో ఆశ్చర్యమేమి యుండును?

కృష్ణుని యొక్క లీలలన్నియు విచిత్రములే. ఒకసారి గోపాలురతో భోజనము చేయుచు కృష్ణుడు వారితో నిట్లనెను. 'స్నేహితులారా! ఆహారమును పైకి ఎగురవేసి ఎవరు ముందుగ తినెదరో వారికి బహుమతి నిచ్చెద'ననెను. గోపాలురందరు అట్లేయని ఆహారము నెగురవేసి నోరు తెరచి తినుటకు ప్రయత్నింపగా తానే ముందుగ తినెడివాడు. అది చూచిన దేవతలు కృష్ణ ప్రసాదమును పొందవలయుననెడి కోరికతో వాయసరూపములను దాల్చి అచటకు వచ్చిరి. అంతర్యామియగు శ్రీకృష్ణుడది తెలిసికొని ఆహారపదార్థములను వారికి (దేవతలకు) ఇచ్చుటకు నిచ్చగింపక గోపకులతో యిట్లనెను. 'గోపకులారా! అన్నము పరబ్రహ్మ స్వరూపము. అట్లు ఎగురవేయరాద'ని నివారించెను. ఆ తరువాత యమునలో చేతులు కడగుకొనుటకు వెడలుచుండెను. అది తెలిసికొనిన దేవతలు లేశమైననూ కృష్ణప్రసాదము దొరుకకపోవునాయని తలచి మత్స్య రూపధారులై యమునలో ప్రవేశించిరి. దానిని కూడ గమనించిన కృష్ణుడు గోపకులతో నిట్లనెను. 'స్నేహితులారా! మనము వనములలో భ్రమించుచుందుము. ఒకచోట నీరు దొరుకవచ్చును, మరియొక చోట నీరు దొరుకక పోవచ్చును. అందువలన మీరు మీ మీ చేతులను వంటికి పూసికొనుడు' యనెను. ఈ విధముగ దేవతలను వంచించెను. దీనియంతరార్థమేమనిన కృష్ణ ప్రసాదము దేవతలకు కూడ దుర్లభమని తెలియ వచ్చుచున్నది.

**చరణ్ పాహాడ్ :-**

శ్రీకృష్ణుడు గోచారణము చేసిన లీలలలో దాగుడుమూతలాట యొకటి. ఒకానొకరోజున కృష్ణుడు గోపాలురతో యిట్లనెను. సఖులారా! నేడొక కొత్తరకమగు ఆటనాడుకొనెదము. అదేమనిన ఈ కుండములో మునిగి ఎవరెక్కువ సేపు యుండగలరో వారు గెలచినట్లు, అనగానే గోపాలురందరూ అట్లేయని శ్రీకృష్ణునితో పాటుగ ఒకే సారి కుండములో మునిగిరి. అట్లందరూ మునగగా చూచి శ్రీకృష్ణుడు దగ్గరలో నున్న ఒక

కొండపైకి వెడలెను. కొంతసేపటికి గోపాలురందరూ నీటినుండి పైకి లేచి 'కృష్ణా మేమే ఓడిపోయితిమి. నీవు త్వరగా పైకి రమ్ము' యనిరి. కృష్ణుడెంతసేపటికి పైకి రానందున కృష్ణుని 'యే జలదేవత మ్రింగివేసినదో' యని భావించి అందరూ బిగ్గరగ ఏడ్వసాగిరి. తనను గూర్చి ఆక్రందనము చేయుచున్న గోపాలురకు ఆనందము కలుగ జేయుటకై ఆకొండపైనుండియే కృష్ణుడు వేణుగానము చేసెను. ఆ వేణుగాన ప్రభావము వలన కొండ కరగిపోయెను. శ్రీకృష్ణుని వేణుగాన మాధుర్యమట్టిది. అది స్థావరమును జంగమముగను, జంగమమును స్థావరముగను మార్చివేయును. కొండపై నున్న కృష్ణుని వద్దకు ఒకరి వెంబడి మరొకరు వెడలుట వలన బాలుర అడుగుజాడలు కొండపై యున్నవి. కృష్ణుడు నిలబడి వేణుగానము చేసిన చోట కృష్ణ పద చిహ్నములు కూడ యున్నవి. అందువలననే ఈ పర్వతమునకు 'చరణ్ పహాడ్' యని పేరు వచ్చినది. వారందరూ నీట మునిగిన కుండమును 'లుక్‌లుకి కుండము' అందురు. లుక్ లుకి యనగా దాగుడుమూతలని యర్థము.

**బృందాదేవి ఆలయము :-**

బృందావనమునందు ప్రఖ్యాతిగాంచినవి గోవింద, గోపీనాథ, మదన మోహన దేవాలయములు. శ్రీగోవిందుడు రూపగోస్వామి వారికి దర్శనమిచ్చి తాను అచటి యోగ పీఠమున నున్నానని, వెలికి తీసి సేవింపుమని ఆదేశింపగా ఏడంతస్థులతో కూడిన అద్భుత చిత్రకళతోనొప్పునొక దేవాలయమును నిర్మించి, అందు శ్రీగోవిందదేవుని విగ్రహ సేవాప్రకాశము గావించెను. ఆ దేవాలయముపై వెలిగించిన దీపము ఆగ్రావరకు కనుపించెడిది. ఔరంగజేబు మతద్వేషముతో ఆదేవాలయమును పడగొట్టి విగ్రహములను ధ్వంసము చేయుడని సైన్యమునకాదేశింపగా శ్రీగోవిందుడు భరత్‌పూర్ మహారాజునకు స్వప్నమందు దర్శనమిచ్చి ఆ మూర్తిత్రయమును భరత్‌పూర్‌నకు తరలించమని యాదేశించెను. భగవంతుని యాదేశానుసారము రాజామానసింగ్ యా మూర్తులను గొనిపోవుచు కామ్యవనమునందలి బృందాదేవి ఆలయము నందుంచి సేవకు ఏర్పాటు చేసెను. కొంతకాలము తరువాత జయపూర్ మహారాజు ఆ విగ్రహములను తన రాజ్యమునకు గొనిపోయి శ్రీగోవిందుని రాజదర్బారులోను, శ్రీగోపీనాథుని పట్టణములోను, శ్రీమదనమోహనుని తన అంతరమహల్‌లోను ఉంచి సేవించుచుండెను. ఆ విగ్రహములను జయపూర్‌నకు తీసికొను పోవు సమయమున శ్రీబృందాదేవి మాత్రము అచట నుండి వెడలుటకు నిచ్చగింపక కామ్యవనమునందే యుండిపోయెను. ఇప్పటికిని యాదేవాలయమున అద్భుతమగు సుందరరూపముతో బృందాదేవి విగ్రహరూపమున విరాజమానురాలగు

చున్నది. కామ్యవనమునందలి యీదేవాలయమునందు తప్ప మరెచ్చటనూ బృందాదేవి అర్చారూపమున (విగ్రహరూపమున) కానరాదు.

ఒకప్పుడు నందమహారాజు తీర్థయాత్రలకు బయలుదేరగా శ్రీకృష్ణుడు 'తండ్రీ! నీవు తీర్థయాత్రలకై వేరెచ్చటకును వెళ్ళనవసరములేదు. అన్ని తీర్థములు యిచటనే యున్నవి యని పలికి బదరీ, కేదార్, పశుపతినాథ్ మున్నగు సమస్త పుణ్య తీర్థములను అచట గోచరింపజేసెను. ఇప్పటికిని ఆ యా తీర్థములను ఇచ్చట చూడవచ్చును.

**6. ఖదిరా వనము :-**

ద్వాదశవనములలో ఖదిరావనము ఆరవది. ఈ వనమును దర్శించిన వ్యక్తులు విష్ణులోకమునకు వెడలుదురు. "ఖాయిరే! ఖాయిరే" యను పదమును ఉచ్చరించినందున ఈ వనమునకు ఖదిరావనమని పేరు వచ్చినది. ఖాయిరే యను నీగ్రామము జావట్‌కు ఆగ్నేయకోణములో రెండుమైళ్ళ దూరముననున్నది. ఈగ్రామమునకు జావట్‌కు మధ్య 'చిల్లీ' యను పేరు గల స్థానము గలదు. శ్రీకృష్ణుడు యిచటనే బకాసురుని సంహరించెను. బకాసురుని యొక్క చంచువు రెండు పుటములను చీల్చుట వలన ఆ స్థానమునకు చిల్లీ యను పేరు వచ్చినది. గోపాలురందరూ బకాసురుడు శ్రీకృష్ణుని మ్రింగివేయుటను జూచి ఆర్తనాదములతో 'ఖాయిరే!ఖాయిరే' (తినివేసాడు. మ్రింగివేశాడు) యని పలుకుట వలన దీనికి ఖదిరావనమని పేరు వచ్చినది. చిల్లీ యను స్థానమునకు పశ్చిమముగ ఒక కదంబవృక్షము గలదు. బకాసుర వధానంతరము శ్రీకృష్ణుడు స్నేహితులతో గూడి ఇచ్చటనే భోజనము చేసెను. ఈగ్రామమునకు ఉత్తర దిశగా సంగమ కుండమున్నది. ఇచ్చట కృష్ణుడు గోపికలతో కూడి విహరించెను. ఈ కుండమునకు ఉత్తర దిశగా కదంబఖండి యున్నది. ప్రస్తుతమిచ్చట 6,7 కదంబ వృక్షములు గలవు. శ్రీలోకనాథస్వామి, శ్రీభూగర్భగోస్వాముల భజనకుటీరములు యున్నవి. ఖదిరావనమునకు నలువైపుల పండ్రెండు కుండములున్నవి.

**కోకిలా వనము :-**

కోకిలావనము శ్రీనందగ్రామమునకు ఉత్తరముగ జావట్ గ్రామమునకు పశ్చిమముగ రెండుమైళ్ళ దూరమున గలదు. ఈ నిర్జనారణ్యమునందు శ్రీకృష్ణుడు కోకిలారవము వలె మధుర వంశీధ్వని చేసి శ్రీరాధికను కలసికొనెను. అందువలన ఈ వనమునకు కోకిలావనమని పేరువచ్చినది.

ఒకానొక రోజున శ్రీకృష్ణుడు రాధికను కలసికొనగోరి జావట్ గ్రామమున రేగి వృక్షము క్రింద రాత్రంతయు గడపెను. అయినను రాధికను కలసికొనుటకు వీలుపడలేదు. మరునాటి ఉదయము లలితాసఖి వచ్చి "హే నందనందనా! ఇచ్చటకు దగ్గరలోనే మనోహరమైన నిర్జనమగు ఒక స్థానమున్నది. నిరంతరము కోకిలధ్వనులతో ఆ స్థలము ప్రతిధ్వనించుచుండును. నీవు మధ్యాహ్నసమయమున అచటకు చేరి వంశీధ్వని చేసినయెడల మేము శ్రీరాధికను వెంటనిడుకొని అచటకు వచ్చెదము" యని పలికెను. కృష్ణుడు ఆ సంకేత స్థలమునకు వెడలి వంశీధ్వని చేయగా లలిత రాధతో- "హేరాధే! అదిగో వినుము. రసికశేఖరుడగు శ్రీకృష్ణుడు నీకొరకు వంశీధ్వని చేయుచున్నాడు" అనెను. అప్పుడు రాధిక - నేనబలను మరియు కంటక స్వరూపులగు జటిల కుటిల నుండి ఎట్లు తప్పించుకొని కృష్ణునికడకు వెడలగలను? ఇది సంభవమేనా? యని పలుకగా లలిత - రాధే! నీవు స్థిర చిత్తురాలవగుము. శ్రీకృష్ణుడే నిన్ను తన వద్దకు తీసికొనిపోవును అనగా లలిత యొక్క ఆ వాక్యములకు రాధిక ఆనందించి శ్రీకృష్ణుని కలసికొనెను. భాద్రపద శుద్ధ ద్వాదశి నాడు ఇచ్చట రాసలీల అభినయము జరుగుచుండును. ఇచ్చట కృష్ణ కుండము, బలరామ కుండములు చూడదగినవి.

**బడ బైఠాన్ :-**

ఇది కోకిలావనమునకు రెండున్నర మైళ్ళ దూరములో ఉత్తరమున యున్నది. ఇచట బలరాముడు నివసించిన గృహము కలదు. వ్రజవాసుల యొక్క ప్రార్థనను విని శ్రీల సనాతన గోస్వామి ఇచట కొన్ని దినములుండి భజనానందమును యనుభవించిరి. ఇచ్చట కుంతల కుండమున్నది. కృష్ణుడు యిచ్చట సఖులతో కుంతల విన్యాసము చేసెను. కృష్ణుని కృపకొరకు శనీశ్వరుడు ఇచటనే తపస్సు చేసి కృష్ణానుగ్రహము వలన అనేక లీలలను దర్శించెను.

**7. భద్రవనము :-**

మధురనుండి బరేలి వెళ్ళు మార్గములో రాయ్ యను గ్రామమునకు ఎడమవైపున సుమారు 30 కి.మీ. దూరములో భద్రవనము, భాండీర వనములున్నది. హయగ్రీవుడు భద్రవనమునకధిదేవత. శ్రీకృష్ణుడిచట బాలుని వలె గాక పెద్దమనిషి తరహాలో లీలలు చేసెను. ఇతర వనములలో గురివిందగింజల మాలలు మెడలో వేసికొనుచు కర్ణములయందు వివిధ పుష్పములను అలంకరించుకొనుట యనునవి గావించెను. కాని యీవనములో రాజవేషముతో భద్రముగ విహరించుట వలన ఈవనమునకు భద్రవనమని పేరు వచ్చినది. దీనికి ఉపవనము విహారవనము. ఈ విహారవనములో "భయగాంవ్" యను గ్రామమున్నది.

క్రీడారసజ్ఞుడగు శ్రీకృష్ణుడు గోపాలురను పిలచి - "గోపబాలులారా! ఈ రోజు మనము రెండు జట్లుగ విడువడి తగిన విధముగ ఆడుకొనెదము" యనెను. గోపాలురును అట్లేయని రామ కృష్ణులను రెండుపక్షములకు తమ తమ నాయకులుగ నెంచుకొని కొందరు కృష్ణుని పక్షమునను, మరికొందరు రాముని పక్షమును వహించిరి. ఆయ్యాట యందు విజేతలైన వారిని పరాజితులు తమ భుజములపై నెక్కించుకొని మోయవలయును. ప్రలంభాసురుడను రాక్షసుడు గోపాలుని వేషమును ధరించి కృష్ణ బలరాములను సంహరింప దలచి వారి తో కలసెను. ప్రలంభాసురుడు ఓడిపోయిన కారణమున బలరాముని తన భుజములపై నెక్కించుకొని మిక్కిలి వేగముగ హద్దును దాటి చాలదూరము మోసికొనిపోయెను. ఆ యసురుడు పర్వత ప్రమాణ బరువు గల బలరాముని మోయలేక క్రమముగ వేగము తగ్గినవాడై తన రాక్షసరూపమును దాల్చెను. బలరాముడది గమనించి తన్ను సంహరింపనుద్యుక్తుడైన యా ప్రలంభాసురుని మస్తకముపై పిడికిలి బిగించి కొట్టెను. ఆ దెబ్బ కాతని తల పగులుటచే ఆ అసురుడు నోటి నుండి రక్తము గ్రక్కుచు, బిగ్గరగ యరచుచు ప్రాణములను వదలి భూమిపై పడెను. అపుడు గోపాలురు బలశాలియగు బలదేవుని ఆలింగనము చేసికొనుచు ఆశీర్వదించి ప్రశంసించిరి. పాపాత్ముడగు ప్రలంభాసురుడు నిహతుడు కాగా దేవతలు గూడ స్వస్థ చిత్తులై మేలు మేలని పలకుచు బలరామునిపై పుష్పవృష్టిని కురిపించిరి. ఈ స్థలము యోగులకు చాల ప్రియమైన స్థలము. ఈ వనమును దర్శించిన వారికి పునర్జన్మయుండదు.

ప్రలంభాసురుడనగా జీవునిలో నున్న పెద్ద పెద్ద వాసనలని యర్థము. ఈ వాసనల వలన జీవుడు భగవంతుని వద్దకు చేరలేడు. భగవన్నామస్మరణచే బలరామతత్త్వమగు గురువనుగ్రహము వలన ఈ వాసనలు క్రమముగ నశించును.

**9. బిల్వ వనము :-**

బృందావనమునకు ఉత్తర భాగమున బిల్వవనమను ఒక వనమున్నది. ఏ మనుజుడైననూ ఈ వనమును దర్శించిన యెడల బ్రహ్మలోకమున పూజితుడగును. ఇది శ్రీకృష్ణుని యొక్క గోచారణ స్థలము. శ్రీకృష్ణుని యొక్క సౌందర్య మాధుర్యములను దర్శించిన లక్ష్మీదేవి వాటియందు లాలస కలగినదై తాను కూడ శ్రీకృష్ణునితో విహరింపవలె ననెడి ఇచ్ఛతో వైకుంఠేశ్వరి వైకుంఠమునందలి దివ్య భోగములను పరిత్యజించి తదేక నిష్ఠతో తపస్సు చేసిన స్థలమిది. కృష్ణుడు ఆమె తపస్సు చేయుటను జూచి 'నీ తపస్సునకు కారణమేమి?' యని యడుగగా, లక్ష్మీదేవి "ప్రభూ! నేను

గోపీరూపము ధరించి నీతో గూడి బృందావనమున విహరింపవలెనని యభిలషించు చున్నాను" అనెను. శ్రీకృష్ణుడు దానికి సమాధానముగ 'నీ కోరిక మిగుల దుర్లభమైనది. ఏలననగా ఐశ్వర్యమును త్యాగము జేసి ప్రేమ భావముతో బృందావనేశ్వరియగు శ్రీరాధిక ఆనుగత్యములో ఎవరు నన్నారాధింతురో వారే నాతో రాసలీలలో పాల్గొనెదరు' అనెను.

ఇచ్చట శ్రీ మానసరోవరము కలదు. శ్రీమతి రాధిక కృష్ణ విరహము చేత అభిమానముతో దుఃఖించినప్పుడు ఆమె యశ్రుధారయే సరోవరమైనది. అందువలన దీనికి మానసరోవరమని పేరు. ఇచ్చట శ్రీరాధాదేవి ఆలయము గలదు. దీనికెదురుగ శ్రీకృష్ణుడు రాధను స్తుతించుచున్న మందిరము గలదు. ఒకానొక రోజున దుర్వాసుడు ఏకాదశినాడుపవసించి శ్రీకృష్ణుని కడ ద్వాదశి పారణ చేయ సంకల్పించి యమునను దాటి భగవద్భజన చేయ మొదలిడెను. శ్రీకృష్ణుడు పంపగా గోపికలు దుర్వాస మునికి ఆహార పదార్థముల నొసంగిరి. గోపికలు ఏ రేవు నుండి యమునను దాటిరో దానికి 'పాణిఘాట్' యని పేరు. ఆగ్రామము 'పాణిగాఁవ్' యని పేరొందినది. ఈ గ్రామము మధ్యలో వత్సకుండమున్నది.

## 10. లోహ వనము:-

వ్రజమండలమందలి ద్వాదశ వనములలో లోహవన మొకటి. ఈ వనమునకు అధిష్ఠాన దేవత శ్రీశ్రీరాధాగోపీనాథుడు. ఈ వనమును దర్శించిన వారు సర్వపాతకముల నుండి ముక్తులగుదురు. పూర్వ మీ వనము లోహ జంఘాసురుడను రాక్షసుని ద్వారా పాలింపబడు చుండెను. పలువిధములగు సుగంధపుష్పములతో విరాజిల్లు ఈ వనమునందు శ్రీకృష్ణబలరాములు గోపాలురతో గోచారణము చేయుచు అద్భుతముగ క్రీడించెడివారు. ఈ వనమున కృష్ణుడు లోహజంఘాసురుని (లోహము వంటి ఊరువులు గలవాడు లోహజంఘాసురుడు) సంహరించి నిర్భయమగు క్రీడా ప్రదేశముగ చేసెను. ఇచట యమునానది యందు శ్రీకృష్ణుడు గోపికలతో నౌకా విహారము గావించెను. ఈ వనమున కృష్ణకుండమున్నది. శ్రీకృష్ణుడు దంతవక్త్రుని సంహరించిన పిదప ఈ కుండమునందు స్నానము చేయుట వలన కృష్ణకుండమని పేరు వచ్చినది. అనంతరము గోపాలురు కృష్ణుని "రమ్ము,రమ్ము"యని పిలచుటచే ఈ గ్రామమునకు "ఆయిరే!" యని పేరువచ్చినది. ఇచ్చట గడుఁఇ యను గ్రామమున్నది. నందమహారాజునకు శ్రీకృష్ణుడు నమస్కరించుటచే ఈ గ్రామమునకు "గడుఁఇ" యని పేరు వచ్చినది.

## 11. మహావనము :-

మహావనము నంద యశోద మున్నగు శ్రీకృష్ణుని యొక్క నిత్య పరిజనులు నివసించు స్థలము. ఈ వనము బలదేవుని యొక్క అంశమై శ్రీకృష్ణునకు అత్యంత ప్రియమైయున్నది. మనుజులీవనమును దర్శించిన ఇంద్రలోకమున పూజితులగుదురు. ప్రస్తుత మీవనము ప్రాచీన గోకులమని ప్రసిద్ధికెక్కినది. బలరామకృష్ణులు సర్వజన చిత్తాకర్షకములగు బాల్యలీలలను ఇచట విస్తృతముగ గావించిరి. శ్రీకృష్ణుడిచట పూతన సంహారము, తృణా వర్తాసుర వధ, శకటాసుర భంజనము, యశోదకు తన చిన్ని నోటియందు విశ్వరూపమును చూపుట, యమళార్జున భంజనము, దధిభాండ భగ్నము మున్నగు లీలలు చేసెను. ఇప్పటికిని ఇచట 84 స్తంభములు గల నందభవనము, శ్రీయశోదాదేవి సూతికాగృహము, బ్రహ్మాండ ఘాట్ (కృష్ణుడు మన్ను తిన్న స్థలము), చింతాహరణ్ ఘాట్, యమళార్జున భంజన స్థలము మున్నగునవి దర్శింపవచ్చును. శ్రీరాధాదేవి ఆవిర్భవించిన గ్రామము 'రావల్' కూడ ఈ మహావనమునందే యున్నది. శ్రీకృష్ణునికి రెండు సంవత్సరముల ఆరు మాసములు వచ్చు వరకు నందయశోదలిచట యుండి అనంతరము నందగ్రామమునకు వెళ్ళిరి. ఈ వనము యమునానదికి తూర్పువైపున యున్నది.

## 12. బృందావనము :-

ద్వాదశ వనములలో శ్రీబృందావనము పండ్రెండవది. ఈ వనము శ్రీ బృందాదేవి ద్వారా సర్వదా రక్షింపబడుతూ శ్రీకృష్ణునకు ప్రియమైనదై యున్నది. ఈ వనమును దర్శించినచో సర్వ పాతకములు నశించును. శ్రీకృష్ణుడీ వనమునందు గోప గోపికలతో నిత్యము క్రీడించుచుండును. ఐదు క్రోసుల పరిమితి గల ఈ బృందావనమునందు ద్వాదశ యుపవనములున్నవి. మధురనుండి బృందావనము సుమారు 16 కి.మీ. దూరముననున్నది. బహు విస్తృతమైన ఈ బృందావనము మునుల ఆశ్రమములతో పరిపూర్ణమై, తులసీవన సమన్వితమై, బ్రహ్మ రుద్రాది దేవతలద్వారా సేవింపబడుచు దుర్జ్ఞేయమై పరమ శోభాయమానమై విరాజిల్లుచున్నది. ఈ వనమునందు శ్రీహరియే స్వయముగ అధిష్ఠాన దేవతగ యున్నాడు. నిరంతర సేవాపరాయణురాలగు శ్రీలక్ష్మీదేవి విష్ణువున కేవిధముగ ప్రియురాలో అట్లే ఈ పృథివియందు శ్రీబృందావనము గోవిందునకు ప్రియతమమైనది. బృందావనము యమునానదికి పశ్చిమవైపున విరాజిల్లుచున్నది.

--o--

# ౬. శ్రీ గోకుల మహావనము

మహావనంచాష్టమన్తు సదైవహి మమ ప్రియమ్ ।
తస్మిన్ గత్వా తు మనుజ ఇన్ద్రలోకే మహీయతే ॥

సహస్రదళ విశిష్టమై కమలాకృతితో నున్న చిన్తామణిమయమగు శ్రీగోకుల మహావనము శ్రీభగవానుని యొక్క నిత్యధామము. ఇది ఎనిమిదవ వనము. బలరాముని శక్తిచే ఆవిర్భవించి, శ్రీకృష్ణునకత్యంత ప్రియమైనదై యున్నది. ఇది శ్రీకృష్ణుని యొక్క మాతాపితరులగు నంద యశోద మరియు గురుజనుల యొక్క నిత్య నివాస స్థలము. బలరామకృష్ణులు ఇచట తమ బాల్యలీలలను ప్రదర్శించి గోకుల వాసులనెంతగనో ఆనందింపచేసిరి. ఈ వనమును దర్శించిన మానవుడు దేవలోకమున పూజింపబడును. దీనిని గోకులమనెదరు. ఇది గోలోకమున కంటెను ఎక్కువ మాహాత్మ్యము కలగినది. గోలోక విహారియగు శ్రీ కృష్ణుడు మరియు యోగమాయ ఒకే సమయములో యశోదకు జన్మించెను. కంసకారాగారములో దేవకీవసుదేవులకు జన్మించిన శ్రీకృష్ణుడు, శ్రీమన్నారాయణుని అవతారము. అతని ఆదేశానుసారము వసుదేవుడు అవతార కృష్ణుని గోకులమునందలి నందభవనమునకు తీసికొనిపోవ యశోదకృష్ణుడు వసుదేవకృష్ణుని తనలోనికి ఆకర్షించుకొనెను. ఇది లీలాపురుషోత్తముడగు శ్రీకృష్ణుని యందు వైకుంఠాధిపతి శ్రీమన్నారాయణుడు (అవతార కృష్ణుడు) కలసిన స్థలము. వసుదేవుడు ఎవరికిని తెలియకుండులాగున కృష్ణుని అచట ఉంచి యోగమాయను కంసకారా గారమునకు తీసికొనిపోయెను. మూడుసంవత్సరముల వయసు వరకు శ్రీకృష్ణుని బాల్యలీలలు ఇచ్చటనే జరగినవి. ముజ్జగములలో విఖ్యాతినొందిన నవనీత చోరాది లీలలు, పూతన సంహారము , తృణావర్తాసురవధ, శకటాసుర భంజనము, యమళార్జున భంజనము మున్నగు లీలలు గోకులమునందే జరగినవి.

ఇచట 84 స్తంభములు కలగిన పెద్ద మంటపముతో కూడిన నందభవనము ఎత్తైన ప్రదేశమున గలదు. ఆమంటపమునకు మధ్యభాగములో సత్య త్రేతా ద్వాపర కలి యుగములలో మహిమలు కలగిన విఖ్యాతినొందిన నాలుగు స్తంభములున్నవి. యశోద ప్రతినిత్యము పెరుగు చిలకగ వచ్చిన నవనీతమును కృష్ణుడు భుజించి ఒక స్తంభమునకు పూసెడి వాడు. ఆ ఆనవాలును ఇప్పుడు కూడ చూడవచ్చును. ఇచటి మందిరములో శ్రీ నంద యశోదలు, కృష్ణ బలరామ విగ్రహములు అతి మనోహరముగ దర్శనమిచ్చును. భక్తులందరు ఉయ్యాలలో నున్న చిన్ని కృష్ణుని ఊపుదురు. ఈ నందభవనమునకు దిగువున పూతనా మోక్షణ స్థానము, కొలది దూరములో యశోద సూతికా గృహము, యోగమాయా మందిరము యున్నవి.

శ్రీకృష్ణుడు పదునొకండవ రోజు శిశువుగ యున్నప్పుడు కంసునిచే పంపబడిన పూతన గోకులమునకు వచ్చి శ్రీకృష్ణుని జంపుటకై కాలకూట విషమును తన స్తనములకు పూసికొని కృష్ణునకు తన స్తన్యమునొసంగెను. అనంతరము శ్రీకృష్ణుడు పూతనను సంహరింపదలచి స్తన్యదుగ్ధ పానము చేయుచు చేయుచు పూతన యొక్క పంచప్రాణములను ఆకర్షింపనారంభింపగ, తీవ్రమైన బాధతో పూతన వదలు వదలుమని అరచుచు తన మాయా వేషమును పరిత్యజించి భయంకరము సుదీర్ఘమునగు రాక్షసరూపముతో ఆకాశమునకెగిరి మహావనమునకు పశ్చిమ దిశగనున్న 'రమణరేతి' యనెడి స్థానమున పడి ప్రాణములను విడచెను. దీనికి అనతి దూరమున శకట భంజన స్థానమున్నది. శ్రీకృష్ణుని మూడవ మాసమందీ లీల జరగినది. ఇచటకు దగ్గరలోనే తృణావర్తాసుర వధ స్థానమున్నది. దీనికి సమీపమునందే నందమహారాజు యొక్క సింహపౌరీ, నందభవనము, దధిమంథనస్థానము, నందకూపము, యమళార్జున భంజన స్థలము, ఉదూఖలము యున్నవి.

శ్రీకృష్ణుని రూప లావణ్యమును దర్శించుచు గోకులవాసులగు గోపగోపికలు నందభవనమునందు నంద యశోదల ఆదేశము ననుసరించి శ్రీకృష్ణుని సేవించెడివారు. శ్రీకృష్ణుని నిదుర పుచ్చు సమయమ... ...శోద భాగవత రామాయణ మహాభారతముల నుండి కొన్ని కథలను చెప్పుచుండెడిది. ఆ కథలను కృష్ణుడు కుతూహలముగ "ఊఁ ఊఁ" అంటూ వినెడి వాడు.

ఒకనాడు సముద్రమంథన లీల చెపుతూ యశోద ఇట్లనెను - "కృష్ణా ! ఒకసారి దేవతలు అసురులు కలసి క్షీర సాగరమును మథించిరి. అపుడు ఆలాహాలమనెడి విషము వచ్చినది. తరువాత కామధేనువు, కల్పవృక్షము, ఐరావతము మున్నగున వెన్నియో వచ్చినవి" అని చెప్పుచుండగా కృష్ణుడు యశోద చేయి పట్టుకొని "అమ్మా! పాలను పెరుగును మథించిన నవనీతము వెన్న వచ్చును గాని ఆలాహల విషమెట్లు వచ్చినది?" యని అడిగెను. అందుకు యశోద దీనికి పెద్ద కథ యున్నది, మరొక సారి చెప్పెదను నిదురపొమ్మని జో కొట్టెను.

కృష్ణుడు నిదురించు సమయమున దేవతలాతనిని దర్శించుటకు వచ్చి నమస్కరించెడివారు. కృష్ణుడు వారిని సంబోధించుచు "హే శంభో ! నీ రాక బాగుగ జరిగినదా? బ్రహ్మ ! నీవు యెడమ వైపున కూర్చొనుము. కార్తికేయా! నీవు క్షేమమా? ఇంద్రా! నీవు క్షేమముగా యున్నావా? కుబేరా! నీవు కనబడుటలేదు ఎందులకు " యని పలకరించు చుండెడివాడు. యశోద కృష్ణునకు ఏ దుష్టగాలి సోకినదో నని భయపడి రక్షాబంధనము కట్టినది.

ఒకనాడు యశోద కృష్ణుని నిద్రపుచ్చుచు రామాయణములోని రామవనవాసము నిట్లు వర్ణించుచుండెను.

యశోద : పూర్వము రాముడనే ఒక రాజు ఉండెను

కృష్ణుడు : ఊఁ

యశోద : ఆయన భార్య సీత

కృష్ణుడు : ఊఁ

యశోద : తండ్రి ఆదేశానుసారము వనవాసము చేయుచు పంచవటియందు నివసించుచుండెను. సీతను రావణాసురుడు అపహరించెను.

కృష్ణుడు: ఓ లక్ష్మణా! ధనుర్బాణములను తెమ్ము. రావణుని సంహరించెదను. కృష్ణుని ఈ మాటలు వినిన యశోద భయపడి కృష్ణుని కౌగలించుకొని రక్షణకై భగవానుని ప్రార్థించినది.

శ్రీకృష్ణుని బాల్య లీలలలో నవనీతచోర లీలలు ఉత్కృష్టమైనవి. గోకులమునందలి గోపికలందరూ నిత్యము కృష్ణుని గోలోకమునందు సేవించుచుండెడివారే. వారు ప్రతి నిత్యము ప్రీతితో శ్రీకృష్ణుని కొరకు వెన్న తీసియుంచెడి వారు. కృష్ణుడు గోపికలందరి యిండ్లలో ఒకేసారి పెక్కు మూర్తులుగ ప్రకటమై వెన్నను దొంగిలించి , వారికి ఆనందమును కలిగించెడి వాడు. ఈ లీలద్వారా '**కృష్ణస్తు భగవాన్ స్వయమ్** ' అని ఋజువు చేసెను. భగవంతుని లీలలు దివ్యమైనవి. శ్రీకృష్ణుడు భగవద్గీతలో "జన్మ **కర్మ చమే దివ్యమ్** " అని చెప్పెను. గోపికలందరూ కృష్ణుడు తమ ఇండ్లలో వెన్నను దొంగిలించెనని యశోదకు ఫిర్యాదు చేసిరి. కృష్ణుడు తన ఇంటిలోనే యున్నందున యశోద నవ్వుచు వారితో "ఓ గోపికలారా! నా కృష్ణుడు నా కడనే యున్నాడు. మీరందరూ ఒకే సమయములో వెన్నను దొంగిలించినాడని చెప్పుచున్నారు. అది ఎట్లు పొసగును? నమ్మ శక్యముగ లేదు. ఈ సారి నా కృష్ణుడు వచ్చిన యెడల పట్టుకొని తీసుకురండు. అపుడు నేను వానిని శిక్షింతు"ననెను. గోపికలందరూ అట్లే యని తమ ఇండ్లకు వెడలిపోయిరి. మరునాడు కృష్ణుడు యథాప్రకారము బ్రహ్మ ముహూర్తమున గోపికల ఇండ్లలో ప్రవేశింపగా గోపికలు వానిని పట్టుకొని తమ తమ భుజములపై నెక్కించుకొని యశోద వద్దకు వచ్చిరి. " ఓ యశోదా! ఇదిగో నీ బిడ్డను తీసుకు వచ్చినాము. చూడుము" యని భుజముల నుండి దింపుచుండగా గోపికలందరూ తమ

బిడ్డలనే చూచి నివ్వెరపోయెను. ఇంతలో కృష్ణుడు లోపలినుండి యావింతను చూచుటకు వెలుపలకు వచ్చెను. అప్పుడు యశోద "ఏమమ్మా మీరు మీ బిడ్డలను తీసుకువచ్చి నా బిడ్డ దొంగతనము చేసినాడను నింద మోపుట భావ్యమా!" యని పలికెను. గోపికలు చేయునది లేక తమ తప్పు క్షమింపమని యశోద పాదములకు నమస్కరించి తమ బిడ్డలను భుజములపై నెక్కించుకొని ఇండ్లకు తిరిగి రాగా వారి భుజములనుండి కృష్ణుడే దిగెను. అపుడు కృష్ణుడు " మా అమ్మతో చెప్పి నన్ను దండింతురా? ఇపుడు ఎవరు అవమానింపబడితిరి" యని పరిహసించెను.

శ్రీకృష్ణుడు ఒకనాడు వెన్నను దొంగిలించగ యశోద పట్టుకొనుటకు ప్రయత్నించెను. కాని ఆతడు చిక్కునా? చాల సేపు తనతో పరువెత్తి అలసిపోయిన తన తల్లిని చూచి కృష్ణుడు జాలిపడి, యశోదకు వశమయ్యెను. కృష్ణుని త్రాటితో రోటికి బంధింప ప్రయత్నించినది యశోద. తన కడ నున్న త్రాళ్ళు సరిపోక గోపికల ఇండ్లలోని త్రాళ్ళను కూడ ఉపయోగించినది. ఇట్లు ఎన్నిత్రాళ్ళు జత చేసి కృష్ణుని బంధింప ప్రయత్నించిననూ రెండంగుళములు తక్కువగు చుండెను. (దీని అంతరార్థ మేమనిన ఒకటి మన ప్రయత్నము, రెండవది భగవానుని అనుగ్రహము కూడ ఉండవలయును. అపుడె భగవానుడు లభ్యమగును). యశోద కృష్ణుని బంధింపలేక పోయెను. అపుడు గోపికలందరు నవ్వసాగిరి. యశోద కూడ నవ్వుచు విస్మితురాలయ్యెను. తల్లియగు యశోదయొక్క పరిశ్రమచే కలగిన అలసటను చూచి కృష్ణుడు దయతో తానే బంధితుడయ్యెను. ఈ విధముగ యశోద కృష్ణుని రోటికి కట్టి వేసినది.

నేమం విరించో న భవో న శ్రీరప్యంగ సంశ్రయా ।
ప్రసాదం లేభిరే గోపీయత్తత్ ప్రాప విముక్తిదాత్ ॥
నాయం సుఖాపో భగవాన్ దేహినాం గోపికాసుతః ।
జ్ఞానినాంచాత్మ భూతానాం యథా భక్తిమతా మిహ ॥

(భా. 10-9-20,21)

జగత్తనకు ముక్తినిచ్చునట్టి శ్రీకృష్ణుని వలన గోపిక యగు యశోద అనుగ్రహమునొందినట్లు బ్రహ్మ మహేశ్వరులే కాదు, సాక్షాత్తు భగవానుని అర్థాంగి యగు లక్ష్మీదేవి కూడ పొందలేక పోయెను. గోపికాసుతుడగు శ్రీకృష్ణ భగవానుడు భక్తులకు సులభుడైనట్లు దేహాభిమానులగు తాపసులకు గాని ఆత్మదర్శులగు జ్ఞానులకు గాని వశీభూతుడు గాడు

ఈ విధముగ రోటికి బంధింపబడిన కృష్ణుడు తల్లి గృహ కార్యములందు నిమగ్నమై యుండగ పూర్వజన్మమున కుబేరుని పుత్రులగు నలకూబర మణిగ్రీవులు నారదమహర్షి శాపగ్రస్తులై యమళార్జున వృక్షములుగ జన్మింప వారిని యుద్ధరింప నెంచెను. కృష్ణుడు రోటిని లాగికోనుచు ఆ రెండు వృక్షముల నడుమ నుండి వెడలగ సువిశాలమగు నావృక్షములు నేలకూలినవి. ఆ వృక్షముల నుండి శాపవిముక్తులై తపస్సుచే నిష్కల్మషులై ప్రకాశవంతముగనున్న కుబేరుని కుమారులు కృష్ణుని ఈ క్రింది విధముగ స్తుతించి, ఆయనకు ప్రదక్షిణమాచరించి తమ తమ నెలవులకు వెడలిరి.

*వాణీ గుణాను కథనే శ్రవణౌ కథాయాం*
*హస్తౌ చ కర్మసు మనస్తవ పాదయోర్నః ।*
*స్మృత్యాం శిరస్తవ నివాస జగత్ప్రణామే*
*దృష్టిః సతాం దర్శనేఽస్తు భవత్తనూనామ్ ॥*

*(శ్రీమద్భాగవతము **10. 10. 38**)*

*నీ పద్యావళు లాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులన్*
*నీపేరంబనిసేయు హస్తయుగముల్ నీమూర్తిపై (జూపులున్*
*నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీ సేవపై ( జిత్తముల్*
*నీ పై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజ పత్రేక్షణా!*

*( భాగవతము**10 .40**)*

మా వాక్కులు నీ గుణములను కీర్తించుట యందు, శ్రవణేంద్రియములు నీ గుణములను వినుటయందు, చేతులు నీకు ప్రీతిని కలిగించు పనులయందు, మనస్సు నీ పాద పద్మములను స్మరించుటయందు, మస్తకములు నీవధిష్ఠించిన ఈ సమస్త బ్రహ్మాండమునకు ప్రణమిల్లుట యందు, చక్షువులు నీ మూర్తి స్వరూపులగు సాధువులను దర్శించుటయందు లగ్నమగుగాక!

ఈ విధముగ వారిరువురు స్తుతించి కృష్ణునిచే శాపవిముక్తులై తమ తమ స్థలములకు వెడలిపోయిరే గాని రోటికి కట్టబడిన కృష్ణుని బంధనమును తొలగించ లేక

పోయిరి. భగవంతునకు ఆకలి దప్పికలు, సుఖ దుఃఖములు, బంధమోక్షములు యుండవని పెక్కుమంది భావించెదరు. కాని శ్రీకృష్ణుడు త్రిగుణాతీతుడు, ద్వంద్వాతీతుడు, లీలాపురుషోత్తముడయిన కారణమున దివ్యములు, ప్రకృతికి అతీతములు నగు లీలలను చేయుచుండును. భగవానుడు భగవద్గీతలో అర్జునితో నిట్లు చెప్పెను.

"జన్మ కర్మ చ మే దివ్యం" "**అజోఽపి సన్ అవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్**", నా యొక్క జన్మము కర్మములు దివ్యములు. నేను జన్మరహితుడను, పరమాత్మను, సర్వభూతములకు నీశ్వరుడనై యుండియు, శుద్ధము సాత్త్వికమునగు నాప్రకృతిని స్వీకరించి ఆత్మ మాయచే నవతరించు చున్నాను". తన అనన్యభక్తులకు, ప్రేమిక భక్తులకు ఆనందము కలిగించుట కొరకు బంధనము లేనివాడు బంధనమును స్వీకరించును. ఆకలి లేని వాడు భుజించును. జన్మము లేనివాడు జన్మించును. కేవలము ఐకాంతిక భక్తులు మాత్రమే ఈ తత్త్వమును అనుభూతినొందగలరు. కర్మలకు, జ్ఞానులకు, దేవతలకు గూడ ఈ విషయములు ఊహాతీతములు. యశోద శ్రీకృష్ణుని కేవలము త్రాటిచే గాక వాత్సల్య రస భక్తిచే బంధించిన కారణమున శ్రీకృష్ణుడు కూడ యశోదప్రేమకు వశుడై బంధనమును స్వీకరించిన కారణమున నలకూబర మణిగ్రీవులు కృష్ణుని బంధనమును తొలగించలేక పోయిరి. అనంతరము నందమహరాజు మాత్రమే ఆ బంధనము విప్పివేసెను.

*చిక్కడు సిరి కౌగిటలోఁ*
*జిక్కడు సనకాది యోగి చిత్తాబ్జములం*
*జిక్కడు శ్రుతి లతికావలి*
*జిక్కెనతడు లీలఁదల్లి చేతన్ ఱోలన్*

సర్వతంత్ర స్వతంత్రుడగు భగవానుడు "**అహం భక్త పరాధీనః**" అనినట్లు కేవలము భక్తుల యొక్క అధీనతను స్వీకరించును.

**బ్రహ్మాండ ఘాట్ :-**

ఇచట శ్రీకృష్ణుడు తన బుల్లి నోటిలో తల్లికి సమస్త బ్రహ్మాండమును చూపెను. అందు వలన ఈ స్థలమునకు బ్రహ్మాండ ఘాట్ యని పేరు కలిగినది. ఒకనాడు

శ్రీకృష్ణుడు గోపాలురతో ఆడుకొనుచుండగ బలరాముడు యశోద కడకేతెంచి "అమ్మా! తమ్ముడు మన్నుతినినాడ"ని చెప్పెను. యశోద కృష్ణుని చేతులను పట్టుకొని గద్దించి "ఎందులకు మట్టితింటివి? నీ సహచరులగు గోపాలురు, నీయన్న గూడ నీవు మట్టి తింటివని చెప్పుచుంటిరి" అనెను. అపుడు కృష్ణుడు భయపడుచు "నేను మన్ను తినలేదు. వీరందరు అసత్యము పలుకుచుండిరి. కావలెననినచో నా నోటిని చూడు'' మనెను. కృష్ణుడు తన బుల్లి నోటిని తెరువగా, యశోద కృష్ణుని నోటిలో స్థావర జంగమములు, అంతరిక్షము, దిక్కులు, పర్వతములు, నదులు, సముద్రములు, ద్వీపములు, భూతలము, ప్రవహించు వాయువు, అగ్ని, చంద్రుడు, నక్షత్రములు, జ్యోతిశ్చక్రము, జలము, తేజస్సు, మహత్తత్త్వము, ఇట్లు అఖిల బ్రహ్మాండమును, తనను, కృష్ణునితో పాటు వ్రజము దర్శించి ఆశ్చర్యమును భయమును పొందెను. ఈవిధముగ కృష్ణుడు అణువులో బృహత్‌ను చూపెను.

*ఆలలితాంగి కనుంగొనె బాలుని*
*ముఖమందు జలధి పర్వత వన భూ*
*గోళ శిఖి తరణి శశి ది*
*క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్.*

**చింతా హరణ ఘాట్ :-**

బ్రహ్మాండ ఘాట్ కు దగ్గరలో చింతాహరణ ఘాట్ యున్నది. ఘాట్ పై భాగమున శ్రీచింతేశ్వర మహదేవుని మందిరమున్నది. బ్రహ్మాండ ఘాట్ లో కృష్ణుని నోటియందు సకల బ్రహ్మాండమును చూచిన యశోద భయభ్రాంతులనొంది శ్రీకృష్ణుని మేలు కొరకు ఇచటకు వచ్చి ఈశ్వరుని ప్రార్థించగ ఆమె చింత పోయినది. అందు వలన దీనిని చింతాహరణ ఘాట్ అందురు.

శ్రీ గర్గాచార్యుల వారు తమ భాగవతములో సామాన్యులకు కూడ భగవల్లీలా మాహాత్మ్యము తెలియుటకై ఒక కథను వ్రాసెను. కృష్ణుని బాల్య లీలలను దర్శింపవలెనను సంకల్పముచే దుర్వాస మహర్షి గోకుల మహావనమున ప్రవేశించెను. బ్రహ్మాండ ఘాట్‌నందు శ్రీకృష్ణుడు తోటిబాలురతో ఆడుకొనుచు శరీరమంతయు

ధూళిపోసుకొనెను. త్రిభంగభంగిమ ముగ్ధమోహన రూపముతో నున్న ఆ కృష్ణుని తన్మయత్వముతో దర్శించుచు, "బ్రహ్మాది దేవతలచే నిరంతరము పూజింపబడు గోలోక విహారియగు శ్రీకృష్ణుడితడేనా!" యని సందేహము కలిగెను. కృష్ణుడు తోటి బాలురతో లీలలు చేయుచునే యుండెను. దుర్వాసునకు అంతకంతకు అనుమానము పెరుగుచుండెను. శ్రీకృష్ణుడు దుర్వాసుని నలుదిశల భ్రమించుచు నవ్వుచు ఆవులించెను. అప్పుడు కృష్ణుని నోటియందు దుర్వాసుడు ప్రవేశించెను. అఖిలాండ కోటి బ్రహ్మాండము లెవని కుక్షిలో యున్నవో, ఎవరి ఉచ్వాస నిశ్వాసములతో సృష్టి ప్రళయములు జరుగుచున్నవో, సమస్త కారణములకు కారణ స్వరూపుడో అట్టి ప్రభువగు బాలకృష్ణుని కుక్షియందు సమస్తమును దుర్వాసుడు దర్శించెను. ప్రళయకాలమందు తాను, గోపాలురు, కృష్ణుడు మిగిలియుండుట చూచెను. అంతియే గాక మహావైకుంఠమును, శ్రీమన్నారాయణమూర్తిని, గోలోకమును అచట కృష్ణ లీలలను కూడ దర్శించెను. అనంతరము వెలుపలకు వచ్చెను. పూర్వ మేవిధముగ కృష్ణుడు గోపబాలురతో ఆడుచుండెనో ఆ దృశ్యమును చూచి ఆతడు గోలోకవిహారియగు శ్రీకృష్ణుడే యని నిర్ధారించుకొని నమస్కరించి పలువిధముల ప్రార్థించి క్షమింపమని వేడుకొనెను.

**రమణరేతి:-**

ఇది కృష్ణుడు తన గోపాలురతో, సఖులతో అనంతాద్భుతమైన బాల్యలీలలు చేసిన స్థలము. అసంఖ్యాకములగు ధేనువులతోను, సాధువుల ఆశ్రమములతోను మనోహరముగ యుండును.

**రావల్ :-**

రావల్ వ్రజేశ్వరియగు శ్రీరాధిక యొక్క ఆవిర్భావ స్థలము. ఇది గోకులమునకు రెండుమైళ్ళ దూరముఽ యమునానదీ తీరమున నున్నది. ఇచ్చట భాద్రపద శుద్ధ అష్టమినాడు మధ్యాహ్న సమయమున శ్రీవృషభాను మహారాజు, కృత్తిదా సుందరి లకు శ్రీరాధిక ఆవిర్భవించెను. వీరిరువురు కూడ గోలోకమున భగవానుని నిత్య సిద్ధ పార్షదులు. గోలోక విహారియగు శ్రీకృష్ణుడు గోకులమునందు అవతరించినప్పుడు శ్రీమతి రాధిక గూడ రావల్ యను గ్రామములో పద్మవనమునందు స్వర్ణపేటికలో వృషభాను మహారాజుకు దర్శనమిచ్చెను. ఆమెకు పద్మినీ జాతి స్త్రీలకు గల సకల సల్లక్షణములు యుండెను. అట్టి శిశువును పొందిన వృషభాను మహారాజు మహదానందముతో నృత్యముగావించెను. కీర్తిద మున్నగు వారందరు ఎంతయో

పరవశించిరి. కాని వారందరకు తీరని దుఃఖము కలగెను. ఆశిశువు యొక్క నేత్రములు ముద్రితములై యుండెను. కనులు తెరచి చూడకుండెను. భగవత్సంకల్పమెవరికి తెలియును? భూలోకమునం దవతరించి ప్రథమముగ శ్రీకృష్ణునే చూడవలయునని ఆమె సంకల్పము.

శ్రీమతి రాధిక ఆవిర్భవించినదని తెలిసికొనిన నారదుడు రాధాకృష్ణుల దివ్యలీలలను కీర్తించుచు అచటకేతెంచెను. నారదుని భక్తికి మెచ్చి రాధిక ఏకాంతమున తన దివ్యదర్శన మొసగెను. సర్వసల్లక్షణాన్వితయు, కళ్యాణగుణనిధియునైన శ్రీమతి రాధికను దర్శించి ఆమె రూప లావణ్యములను వేనోళ్ళ కొనియాడుచు నారదుడు సర్వత్ర భ్రమింపసాగెను. భగవత్సంకల్పముచే తనకు శ్రీమతి రాధిక లభించినదని యానందముచే వృషభాను మహారాజు గొప్ప ఉత్సవమును చేసెను. వ్రజమండలము నందున్న వ్రజవాసులందరు ఆ యుత్సవములో పాల్గొనిరి. గోకులము నుండి నందమహారాజు కూడ సకుటుంబ పరివార సమేతముగ ఏతెంచెను. అందరూ ఉత్సవ యానందమున మునిగి యుండగ శ్రీకృష్ణుడు నెమ్మదిగ తన ప్రాణేశ్వరియగు రాధిక కడకేగి ఆమెను స్పృశించెను. కృష్ణ కరస్పర్శనొందిన రాధిక తన ప్రాణేశ్వరుడు వచ్చినాడని ఎరిగి ప్రప్రథమముగ ఆతనిని దర్శించెను. రాధిక కనులు తెరచినదని తెలిసికొనిన వ్రజవాసులు వృషభాను నందినియగు రాధికకు జయ జయ ధ్వానముల నొనరించిరి. రాధాకృష్ణులు ప్రథమముగ కలసికొనిన ఈ దర్శనము మహాభాగ్యవంతులకే లభించును. వృషభాను మహరాజుగారిచట కొంతకాలము నివసించెను.

శ్రీకృష్ణుడు పూతన తృణావర్తాసుర శకటాసురులను సంహరించిన తరువాత నందసునంద ఉపానందులు సమావేశమై ఆసురిక ఉత్పాతములు కలుగుచున్నందున గోకులములో యుండుట కన్నా మరెచ్చటికైననూ పోవనెంచి వ్రజవాసులందరు నందగ్రామమునకు వెళ్ళిరి. అప్పుడు వృషభాను మహరాజు కూడ తమ వ్రజవాసులతో 'రావల్' నుండి 'బర్సానా' కు వెళ్ళెను. రావల్‌లోను, బర్సానాలోను శ్రీరాధిక బాల్య లీలలన్నియు జరిగినవి.

**దావుజీ :-**

ఇది గోకులమునకు నాలుగు మైళ్ళ దూరమున నున్నది. ఇది బలదేవుని స్థానము. బలరాముడు కృష్ణునకు అన్న గావున ఆతనిని దావుజీ అనెదరు. ఇచట రేవతీ బలరాముల మందిరమున్నది. మహమ్మదీయులు ఈ మందిరమును ధ్వంసము చేయ ప్రయత్నించి మృత్యువాత పడిరి. ఇచ్చట సంకర్షణ కుండము లేక క్షీరసాగరమున్నది.

--o--

# 7. నందగ్రామము

తత్తచ్ఛిరో భూత మపారశోభం నన్దీశ్వరం సాధుగణావదన్తి।
నన్దీశ్వరం తం చ యదీయ రూపం శ్రీనన్దరాజాలయ రాజమానమ్॥

అపారమైన శోభతో విలసిల్లు శ్రీనందీశ్వర గ్రామమే (నందగ్రామమే) సమస్త గ్రామములకు శిరము వంటిది. ప్రసిద్ధినొందిన నందీశ్వర శివుడే నందీశ్వర పర్వతముగ యున్నాడని సాధువులు నిర్దేశించిరి. ఇచ్చటనే శ్రీనందయశోదలు, వారి నడుమ సులలిత త్రిభంగభంగిమ రూపముతో శ్రీకృష్ణ బలరాముల మూర్తులు విరాజిల్లుచున్నవి. ఈ పర్వతము చుట్టు వ్రజవాసుల గృహములున్నవి. ఇది బలరామ కృష్ణుల విహారస్థలము.

గోకుల మహావనమునందు నందమహారాజు నివసించుచున్నప్పుడు కృష్ణుని సంహరించుటకు కంసుడు పూతన, తృణావర్తాసుర, శకటాసురులను పంపెను. వారందరూ కృష్ణుని చేతిలో అసువులు బాసిరి. అనుక్షణము ఈ విధమగు దుర్ఘటనలు, అసుర ఉత్పాతములు ఎదురగుచుండుట వలన ఉద్విగ్న చిత్తులగు వ్రజవాసులు ఆ స్థానమును వదలి వేరెచ్చటకైననూ వెడల నాలోచించి నందగ్రామమునకు వచ్చిరి. నందుడు ఈ గ్రామమును నిర్మించిన కారణమున దీనికి నందగ్రామమనియు, నందీశ్వరుడు ఇచ్చట అధిష్ఠాన దేవతగ యున్నందున నందీశ్వరమనియు నామము లేర్పడినవి. ఇది గోకులమునకు సుమారు నలుబదిమైళ్ళ దూరమున నున్నది.

నందగ్రామము కేంద్రముగ 86 క్రోసుల పరిమితి గల వ్రజమండలము విస్తరించియున్నది. శ్రీకృష్ణుడు తన మూడవ ఏట నుండి మథుర వెళ్ళువరకు నంద గ్రామమునందే నివసించి నవనీతచోర లీల, సమస్త వ్రజమండలమునందు సంచరించుచు గోచారణ లీల, గోవర్ధనోద్ధారణము, రాసక్రీడ మున్నగు లీలలను గావించి వ్రజవాసులనందరిని ఆనందమున ముంచివేసెను. ఈ అత్యద్భుతమగు లీలలను బ్రహ్మాది దేవతలు దర్శించి ఆనందమునొంది తమ తమ జన్మలను ధన్యము చేసికొనిరి. ఇచటనే బాలగోపాలుని దర్శించుటకు శివుడు తపస్సు చేసెను. ఒకనాడు శివుడు భిక్షువు రూపముతో నందభవనమున కేతెంచి యశోదను తన బిడ్డడగు శ్రీకృష్ణుని చూపుమనెను. యశోద కృష్ణున కరిష్టము కలిగించుటకు ఏ యసురుడో మారువేషమున వచ్చినాడని తలంచి భయపడి కృష్ణుని చూపుటకు నిరాకరించి లోనికి తీసుకొని వెడలెను. తరువాత పౌర్ణమాసి సలహాననుసరించి యశోద ఆ శిశువగు కృష్ణుని శివునకు చూపెను. శివుడు కృష్ణుని చూచి నమస్కరించి ఆనందముతో పాదధూళిని శిరమున నిడుకొని పరమానంద భరితుడై కృష్ణ గుణ గానము చేయుచు వెడలిపోయెను.

**పావన సరోవరము :-**

పావన సరోవరము సత్యయుగమునాటిది. భక్తులు ఈ సరోవరములో స్నానమాచరించి నందమహారాజు దేవాలయమును దర్శింతురు. ఈ సరోవరము

ప్రక్కనే పావనవిహార్‌జీ మందిరము, శ్రీల సనాతన గోస్వామి భజన కుటీరము యున్నవి. శ్రీల సనాతన గోస్వామి ద్వాదశ వనములలో భ్రమణము చేయుచు తన సాధనను చేసెడివారు. వానిలో గోవర్ధనము నందలి మానసగంగ తీరముననున్న భజన కుటీరము, పావన సరోవర తీరముననున్న భజనకుటీరము విఖ్యాతినొందినవి. వ్రజమండలమునందు పులులు, సింహములు మున్నగు క్రూర జంతువులు తమ క్రూరత్వమును వదలి నెమళ్ళు, కుందేళ్ళు మున్నగు సాధుజంతువులతో కలసి తిరుగుచుండును. కంసుడు కృష్ణుని సంహరించుటకు ఎందరో రాక్షసులను పంపెను. కాని వారందరూ కృష్ణుని చేతిలో మరణించిరి. అందువలన కంసుడే స్వయముగ కృష్ణుని సంహరించుటకు నందగ్రామమున ప్రవేశించెను. అచటకు వచ్చినంతనే తన మనోభావన మరచి కృష్ణుని ఆశీర్వదించి వెడలిపోయెను. కాని నందగ్రామమునుండి వెలుపలకు వచ్చినంతనే కృష్ణుని చంపుట మరచితినని అనుకొనెడి వాడు. ఇట్లు పలుమారులు నందగ్రామమునకు వచ్చి వెడలిపోయెను. నందగ్రామమున నుండగ సంహరించుట సాధ్యముగాదని ఆలోచించి అక్రూరుని ద్వారా ధనుర్యాగ నెపముతో కృష్ణుని మధురకు రప్పించెను. కృష్ణుడు వ్రజమునుండి మధురకు వెళ్లిన మార్గము ఇప్పటికిని ఇచట యున్నది.

మధుర వెళ్లిన కృష్ణుడు మరల బృందావనమునకు తిరిగి రాలేదు. వ్రజవాసులను ఓదార్చుటకు కృష్ణుడు ఉద్ధవుని పంపెను. ఉద్ధవుని ఓదార్పు వాక్యములచే వ్రజవాసుల యొక్క దుఃఖము పెరిగెనే గాని తగ్గలేదు. వ్రజవాసులు శ్రీకృష్ణుని యందలి ప్రేమచే విడచిన అశ్రువులు ఒక పెద్ద సరోవరముగ ఏర్పడినవి. అదియే ప్రేమ సరోవరము. శ్రీమద్భాగవతమునందలి భ్రమరగీతలు ఇచ్చటనే జరగినవి.

**శేషసాయి:-**

ఇది నందగ్రామమునుండి ఢిల్లీ పోవు మార్గమున గలదు. శ్రీకృష్ణుడు గోపగోపికలతో గోచారణ చేయుచు శేషసాయి నారాయణుని చూచి తాను కూడ అట్టి లీల చేయ సంకల్పించగ శ్రీకృష్ణుని మనోభావమును గ్రహించిన శ్రీమతి రాధిక,'కృష్ణరూపముననున్న నీకెట్లు సంభవము?' అని చెప్పి గోపాలురతో ఆలీలకు అనుకూలమగు వాతావరణమును సృష్టింపమనెను. గోపాలురు గోవులనన్నిటిని అచటకు రప్పించ అవి అన్నియు తమ పొదుగుల నుండి క్షీరమును వర్షించెను. అవి క్షీర సరోవరముగ ఏర్పడగ బలరాముడు అందు ఆదిశేషుని రూపమును ధరింప కృష్ణుడు శ్రీమన్నారాయణునిగ ఆది శేషునిపై శయనించెను. శ్రీమతి రాధిక కృష్ణుని అతి మృధువైన పాదములను క్షీరముతో అభిషేకించి తన హృదయమందు ధరించెను. అందువలన ఈ స్థలమునకు "శేషసాయి" అనిపేరు వచ్చినది.

# 8.బర్సానా

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, గోలోక విహారులగు శ్రీశ్రీరాధాకృష్ణులు భూలోకమునందవతరించునపుడు వారి సేవను అనుగ్రహింప వలసినదిగా కోరి తపమాచరించిరి. కృష్ణుడు వారి యభీష్టమును నెరవేర్చుట కొరకు వారిని ముగ్గురను మూడు పర్వతములుగ యవతరింపుడని ఆదేశించెను. బ్రహ్మ బ్రహ్మగిరి లేదా బర్సానాగను, విష్ణువు గోవర్ధన పర్వతముగను, శివుడు నందీశ్వర పర్వతముగను యవతరించిరి. బ్రహ్మగిరి యున్న కారణమున ఈ గ్రామమును బర్సానా అనియు, వృషభానురాజు నివసించినందున వృషభానుపురమనియు అందురు. గోలోకమునుండి నంద మహారాజు తన పరివారముతో నందగ్రామము వెడలినప్పుడే, రావల్ నుండి వృషభాను రాజు కూడ తన పరివారముతో బర్సానాకు తరలివచ్చెను. ఈబ్రహ్మగిరిపై శ్రీశ్రీరాధాకృష్ణుల దివ్యమందిరమున్నది. ఇచట శ్రీరాధాష్టమినాడు మధ్యాహ్న సమయమున శ్రీరాధికకు ప్రత్యేకముగ అభిషేకము, పూజ జరుగును. వేలాది భక్తులు ఆ ఉత్సవమును దర్శించెదరు. ఆలయమునకు ముందు విశాలమగు మంటపము గలదు. అచట నృత్యనాటికలు, రాధాకృష్ణ లీలాభినయము జరుగుచుండును. మందిరమునకు దగ్గరగ బ్రహ్మ యొక్క విగ్రహము, ప్రక్కగ శ్రీరాధాదేవి యొక్క శిశు కాలము నాటి చరణ చిహ్నములను దర్శింపవచ్చును. ఈ పర్వతము పై నుండి వ్రజమండల శోభను, నందభవనమును దర్శింపవచ్చును.

బ్రహ్మగిరికి ఎడమవైపున గల వేరొక పర్వతముపై విలాసగడ్ కలదు. ఇది శ్రీశ్రీ రాధాగోవిందుల విలాసస్థానము. ఇచట మనోహరమగు రాసమంచ కలదు. ప్రప్రథమముగ ఇచటనే రాధాగోవిందుల రాసలీల జరగినది. దీనికి దగ్గరలో శ్రీరాధిక యొక్క ధూళీ - ఖేలన స్థానమున్నది. అచట శ్రీమతి రాధిక తన సఖులతో “ధూళి ఖేలా” యనెడి ఆట యాడుకొనెను. బ్రహ్మగిరికి ఈ పర్వతమునకు నడుమ సన్నని మార్గము కలదు. దానిని “సాకరీఖోర్” అందురు. ఈ మార్గము గుండా గోపికలు పాలు, పెరుగు, వెన్నలను ఇతర గ్రామములకు తీసికొని వెళ్ళెడి వారు. అప్పుడు కృష్ణుడు వారిని అడ్డగించి వారి వద్ద పన్ను వసూలు చేసెడివాడు.

**మాన్‌గడ్ (మానమందిరము) :-**

మానము అనగా అభిమానము లేక అలక అని అర్థము. ఇది శ్రీరాధాదేవి కృష్ణునిపై అలిగిన స్థలము. సమస్త గోపికలలో రాధిక సర్వశ్రేష్ఠురాలు. రాధిక ఆనుగత్యములో సమస్త గోపికలు శ్రీకృష్ణుని సేవింతురు. ఒకానొక రోజున శ్రీకృష్ణుడు

వృషభాను నందినియగు రాధాదేవికి సంకేత స్థానమున తనను కలసికొనుమని జెప్పి సుబల సఖునితో కలసి అచటకు వెడలుచుండెను. మార్గమున చంద్రావళి యొక్క ప్రియసఖి యగు పద్మ ఎదురై శ్రీకృష్ణ దర్శన మాత్రమున ఉత్ఫుల్ల నేత్రియై కృష్ణుని మార్గము నడ్డగించి ఇట్లనెను "ఓ కృష్ణా! నీవు ఎంత నిష్ఠురుడవు. మేమందరము నిన్ను వెదకి వెదకి అలసిపోయితిమి. ఎచ్చటను నీజాడ కనబడలేదు. ఇప్పుడు ఇచ్చట దర్శనమిచ్చితివి. నా సంగతికేమి గాని మాప్రియసఖియగు చంద్రావళి యొక్క విరహస్థితిని ఏమని వర్ణింతును? నీ దర్శనము లేని కారణమున ఆమె హృదయము విదీర్ణమగుచున్నది. కావున నీవు దయచేసి ఒకసారి చంద్రావళిసఖిని కలసికొని, ఆమె ప్రాణమును రక్షింపుము. లేనిచో ఇచ్చటినుండి నిన్ను ఒక్క అడుగు కూడ కదలనీయము'". అని పలుకుచుండగ చంద్రావళి అచటకు ఏతెంచెను. ఆమెను చూచినంతనె చతురశిరోమణి యగు శ్రీకృష్ణుడు చిరునవ్వుతో "ప్రియా! నిన్ను గూర్చి కూడ నేను వనమంతయు వెదకుచుంటిని. హఠాత్తుగ ఎవరేని చంద్రాయని ఉచ్చరించినంతనే నేను ధైర్యమును కోల్పోవుదును. ఆకాశము నందలి చంద్రుని చూచినప్పుడు గూడ నీవే గుర్తుకు వచ్చి నిన్ను కలసికొనవలెననెడి లాలస అధికమగును. నిజముగ నామాటలను నమ్ముము. ఇది సత్యము" యని పలుకుచుండగా రాధిక యొక్క 'శారిక' యను పక్షి చంద్రావళి కృష్ణుల సంభాషణమును విని, గోపీ సభలో వెల్లడించెను. వెంటనే లలితాసఖి క్రోధాన్వితురాలై సఖులందరను యుద్దేశించి "మీరందరూ గోవర్ధన మల్లుని ఇంటికి వెడలి చంద్రావళి వృత్తాంతమును చెప్పుడ" నెను. సఖులు లలితాసఖి యొక్క ఆదేశము ప్రకారము చంద్రావళియొక్క అత్తగారి కడ సమస్త వృత్తాంతమును వెల్లడించిరి. అది వినిన కరళ (అత్తగారు) క్రోధముతో తర్జన గర్జన చేయుచు కృష్ణుడు మరియు చంద్రావళి యున్న చోటుకు వెడలెను. ఆమె రాకను చూచిన పద్మ చంద్రావళికి తెలుపగ ఆమె భీతయై మూర్ఛిల్లెను. కృష్ణుడామెను ఓదార్చి భయపడవలదని చెప్పి తాను కాత్యాయనీ విగ్రహ రూపును దాల్చెను. కరళ వచ్చి - "మీరందరూ ప్రతిరోజు చంద్రావళితో పరపురుషుని సంగలాభము కొరకు వనములలో తిరుగుచున్నారని పొరపాటుగ తలంచితిని. కాని చంద్రావళి మా కుమారుని క్షేమము కొరకు కాత్యాయనిని పూజించుట నాకెంతయో ఆనంద దాయక" మని చెప్పి వారినాశీర్వదించి గృహమునకు వెడలెను. అప్పుడు సుబలుడు కృష్ణునితో " నీ ఇంద్రజాల విద్య సఫలమైనది" యని పలుకగా ఇరువురు నవ్వుకొనిరి. కృష్ణుడు సుబలుని వెంటనిడుకొని రాధిక కడకేగెను. దూరమునుండియే శ్రీకృష్ణుని రాకను చూచిన శ్రీమతి రాధిక పట్టరాని కోపముతో వెనుకకు తిరిగెను. అప్పుడు లలితాసఖి కృష్ణునితో "కృష్ణా! నీవు మిగుల నిష్ఠురడవు. వివిధ కుంజములలో విహరించుచుందువు.

కావున ఒక్క అడుగు కూడ ముందుకు వేయవలదు. ఇంతవరకు ఎచ్చట యుంటివి? ఎవరితో విహరించు చుంటివి? ఇక నీవు రాధికపై యాశను వదలి వెడలిపో వచ్చును" యని పలుకగా, కృష్ణుడు గద్గద స్వరముతో "నీవు అనవసరముగ నిర్దోషినగు నాపై కోపించుచున్నావు. రాధ తప్ప నాకు ఇంకెవ్వరును ప్రియులు లేరు. ఆమె లేక ఒక్క ముహూర్త కాలము కూడ నేనుండలేను. నాప్రాణేశ్వరియైన రాధాదేవి నామ రూప గుణములే నా జీవనము, ప్రాణములు. ఎట్లైన నీవే నన్నీ విపత్తు నుండి రక్షింపవలె"నని పలికి, రాధ కడకేగి సవినయముగ అశ్రుపూరిత నయనములతో "హేరాధే! నన్ను రక్షింపుము. నన్ను క్షమింపు"మని వేడుకొనెను. శ్రీకృష్ణుడిట్లు ఎంత ప్రార్థించినను మానిని యగు శ్రీరాధ ఒక్కమారైననూ ఆతనివైపు చూడలేదు. మాట్లాడలేదు. అప్పుడు కృష్ణుడు ఖిన్నుడై కుంజమునుండి బహిర్గతుడాయెను. శ్రీకృష్ణుని యొక్క అట్టి యవస్థను చూచిన విశాఖ రాధతో ఇట్లు పలికెను. "హే రాధే! శ్రీకృష్ణుని యందు నీకు ఇంతటి క్రోధము తగదు. శ్రీకృష్ణుడు స్వాభావికముగ మోసగాడని తెలియక ఆతనిని ప్రేమించితివి. ఇప్పుడు విచారించి ఏమి లాభము? కాని నీయందాతనికి అత్యధిక ప్రీతియున్న మాట సత్యమని తెలుసుకొనుము. నిన్నువిడచి ఆతడు ఒక్క క్షణము కూడ యుండలేడు. నీవును ఆతనిని విడచి క్షణ కాలము యుండజాలవు. ఈ విషయము మాకందరకును తెలిసినదే . కావున నీవు కోపమును మాని నీ ప్రాణేశ్వరుడగు కృష్ణునకు ఆనందము కలిగించుము." అపుడు శ్రీరాధిక "ఓ విశాఖా ! నీవు నా అంతరంగిక సఖివైయుండి కూడ కృష్ణుని సమర్థించుచున్నావు" యని కోపముతో పలికెను. అపుడు విశాఖ మానినియగు రాధ యొక్క స్థితిని కృష్ణునకు వివరించి, "కృష్ణా! రాధను ప్రసన్నురాలినిగ చేసికొనుటకు ఒక్కటే మార్గమున్నది. నీవు శ్యామాసఖి రూపమును దాల్చి వీణ చేత బట్టుకొని ఆమె సభకు వెడలి వీణను మ్రోగించినచో ఆ రాధ తప్పక ప్రసన్నురాలగును" అనెను. విశాఖ చెప్పిన ప్రకారము కృష్ణుడు వాద్యకారిణి వలె ఆభరణ భూషితుడై చేత వీణనిడుకొని సఖీసభకు వెడలెను. సఖులందరూ ఆమెను చూచి గౌరవించి సభలోనికి ఆహ్వానించిరి. అప్పుడు రాధ వీణావాదకు రాలగు ఈమె ఎవరని యడుగగ విశాఖ "ఈమె శ్యామాసఖి, వీణ వాద్యములో అందెవేసిన చేయి. నీ గుణగణములను విని ఇచట కేతెంచినది" యనెను. అపుడు రాధ శ్యామసఖిని వీణ వాయింపుమని ఆదేశింపగా సకల కళలకు గురువగు శ్రీకృష్ణుడు వీణను మధురముగ వాయించెను. వృషభానునందిని శ్యామాసఖి యొక్క అపూర్వమగు వీణావాదనమును విని, పట్టరాని ఆనందముతో శ్యామాసఖిని ఆలింగనము చేసికొనెను. శ్యామాసఖి

రూపములోని కృష్ణుడు కూడ రాధను ఆలింగనము చేసికొనగా సఖులందరు జయ జయ ధ్వానములు చేసిరి . ఈ విధముగ రాధాదేవికి కృష్ణుని పట్ల కలిగిన మానము లేదా అలక తొలగినందున దానికి మానమందిరము లేదా మానగడ్ అని పేరు వచ్చినది.

**మోర్ కుటి (మయూర్ కుటి) :-**

ఇచ్చట ఒకనాడు శ్రీరాధాగోవిందుల చుట్టు చేరి పెక్కు నెమళ్ళు పురి విప్పి నాట్యము చేయసాగినవి. రాధాగోవిందులు కూడ నెమలి రూపములను ధరించి నృత్యము చేసిరి. అందువలన దీనికి 'మయూర్ కుటి' అని పేరు వచ్చినది.

**సంకేతము:-**

ప్రేమ మూర్తులైన శ్రీశ్రీరాధాకృష్ణుల యొక్క మిలన స్థానమే సంకేతము. ఇది నందగ్రామమునకు బర్సానాకు నడుమగలదు. లలితాది సఖులు యత్నముతో వారిరువురిని ప్రప్రథమముగ ఇచ్చటనే మిలనము గావించిరి.

ఒకానొక రోజున శ్రీకృష్ణుడు కాళీయ మర్దనము చేసిన స్థలములో సఖులతో కూడిన రాధికను దర్శించినవాడై పరమానందము నొంది ఆమెను కలసికొనుటకై ఉద్విగ్నచిత్తుడయ్యెను. ప్రియనర్మ సఖుడైన సుబలుడు కృష్ణుని అట్టి వ్యాకులతకు కారణమడుగగ కృష్ణుడు ఇట్లు చెప్పెను. "ఓ సఖా ! నేను కాళీయ దమనము చేసినవాడు అచట అనేక గోపరమణులుండిరి. కాని రూపమునందు, గుణమునందు సాటిలేనిదియు, చిరునవ్వు గలిగిన మోముగలదియు, చంచల నేత్రియునగు ఒకానొక పరమ సుందరి (రాధిక) నా చిత్తమును ఆకర్షించినది. ఆమెను కలసికొన నంత వరకు నాకు సుఖము లేద" ని చెప్పగా సుబలుడు " ఓ సఖా! అట్లయిన ఆ సుందరిని ఇచ్చటకు తీసుకు వత్తును నిశ్చింతగ నుండు" మనెను.

ఇటు శ్రీమతి రాధిక "కృష్ణ" యనెడి రెండక్షరములను పౌర్ణమాసి ముఖత: వినినంతనే ఉత్కంఠితయై శ్రీకృష్ణుని మురళీధ్వనిని విని వ్యాకులత నొందెను. పిమ్మట స్వప్నమునందు యమునాతీరములో కదంబకాననమున అపురూపమగు శ్యామసుందర రూపమును దర్శించి ఉద్విగ్ను రాలయ్యెను. "కృష్ణ" యనెడి శబ్దము, మురళీధ్వని, శ్యామరూపము- ఈ ముగ్గురు పురుషులయందు ఉదయించిన రతిచే ఉద్విగ్నరాలై రాధ ఒకానొక అనిర్వచనీయమైన దశను పొంది సర్వాంగ పులకితయై లేశమాత్రమైనను స్పష్టత లేక అభీష్ట దర్శన చింతయందు నిమగ్నయై సఖుల పిలుపుకు కూడ సమాధానమొసంగ లేని స్థితిలోనుండెను. మరియు కోటి సముద్ర గంభీర విరహ

దుఃఖముతో రోదించ సాగెను. ఆమెకు అష్టసాత్విక వికారములు పొడసూపెను. రాధిక యొక్క ఇట్టి స్థితిని జూచి గోపికలు "రాధే! నీకిట్టి దశ ఏల సంభవించినది? నీ వదన దర్శనముచే మా హృదయములు విదీర్ణములగుచున్నవి " అని పలుకగా రాధ "నేను కులవధువును. నామనస్సు ముగ్గురు పురుషుల యందు ఆసక్తి కలిగి మూడువైపుల పరువెత్తుచున్నది. నే నేమి చేయుదును? నేను జీవించి ఏమి చేసెదను? నాకు మరణమే మేలు" అనెను. ఆమాటలు విన్న లలితాసఖి "ఆ ముగ్గురు పురుషులు ఎవరు? వారు నీ చిత్తమును ఏవిధముగ హరించిరి?" అని అడుగగా రాధిక, "వినుము. కృష్ణనామము కలిగిన ఒక పురుషుడు తన నామము ఉచ్చరించినంతనే నా హృదయమునందు ప్రవేశించి బహిర్గతము కాకుండెను. ఇంకొక పురుషుని యొక్క వంశీధ్వనిని వినినంతనే నామనము ఉన్మత్తయై ఆవంశీధ్వనియందు అత్యంతాసక్తమై యున్నది. ఇంకను నవజలధర కాంతి విశిష్టుడైన పీతాంబరధారి, దొండపండు వంటి ఎఱ్ఱని అధరము గలిగి మృదుమధుర హాస్యముచే శోభితుడగు నొక పురుషుని యమునా తీరమందు స్వప్నమున దర్శింపగ, అతడు నన్ను ఎంతగనో ఆకర్షించెను" అని వివరించెను. అప్పుడు లలిత "రాధే ! వారు ముగ్గురు వేర్వేరు కారు. ఆ ముగ్గురు ఒకడే. ముందుగా ఎవరి నామమును నీవు వింటివో ఆతనిదే ఆవంశీధ్వని. ఇంకను ఆ కృష్ణ వర్ణ మురళీవదన పీతాంబరధారి యగు నవీన మదనునే నీవు స్వప్నమున దర్శించితివి. కావున నీవు ఉద్విగ్నురాలవు కావలదు. ధైర్యము నవలంబింపుము. త్వరలో నీవు ఆతనిని కలసికొనగలవు" అనిపలికి ఆ సమయములో అచ్చట కేతెంచిన సుబలునితో " నీవు శ్రీకృష్ణుని బర్సానాకు ఉత్తరముగా నున్న పరమ సుందరమగు నిర్జన కాననమునకు తోడ్కొనిరమ్ము, నేను గూడ రాధికను అచ్చటకు తోడ్కొని వత్తు"నని చెప్పెను. ఈ విధముగ శ్రీరాధా కృష్ణుల మిలనమైన స్థలమే సంకేతము.

**ఛత్ర వనము :-**

ఇది ఒక ఉపవనము. దీనిని ఛాతాయి అని కూడ అందురు. ఈ గ్రామమునకు ఈశాన్యమున సూర్య కుండము, నైఋతి వైపు చంద్ర కుండము ఉన్నవి. ఇచ్చట దావుజీ మందిరము గూడ యున్నది. గ్రామమునకు ఉత్తరముగ శ్రీనారాయణదేవుని మందిరమున్నది. ఇచ్చట శ్రీదాముడు మున్నగు గోపాలురు శ్రీకృష్ణుని రత్న సింహాసనమున గూర్చుండ బెట్టి 'రాజ శాశనము చేయుట 'యనెడి లీలను అభినయించిరి. అప్పుడు బలరాముడు కృష్ణుని ఎడమవైపు కూర్చొని మంత్రిగ నుండెను. శ్రీదాముడు కృష్ణుని శిరముపై విచిత్రమగు ఛత్రము పట్టెను. అర్జునుడు చామరమును వీచగా,

మధుమంగళుడు సమ్ముఖమున నుండి విదూషకుని కార్యము చేసెను. సుబలుడు సమీపమున నుండి తాంబూలము నందించెను. ఇట్టి విచిత్రమగు లీల చేయుటచే ఈ వనము 'ఛత్రవనమ'ని పేరొందెను.

**ఉమరాబ :-**

ఛత్రవనములో శ్రీకృష్ణుడు వనమునకు రాజు అయి కప్పమును వసూలు చేయుమని మధుమంగళుని ఆదేశించెను. రాధిక యొక్క సఖులు పౌర్ణమాసి దేవి కలసి శ్రీరాధికను శ్రీబృందావనేశ్వరిగ సింహాసనమున అధిష్ఠింపజేసి అభిషక్తురాలుగ చేసిరి. మధుమంగళుడు అచటకేగి, కప్పము గూర్చి తెలియజేసెను. గోపికలు అతనిని బంధించి బృందావనమునకు అధీశ్వరి శ్రీమతి రాధిక యని చాటించిరి. శ్రీరాధిక తన సఖులతో కలసి ఛత్రవనమునకు రాజుగ నియమింపబడిన శ్రీకృష్ణుని జయించుటకు బయలుదేరెను. శ్రీరాధాదేవి ఉమరా వేషముతో అనగా బృందావనేశ్వరి వేషముతో ఇచ్చట విహరించిన కారణమున ఈ వనమును 'ఉమరాబ' అందురు. పౌర్ణమాసి దేవి ఇచ్చట రాధాకృష్ణులను సింహాసనము పై అధిష్టింపజేసెను. శ్రీకృష్ణుడు రాధతో "నీవు నా దూత యగు మధుమంగళుని నిష్కారణముగ బంధించితివి. నీవు చేసిన ఈ నేరమునకు ప్రాయశ్చిత్తముగ మధుమంగళుడు భోజన ప్రియుడు గావున అతనికి లడ్డూలు ఇవ్వ "మనెను. శ్రీకృష్ణుని ఆజ్ఞ ప్రకారము శ్రీమతి రాధిక మధుమంగళునికి మోదకము యనెడి లడ్డూనొసంగెను.

**జావట్ :-**

సంకేత్య యత్ర ప్రియయా విలస్య ప్రోల్లస్య రస్యస్య వటస్యమూలే ।
యావైస్తదంఘ్రీ రచయాంచ కార నామ్నాపి తం యావటం చ కార ॥

విదగ్ధవరుడైన శ్రీకృష్ణుడు రమణీయమగు వటవృక్షము క్రింద ప్రియతమయగు శ్రీరాధికతో వివిధ లీలావిలాసము గావించి, పరమోల్లాసముతో ఆమె చరణకమలములను లత్తుకద్వారా చక్కగా అలంకరించుటచే ఆ వటవృక్షము పేరుతో ఈ స్థలము "యావట" మని ప్రసిద్ధికెక్కినది. ఈ స్థలము శ్రీరాధిక యొక్క శ్వసురాలయము (అత్తవారిల్లు). ఇది నంద గ్రామమునకు రెండుమైళ్ళ దూరములోనున్నది. ఇచటకు దగ్గరలోని వత్సఖోర్ అనుచోట శ్రీరాధిక సుబలుని వేషముతో శ్రీకృష్ణుని కలసికొనెను. జావట్ గ్రామమునకు పశ్చిమ భాగమున ఒక ప్రాచీనమగు ఫలవృక్షము కలదు. ఆ వృక్షమును స్వయముగ రాధికనాటినది. ఆ వృక్షము యొక్క పుష్పములతో శ్రీకృష్ణునికై మాల రచించెడిదని చెప్పుదురు. వైశాఖమాసములో ఈ వృక్షము మిక్కిలి సుగంధయుక్తమగు పుష్పములతో నిండియుండును.

--○--

# 9. గోవర్ధనము

యం పాణినా పాలయదీశ ఏవ య పాలయత్తత్ పరివారమేవ।
క్రీడత్యజస్రం స్వయమేవ యత్ర స కేన వర్ణ్యో హరిదాసవర్యః ॥

ఏ గోవర్ధన పర్వతమును శ్రీకృష్ణుడు స్వయముగ ధరించెనో, ఎవరు కృష్ణ పరివారమును సదా పరిపాలించెనో, ఏప్రాంతమున కృష్ణుడు సదా క్రీడించెనో అట్టి హరిదాస శ్రేష్ఠుడైన శ్రీగోవర్ధనుని గూర్చి ఎవరు వర్ణింపగలరు?

గిరిరాజ గోవర్ధనము మయూరాకృతిలోనున్నది. గోవిందకుండము యొక్క దక్షిణభాగము దీని పుచ్ఛము. ప్రసిద్ధమైన మానసగంగ గండస్థలము. కుసుమ సరోవరము ముఖము. రాధాకుండము, శ్యామకుండములు నేత్రద్వయము, పదునాలుగు మైళ్ళపరిమితి గల ఈ గోవర్ధనమునందు శ్రీకృష్ణుడు గోపాలురతో గలసి అనేక లీలలను చేసెను. ఇచట కుసుమ సరోవరము, బైఠాన్, గోవిందకుండము, సురభికుండము, దానఘాట్, మానసగంగ, హరిదేవ్ దేవాలయము, 'ఆనూర్' గ్రామము, జతిపుర (యతి పుర) మున్నగునవి దర్శనీయ స్థలములు.

శ్రీకృష్ణుని లీలాస్థలములలో శ్రీగిరిరాజ గోవర్ధనము విశేష ప్రసిద్ధమైనది. శ్రీ వ్రజమండలమునందు మూడు పర్వతములు విఖ్యాతిగాంచినవి. అవి 1. బర్సానా, 2. నందీశ్వరము, 3. గోవర్ధనము. ఇవి వరుసగా శ్రీబ్రహ్మ, శ్రీరుద్ర, శ్రీవిష్ణువుల అభిన్న స్వరూపములుగ నుండి విశేషముగ పూజింపబడుచున్నవి. వానిలో శ్రీగిరిరాజ గోవర్ధనము సమస్త భక్తుల చిత్తమును ఆకర్షించుచుండును. గోలోకములో శ్రీకృష్ణుడు రాధికతో రాసక్రీడ చేయ సంకల్పించగా ఆతని వక్షఃస్థలము నుండి ఒక దివ్యతేజస్సు ప్రకటమయ్యెను. ఆదివ్య తేజము చూచుచుండగనే ఒక పర్వతాకారపు రూపు ధరించి క్రమముగ లక్షయోజనముల వరకు వ్యాపింపనారంభించెను. కృష్ణుని కరస్పర్శచే ఆ పర్వతము శాంతించెను. ఆపర్వతమే గిరిరాజ గోవర్ధనము. గోవర్ధన పర్వతము భూలోకమునకు వచ్చి భారత వర్షములో పశ్చిమ భాగమున శాల్మలీ ద్వీపమున ద్రోణాచలమునకు పుత్రునిగా జన్మించెను.

ఒకనాడు పులస్త్య బ్రహ్మ తీర్థాటనము చేయుచు మనోహరమైన ఈ పర్వతమును చూచి ఆనందపడి, ఈ పర్వతము కాశీక్షేత్రము నందున్నచో తన తపస్సునకు అనుకూలముగ నుండునని భావించి ద్రోణ పర్వతము వద్దకు వెడలి " ఓ ద్రోణరాజా! నేను శ్రీవిశ్వేశ్వరుడు ఆవిర్భవించిన శ్రీకాశీక్షేత్ర నివాసుడను. అచ్చట మరణించినంతనే ఎంతటి పాపియైననూ మోక్షమునొందును. అచ్చట విష్ణు పాదోద్భవి యగు గంగ ప్రవహించుచున్నది. కాని అచ్చట ఒక్క పర్వతము కూడా లేదు. కనుక నీవు నీ పుత్రుని

నాకు ఈయవలసినదిగ అర్థించుచున్నాను. నేను ఈ పర్వతగుహలో కూర్చొని తపస్సుగావింతును." అంత ద్రోణుడు ప్రియమైన పుత్రుని విడచియుండలేక దుఃఖించి, ఈయన ఋషి, ఈయకున్నచో ఏమి శాపమిడనో యని భయముతో ఇట్లనెను. " ఈ నా పుత్రుడు ప్రాణము కన్నను ప్రియమైన వాడు. ఇతనిని వదలి నేనుండలేను. మరియు మీకు ఈయకుండగను ఉండలేను. నాకు ఏమి చేయవలయునో తోచుటలేదు. మీరు ఆజ్ఞాపించునటుల చేయుదును" అని అనగా పులస్త్యుడు, "నీవు దిగులు చెందకుము. నీవు ఎప్పుడు పుత్రుని చూడదలచిన అప్పుడు కనుపించును. కనుక ఈయుము" అని పలుకగా ద్రోణుడు సమ్మతించి పుత్రుని పిలచి "వత్సా! భారతవర్షము పుణ్యభూమి మరియు కర్మక్షేత్రము. ధర్మార్థకామములతో పాటు మోక్ష ప్రదమైనది. కనుక నీవు ఈ మునిపుంగవునితో పాటు భారతవర్షమునకు వెళ్ళవలసినది." అనగా తండ్రి వాక్కులను వినినవాడై గోవర్ధనము పులస్త్యునితో ఇట్లు పలికెను. " ఓ మునివర్యా ! ఎనిమిది యోజనములు పొడవు, ఐదు యోజనములు వెడల్పు, రెండు యోజనములు ఎత్తు గల విశాలదేహుడనైన నన్ను నీవు ఎట్లు వేరే చోటుకు తీసుకొని పోయెదవు?" అని అడుగగా, " నేను నిన్ను నా అరచేతిలో పెట్టుకొని కాశీవరకు తీసికొనిపోయెదను. నీవు చింతింప పని లేదని" పులస్త్యుడనగా ద్రోణపుత్రుడు "నీవు మోయలేక నన్ను ఎచ్చట దించినను నేను అచ్చట నుండి కదలిరాను. ఇది నాప్రతిజ్ఞ " అనెను.

పులస్త్యుడు కూడ ప్రతిజ్ఞ చేయుచు "శాల్మలీ ద్వీపము నుండి కోశలదేశము వరకు నిన్ను నేను నాచేతి నుండి క్రిందకు దింపను" అనెను. అంత ద్రోణ పుత్రుడు తల్లిదండ్రులకు ప్రదక్షిణ నమస్కారములు చేసి, అశ్రుధారలను విడచుచు ఋషి హస్తములో కూర్చొనెను. ఋషి తపో బలముచే పర్వతమును కాశీక్షేత్రమునకు తీసికొనుపోవుచుండగ, వ్రజమండలమురాగా గోవర్ధనము మనసులో "సాక్షాత్ భగవంతుడగు శ్రీకృష్ణుడు ఈ వ్రజములో అవతరించి బహు బాల్య లీలలను గావించును కదా! యమునానదీ తీరముననున్న పరమపావనమైన ఈవ్రజభూమిలో శ్రీకృష్ణుడు నాపై గోపాలురతో విహరించును. కనుక నేను ఇచటనే యుండి శ్రీకృష్ణుని చరణ స్పర్శను పొందెదను" అని భావించి, తాను ఋషికి భారమవసాగెను. పర్వతమును భారముచే మోయలేక ఋషి పరిశ్రాంతుడై, తాను చేసిన ప్రతిజ్ఞను మరచి, వ్రజములో దించి, వ్యావహారిక శౌచక్రియల నిమిత్తము వెడలి, స్నాన ధ్యాన జపములను ముగించుకొని వచ్చి మరల పర్వతమును తన చేతిలోనికి తీసికొనుటకు తీవ్ర ప్రయత్నముగావించి విఫల మనోరథుడయ్యెను. అంత పులస్త్యుడు ద్రోణపుత్రుని పలు విధములుగ ప్రార్థించగా, ఇందులో నా దోషమేదియును లేదు. నీవు ఎచ్చట దించిన నేను అచ్చటనే ఉండిపోయెదను అని ప్రతిజ్ఞ చేసియుంటిని కదా! అనగా ఋషి కోపముతో "ప్రతిదినము నీవు నువ్వు గింజ పరిమాణమున క్షీణించుదువు గాక! " అని

ద్రోణపుత్రుని శపించి కాశికి వెళ్ళిపోయెను. ఈ విధముగ భగవత్సంకల్పముచే శ్రీకృష్ణుని అభిన్న స్వరూపుడగు గోవర్ధనుడు భూలోకములో ద్రోణ పుత్రునిగ జన్మించి భౌమ బృందావనములో శ్రీకృష్ణ లీలలో సహాయకారియై, భగవంతుని సేవించి "హరిదాస వర్యుడు" అని సార్ధక నామమును పొంది, గోవులకు తృణాదుల నిచ్చుట ద్వారా "గోవర్ధనుడు" అను పేరుతో జగద్విఖ్యాతి గాంచెను.

ఒకనాడు నందుడు మున్నగు గోపాలురు ఇంద్రయజ్ఞమును చేయ ప్రయత్నించుట చూచి, సర్వాంతర్యామి, సర్వసాక్షియగు భగవంతుడు " తండ్రీ! మీ ఈ ప్రయత్నము దేని కొరకు? ఏ దేవతనుద్దేశించి యజ్ఞమును చేయుచున్నార"ని అడుగగ, నందుడు "వత్సా! ఇంద్రుడు పర్జన్యరూపుడు. ఇంద్రుని పూజించుట మన వంశాచారము. ఇంద్రయాగము చేసినచో అతడు తృప్తిచెంది వర్షమును కురిపించును. దాని వలన మన గోవులకు జీవనాధారమగు తృణాదులు లభించును" అని చెప్పగా కృష్ణుడు, ఇంద్రుని గర్వము నణచదలచి, ఇంద్రయాగమును మాన్పించి, ఇంద్రపూజ నిమిత్తము తెచ్చిన ఆ ద్రవ్యములతో గోవర్ధన పూజ, గోపూజ చేయించి తాను కూడ స్వయముగా నాచరించెను. కృష్ణుడు గోవర్ధన రూపమును దాల్చి సమస్త నైవేద్యమును ఆరగించి **"అహంహి సర్వయజ్ఞానాం"** అను గీతా వాక్యమును రూఢి చేసెను. తదనంతరము కృష్ణుని ఆదేశానుసారము వ్రజవాసులు గోవర్ధన ప్రసాదమును సర్వులకు వితరణము చేసి గోవులకు, బ్రాహ్మణులకు, గోవర్ధన పర్వతమునకు ప్రదక్షిణము చేసిరి. ఆనాటి నుండి ఉత్తరదేశములో ప్రతి ఏకాదశి నుండి పూర్ణిమ వరకు వేలాది మంది భక్తులు గోవర్ధన పరిక్రమను చేయుచున్నారు. విశేషముగ ఆషాఢ కార్తీక పూర్ణిమలలో పరిక్రమచేయు భక్తులు లక్షల సంఖ్యలో నుందురు.

కృష్ణుడు తన పూజను మాన్పించి గోవర్ధనగిరి పూజను చేయించి నందున ఇంద్రుడు కోపగించి భీషణమగు కుంభవృష్టిని కురుపించెను. అప్పుడు వ్రజవాసులు కృష్ణుని ఆశ్రయించగా కృష్ణుడు తన ఎడమచేతిపై గోవర్ధన పర్వతమునెత్తి ఏడురోజుల పాటు వ్రజవాసులను ఆపద నుండి రక్షించెను.

అనంతరము గోవర్ధనధారియగు శ్రీకృష్ణుడు మేఘములు వర్షించుట ఆగిపోగా వ్రజవాసులందరను పర్వత గుహనుండి బయల్వెడలి తమ తమ గృహములకు వెడలమని ఆజ్ఞాపించెను. తరువాత శ్రీకృష్ణుడు వ్రజవాసులందరు చూచుచుండగనే గోవర్ధనపర్వతమును స్వస్థానమున నిలపెను. అపుడు స్వర్గవాసులగు దేవతలు శంఖములను, దుందుభులను మ్రోగించి ఆయనను స్తుతించుచు పుష్ప వృష్టిని కురిపించిరి.

ఇంద్రు డవమానముచే లజ్జితుడై ఏకాంతముగ శ్రీకృష్ణుని కడ కేతెంచి, తన తప్పిదమును క్షమింపుమని ఆయనను ప్రార్థించి, తన కిరీటము ద్వారా అతని

పాదములను స్పృశించెను. మరియు దోసిలొగ్గి "ప్రభూ! నేనే ముల్లోకములకు అధిపతినని గర్వించితిని. నేడు నీవు నాయందలి దయతో నాయజ్ఞానమును పోగొట్టితివి. ఇప్పుడు నీవే జగత్తునకు ఈశ్వరుడవని నేను గ్రహించితిని. సేవకుడనైన నా ఈ యపరాధమును క్షమింపుము. నీకు నమస్కారము " యని ప్రార్థించెను. అనంతరము సురభి (కామధేనువు) క్షీరముతోను, ఐరావతము ద్వారా తేబడిన గంగతోను ఆయనను అభిషేకించి "గోవింద" యని నామకరణము చేసెను.

**గోవింద కుండము :-**

యత్రాభిషక్తో భగవాన్ మ ఘోనా యదు వైరిణా ।
గోవిన్దకుణ్డం తజ్జాతం స్నాన మాత్రేణ మోక్షదమ్ ॥

భగవానుడగు శ్రీకృష్ణుని ఇంద్రుడు అభిషేకము చేసిన చోట అభిషేక జలముచే నొక కుండము ఏర్పడినది. అదియే గోవింద కుండము. ఇందులో స్నానమాచరించినంతనే ముక్తి లభించును. అన్నకూటమునకు (ఆనోర్ గ్రామమునకు) దగ్గర ఇంద్రుడు నిర్మించిన గోవిందకుండమునందు స్నాన తర్పణాదులొనరించిన శతయజ్ఞము లాచరించిన ఫలితమ లభించును.

గోవిందకుండమునకు తూర్పువైపున గోవిందమందిరము, దక్షిణమున శ్రీనాథ్‌జీ మందిరము కలవు. శ్రీలమాధవేంద్ర పురీపాదులకు కృష్ణుడు దుగ్ధమును ప్రసాదించిన స్థలమిదియే. ఈ కుండ తీరమునందు పెక్కుమంది భజనానంది సాధుపుంగవులు భజనానందముతో తమ జీవితమును గడుపుచుందురు.

**పూఛరీ :-**

శ్రీగోవిందకుండమునకు ఒకటిన్నర మైళ్ళ దూరములో ఈ పూఛరీ గ్రామమున్నది. మయూరాకృతిలో నున్న గిరిరాజు యొక్క పుచ్ఛదేశమునం దీగ్రామముండుట వలన పుఛరీయను పేరు వచ్చినది. ఇచట పుచ్ఛ యను కుండమున్నది. దీనిని ప్రస్తుతము నవలకుండమని పిలచుచున్నారు. దీనికి ఈశాన్యమున గల మట్టిదిబ్బపై శ్రీనృసింహదేవుని ప్రాచీన మందిరమున్నది. ఉత్తరమున రాఘవపండితుని భజన స్థానమైన గుహ కలదు. ఈ గుహకు ఎదురుగ కొండమీద కృష్ణుని కిరీటము యొక్క గుర్తులు గలవు.

నవల కుండమునకు పశ్చిమ దిక్కున "పూఛరీలోటా" అను స్థలము గలదు. "లోటా" శ్రీకృష్ణుని చెలికాండ్రలో ఒకడు. కృష్ణుడు గోచారణ లీలకు వెడలినపుడు ఎట్టి ఆపద రాకుండ రక్షించవలసినదిగ యశోద లోటాను కోరెను. యశోద ఆజ్ఞాను సారము పూంఛలోటా అన్నాహారములు త్యజించి కృష్ణుని రక్షించుటయే వ్రతముగ

గలిగి, ఆయన గోవులను తోలుకొని ఘోష్ఠము చేరు వరకు ఏమియు తీసికొనెడి వాడు కాడు. "లోటా ఉదయము నుండి సాయంత్రము వరకు ఏమియు భుజించకుండగ ఎట్లు ఉండగలుగుచున్నాడు? ఏమియు తినక పోయినప్పటికినిబలిష్ఠముగ యున్నాడే!" అని తోటి గోపాలురు అనుకొనెడి వారు. యశోద తన ఆజ్ఞాను సారము కృష్ణుని జాగ్రత్తగ ఇంటికి తీసుకువచ్చినాడని వాత్సల్యముచే ఉప్పొంగిన చనుబాలతో తడసిన మోదక లడ్డును 'లోటా' కు ఇచ్చెడిది. దానిని భుజించిన కారణముననే అతడు పుష్టిగనుండెడివాడు. కృష్ణుడు ద్వారకానగరమునకు వెళ్ళినపుడు లోటాను కూడా తనతో రమ్మని అడుగగా, "నేను వ్రజమును వదలి రాను. మరల నీవు ద్వారక నుండి తిరిగి వ్రజమునకు వచ్చునంత వరకు అన్న పానీయములను ముట్టను" అనెను. ఆనాటినుండి లోటా ఈ పూఛరీ గ్రామములో అన్నాదులను పరిత్యజించి శ్రీకృష్ణుని రాకకై ఎదురుచూచుచుండెను.

**శ్రీయతిపురా :-**

గోవిందకుండమందు శ్రీకృష్ణుడు గోపాలరూపముతో శ్రీమాధవేంద్రపురీపాదులకు క్షీరభాండము నొసంగెను. మరియు స్వప్నమునందు దర్శనమిచ్చి తాను అచటకు దగ్గరలోనే శ్రీమూర్తి రూపమున యున్నాడనని, వెలికితీసి సేవా కైంకర్యమును చేయుమని, ఆదేశింపగా మాధవేంద్రపురీపాదులు భగవానునకు షడ్రసోపేతమైన అన్నకూట మహోత్సవమును చేసి ఆయనకు ఆనందమును చేకూర్చెను. ఈ స్థలమే శ్రీల మాధవేంద్ర యతి నామానుసారముగ 'యతి పుర' అని ప్రసిద్ధిగాంచినది. దీనినే గోపాలపురమని కూడ వ్యవహరింతురు. కార్తీక శుద్ధ పాడ్యమినాడు ఈనాటికిని అత్యంత వైభవముగ అన్నకూట మహోత్సవమును జరుపుచున్నారు. గోవర్ధనగిరికి ఇచట ప్రతినిత్యము పెద్ద ఎత్తున పాలతో అభిషేకము చేయుదురు. ఆ అభిషేకము చేసిన పాలు ఒక నది వలె ప్రవహించుచుండును. ఈ గ్రామమునందు భజన పరాయణులగు సాధువులు కుటీరములనేర్పరచుకొని అనన్యభావముతో శ్రీరాధాకృష్ణులను భజించుచుందురు. **"అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే"** అని గీతలో చెప్పిన విధముగా కృష్ణభగవానుడే వీరందరియోగ క్షేమములను చూచుచుండును.

**ముఖారవిందము :-**

శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతమును ఎత్తిన చోటునే ముఖారవిందమనెదరు. గోవర్ధన పర్వతమిచట రెండు భాగములుగ నుండి ఒక వైపు పూర్తిగ కనబడుచు రెండవ వైపు క్షీణించినట్లు కనబడుచుండును. ఈ నడుమ భాగమే ముఖారవిందము. ఇది

గోవర్ధన గ్రామమునందు కలదు. గోవర్ధనము క్షీణించుచున్నట్లు కనబడు భాగమున మానసగంగ, కుసుమ సరోవరము, రాధాకుండము, శ్యామ కుండము, సూర్యకుండము, నారద కుండము, ఉద్ధవ కుండము, మాల్యాహారి లేదా మాలిహారి కుండము గలవు.

**మానస గంగ :-**

ఒకనాడు శ్రీనందమహరాజు తన పరివారముతో గూడి గంగానదీ స్నానము చేయ సంకల్పించి యాత్రకు బయలుదేరెను. అప్పుడు శ్రీకృష్ణుడు " నేను ప్రత్యక్షముగ నున్న ఈ వ్రజమందు సకల నదీ తీర్థములు ఉన్నవి. కాని ఆ విషయము వ్రజవాసులకు తెలియదు" అని తలంచి వారికి శ్రమలేకుండుటకు గంగను స్మరణ మాత్రముననే అచ్చటకు రప్పించెను. కృష్ణునని ఆదేశానుసారము గంగ మకరవాహినియై అందరి యెదుట ప్రత్యక్షమయ్యెను. వ్రజవాసులు అది చూచి పరమానందముతో కృష్ణుని కొనియాడి ఆ గంగలో స్నానమాచరించిరి. కృష్ణుని మనః సంకల్పము చేత ఆవిర్భవించిన కారణమున దీనికి 'మానస గంగ' యని పేరు వచ్చినది. దీపావళినాడు ఈ తీర్థము ఆవిర్భవించినది, అందువలన ప్రతి దీపావళినాడు భక్తులు మానస గంగ యందు స్నానము, గోవర్ధన పరిక్రమ అత్యంతానందోత్సాహములతో చేయుదురు. మానసగంగ వద్ద దీపములను వెలిగింతురు. ఈ మానసగంగలో తరచు శ్రీరాధాగోవిందుల నౌకా విహారము జరుగుచుండును. ఇచ్చట క్షేత్రపాల రూపముతో శివుడు "చాక్లేశ్వరుడు" గ వెలసియున్నాడు. మరియు శ్రీల సనాతన గోస్వామి భజనకుటీరము గూడ యున్నది.

**కుసుమ సరోవరము :-**

ఈ సరోవరము రాధాకుండమునకు దగ్గరలో కలదు. ఇచ్చట రాధిక సరోవరమునందలి వివిధ పుష్పములతో మాలలను గ్రుచ్చి శ్రీకృష్ణుని అలంకరించెడిది. అటులనే కృష్ణుడు కూడ మాలలతో రాధికను అలంకరించెడివాడు. అందువలన దీనికి కుసుమ సరోవరమని పేరు వచ్చినది.

**పేటో (బైఠాన్ ) :-**

శ్రీకృష్ణ భగవానుడు శరద్రాత్రులు వచ్చుటను గమనించి తన యొగ మాయా శక్తి ద్వారా గోపికలతో విహరింపదలచి రాసక్రీడకు ఉపక్రమించెను. ప్రాప్త మనోరథ లైన గోపికలు సాక్షాత్ కృష్ణ భగవానుడు తమతో విహరించుచున్నాడని, భూలోకము నందలి స్త్రీలలోకెల్ల తాము గొప్పవారమని కొద్దిపాటి గర్వితులు కాగా వారి ఆయభిమానమునుపోగొట్టి వారి ననుగ్రహించుటకై అంతర్హితుడయ్యెను. ఇట్లు కృష్ణుడంతర్హితుడు కాగా గోపికలు ఆతని దర్శనము లేక సంతాపగ్రస్తలై ఆతడు చేసిన

లీలలను అనుకరింపసాగిరి. అందరూ కలసి బిగ్గరగ కృష్ణనామమును గానము చేయుచు వనమునుండి వనమునకు తిరుగుచు వెదుకసాగిరి. కొంతసేపటికి వారు కృష్ణుని అడుగుజాడలను బట్టి ఆతడు ఒకానొక గోపికతో ఆ మార్గమున వెడలినట్లు తెలిసికొనెను. ఆ గోపిక ఎవరో కాదు శ్రీమతి రాధికయే. అపుడు గోపికలు రాధతో కలసి కృష్ణుని కొరకు వెదుక సాగెను. హఠాత్తుగ అదృశ్యుడైన శ్రీకృష్ణుడు చతుర్భుజధారియై గోపికలను పరీక్షించు నిమిత్తము ఒక చోట కూర్చుండెను. మహాభావ స్వరూపిణియగు శ్రీమతి రాధిక తనను అన్వేషింప వచ్చుటను జూచి కృష్ణుడు చతుర్భుజ రూపమున యుండుటకు ఎంత ప్రయత్నించినను అట్లుండ లేక ద్విభుజ ధారియయ్యెను. ఇచట చతుర్భుజ రూపధారియైన కృష్ణుడు కూర్చొనిన కారణమున దీనికి 'బైఠాన్ 'అని పేరు వచ్చినది. దీనినే ' పేటో ' అని కూడ వ్యవహరింతురు.

శ్రీకృష్ణుడు ఇంద్రుడు జరపిన ఉపద్రవము నుండి వ్రజవాసులను రక్షించుటకు ఇచ్చటనే తన సఖులతో గూడి ఆలోచించి "నేను గోవర్ధనమును ఎత్తి వ్రజవాసులను రక్షింతు"ననెను. సఖులు కృష్ణుని సుకోమలములగు హస్తములతో పెద్ద పర్వతమును ఎత్తుట అసంభవమని తలంచి తమ సమ్ముఖమున గల కదంబ వృక్షమును జూపి కృష్ణునితో - "కృష్ణా! నీవు ఈ వృక్షమును వంచి మెలిత్రిప్పినచో నీమాటయందు విశ్వాసము కలిగి గోవర్ధన గిరి నెత్తుటకు అనుమతించెద" మనెను. అంత కృష్ణుడు ఉల్లాసముతో ఆ కదంబ వృక్షమును వంచి తడి వస్త్రమును పిండులాగున త్రిప్పెను. సఖులందరూ సంతుష్టులై శ్రీకృష్ణునకు మల్ల వేషమును ధరింప చేసి, నడుమకు వస్త్రమును బిగించిరి. కృష్ణుడు వంచిన కదంబ వృక్షమును "ఏఠాకదంబ"మందురు. అప్పటి నుండి ఈ స్థానము 'పేటో' యను పేరుతో ప్రసిద్ధిగాంచినది. ఈ గ్రామములో "నారాయణ సరోవరము" "చతుర్భుజ నారాయణ మందిరము", "ఏఠా కదంబము' 'దర్శనీయములు.

**శ్రీరాధాకుండము :-**

కంసుని ద్వారా ప్రేరేపింపబడిన అరిష్టుడను రాక్షసుడు ఒకానొక రోజు విశాలమైన శరీరము గల వృషభ రూపమును దాల్చి వ్రజమునందు ప్రవేశించెను. అతడు భయంకరముగ అంకెలు వేయుచు, తన కొమ్ములచే మట్టిని పై కెగ జిమ్ముచు భయోత్పాతములను సృష్టించెను. అతని చేష్టలను జూచి గోప గోపికలు కృష్ణుని శరణు పొందిరి. అప్పుడు కృష్ణుడు వారి కభయము నొసంగి తన బాహువుళలను అప్పళించుచు, కరతాళధ్వని చేయుచు ఆయసురనకు కోపము కలిగించి వాని రెండు కొమ్ములను పట్టుకొని, క్రిందపడవైచి, తడివస్త్రమును పిండులాగున పిండెను. దానితో అరిష్టాసురుడు రక్తమును గ్రక్కుచు, కాలుసేతులు గిల గిల కొట్టు కొనుచు ప్రాణములను విడచెను. అర్రిష్టాసురుని సంహరించిన కారణమున దీనిని అరిష్టాగ్రామము లేక ఆరిట్ అని అందురు.

ఆనాటి రాత్రి కృష్ణుడు రాధిక, లలిత, విశాఖ మున్నగు గోపికలతో విహరింప నుద్యుక్తుడు కాగా వారు కృష్ణునితో "కృష్ణా! నీవు వృషభ రూపములో నున్న అసురుని చంపిన కారణమున గోహత్య పాపము అంటుకొనినది. కావున మేమెవ్వరము నిన్ను స్పృశింపము. నీవు త్రిభువనములోని సమస్త తీర్థములయందు స్నానము చేసిన యెడల పవిత్రుడవగుదువు" అనెను. వెంటనే కృష్ణుడు "నేను వ్రజభూమిని విడచి ఎచటకునూ వెడలను గదా! త్రిభువనములోని సకల తీర్థములను ఇచటకే ఆహ్వానించి, మీ సమక్షముననే వాటియందు స్నానము చేసెద"నని చెప్పి తన కాలి మడుమతో గట్టిగ నేలను త్రొక్కెను. వెంటనే పాతాళమునుండి భోగవతియగు గంగ, సకల తీర్థములు అచటకు వచ్చెను. అప్పుడు కృష్ణుడు వారినుద్దేశించి మీరందరూ ఇచటనే కుండరూపములో యుండుడని ఆదేశింపగ వారు కుండమునందు ప్రవేశించిరి. అప్పుడు రాధిక మున్నగు గోపికలతో "చూడుడు, సకల తీర్థములు ఇచ్చటకు వచ్చి ప్రవేశించినవి". అనగా గోపికలు " మేము నీ మాటను విశ్వసింపము" అనినంతనే సమస్త తీర్థములు తమ తమ రూపములతో ప్రత్యక్షమై దోసిలొగ్గి 'నేను క్షీర సముద్రమును, నేను లవణ సముద్రమును' అని తమ నామోచ్చారణము ద్వారా పరిచయము చేసికొనెను. అనంతరము కృష్ణుడు ఆకుండమందు స్నానమాచరించి దర్పముతో "నేను సర్వతీర్థమయమగు ఈ కుండమును ప్రకాశింపచేసితిని. మీరు పృథివిపై జన్మించి ఎట్టి ధర్మాచరణమును చేయలేదు. కావున ఇప్పుడీ కుండమునందు స్నానమాచరించి పునీతులు కండు " అనెను. అప్పుడు రాధిక "అట్లైన మేము కూడ నొక కుండమును నిర్మించెద"మని తన కంకణముతో సుందరమగు నొక కుండమును నిర్మించెను. కాని అందులో నీరు లేదు. అది చూచి కృష్ణుడు "రాధే ! నీవు నిర్మించిన కుండము అతి రమ్యముగనున్నది. కాని అందు జలము లేదు గావున నీ సఖుల సహాయముతో నాకుండమునందలి జలముతో దానిని నింపు"మనెను. రాధిక " నీవు గోవధ చేసి స్నానమాచరించుటచే నీ కుండమందలి నీరు పాతకయుక్తమైనది. కావున మేము పవిత్రమగు మానస గంగాజలముతో మా కుండము నింపెద"మనెను. కృష్ణుడు రాధాదేవి యొక్క మనోభావము నెరిగి చిరునవ్వుతో కుండమందలి తీర్థములకు కనుసైగ చేయగా సమస్త తీర్థములు వృషభానునందిని పాదములపై వ్రాలి చేతులు జోడించి "ఓ దేవీ ! నీ మాహాత్మ్యమును బ్రహ్మాది దేవతలు గూడ నెరుగరు. నీవు మాపై కృపా దృష్టిని వర్షింపుము. మమ్ములను అనుగ్రహించినచో నీకుండములో ప్రవేశించి ధన్యులమగుదుము" అని ప్రార్థింపగ రాధిక అట్లేయనెను. అపుడు సకల తీర్థములు అత్యుత్సాహముతో అందు ప్రవేశించినవి. పిమ్మట కృష్ణుడు రాధతో "హేరాధే ! నాకుండము కంటె నీకుండమే జగద్విఖ్యాతి నొందును. నేను కూడ అనుదినము నీ

కుండమందు విహరించెదను" అనెను. కృష్ణుడు చేసిన కుండమును శ్యామకుండ మనియు, శ్రీమతి రాధిక నిర్మించిన కుండమును రాధాకుండమనియు అందురు. ఈ రెండుకుండములు కార్తీక బహుళ అష్టమి నడిరాత్రియందు ఆవిర్భవించినవి. శ్రీకృష్ణ దర్శనము వలన కలిగిన ఆనందములో శ్రీరాధా దేవి ద్రవీభవించి శ్రీరాధాకుండముగను, శ్రీరాధిక దర్శనము వలన కలిగిన ఆనందములో శ్రీకృష్ణుడు ద్రవీభవించి శ్రీశ్యామ కుండముగను ఆవిర్భవించిరి. ఈరెండు కుండములు రాధాకృష్ణుల అభిన్న రూపములై యున్నవి. శ్రీరాధాకృష్ణులు రసమయ ప్రేమ స్వరూపులు. అప్రాకృత ఆనందరసమే, అద్వయ జ్ఞాన తత్త్వమే మూర్తి వహించి శ్రీరాధాకృష్ణులను రెండు వేరువేరు రూపములతో ప్రకాశించు చున్నారు. మరల ఆ రెండు రూపములే ద్రవీభూతములై శ్యామకుండ రాధాకుండములుగ ప్రకాశించు చున్నవి. ప్రేమ ఒకటే, వారి ఆత్మయు ఒకటే కేవలము లీలార్థము వారు రెండు రూపములుగ యున్నారు. అట్లే వేరువేరుగ రెండు కుండములు కనపడుచున్నను నీరు ఒక్కటే. స్వకీయ మాధుర్యము పరాకాష్టమై అనుభవించుట కొరకు శ్రీరాధకృష్ణులు సరసీద్వయముగ పరిణతి చెందిరి. ఇవి రాధాకృష్ణుల ప్రేమకుండములు. ఇందులో స్నానమాచరించిన మధుర ప్రేమ కలుగును. ఈ కుండముల నలువైపుల పెక్కు శ్రీగౌడీయ సంప్రదాయ ఆచార్యుల మందిరములు, శ్రీరాధాకృష్ణుల శ్రీమూర్తులు, బహు కుండములు, గౌడీయ వైష్ణవుల భజన కుటీరములు, రాధాగోవిందుల లీలాస్థలములు విరాజిల్లుచున్నవి.

శ్రీరాధాకుండ మాహాత్మ్యమును గూర్చి పద్మపురాణమునందు ఈ విధముగ యున్నది -

గోవర్ధన గిరౌ రమ్యే రాధాకుండం ప్రియం హరేః ।
కార్తికే బహుళాష్టమ్యాం తత్ర స్నాత్వా హరే : ప్రియః ॥
నరో భక్తో భవేద్విప్ర తత్ స్థితస్య ప్రతోషణమ్ ।
యథా రాధా ప్రియా విష్ణోస్తస్యాః కుండం ప్రియం తథా ।
సర్వ గోపీషు సేవైకా విష్ణోరత్యన్త వల్లభా ।
తత్ కుండే కార్తికే ఽ ష్టమ్యాం స్నాత్వా పూజ్యో జనార్దన : ।
ప్రబోధన్యాం యథా ప్రీతిస్తథా ప్రీతస్తతో భవేత్ ॥

శ్రీహరికి ప్రియమైన శ్రీరాధకుండము రమణీయమగు గోవర్ధన పర్వత మధ్యమున విరాజిల్లుచున్నది. కార్తీకమాసములో బహుళ అష్టమి తిథినాడు రాధాకుండములో స్నానము చేసినవారు శ్రీరాధాకుండ విహారియగు శ్రీహరికి అత్యంత ప్రియభక్తులగుదురు.

కారణమేమనగా, ఆవిధముగ స్నానము చేసిన వారి పట్ల శ్రీహరి అత్యంత సంతుష్టుడగును. ఏవిధముగ శ్రీరాధిక శ్రీకృష్ణునకు ప్రియురాలో అట్లే శ్రీరాధాకుండము గూడ ఆయన కత్యంత ప్రియమైనది. సకల గోపికలలో ఒక్క రాధికయే శ్రీకృష్ణున కత్యంత ప్రియురాలు. ఉత్థాన ఏకాదశియందు స్నానమాచరించి జనార్దనుని పూజించిన ఏ ఫలితము కలుగునో అట్టి ఫలితము కార్తీక మాసమందు శ్రీరాధాకుండములో స్నానమాచరించి జనార్దనుని పూజించిన కలుగును.

శ్రీరాధాకుండ గోవర్ధన తీరములందు శ్రీకృష్ణుడు గోవగోపికలతో మధ్యాహ్నసమయములో అనేక లీలలు చేయుచుండును. అవి దోలఖేలా (ఉయ్యాలోత్సవము), వంశీహృతి (కృష్ణుని వంశీని అపహరించుట యను లీల), మధుపాన లీల, సూర్యపూజ లీల, జలఖేల మున్నగునవి. శ్రీకృష్ణుని యొక్క అష్టకాలీయ లీలలలో మధ్యాహ్నిక లీల ఉత్తమమైనది. రాధాకుండ తీరమందు నిష్కపటముగ పవిత్రభావముతో గోపికల ఆనుగత్యములో రాధాకృష్ణులను సేవించి అసంఖ్యాకములగు సాధువులు వైష్ణవులు కృతార్థులగుచున్నారు.

వ్రజేంద్ర నందనుడైన శ్రీకృష్ణుడు కలియుగ పావనావతారియగు శ్రీచైతన్య మహాప్రభువుగ భూలోకమున అవతరించి, తన బృందావన పర్యటనలో అరిష్టమను (ఆరిట్) గ్రామమునకు వచ్చినప్పుడు అచ్చటి జనులను 'రాధాకుండ శ్యామకుండము లెచ్చటయున్నవి?' యని అడిగెను. దానికి వారు సమాధాన మీయజాలక పోయిరి. సర్వజ్ఞుడగు ప్రభువు ఆ రెండు తీర్థములు లుప్తప్రాయమై ధాన్య క్షేత్రము లైనట్లు తెలిసికొని అచటనున్న స్వల్పజలములో స్నానమాచరించి మహదానందముతో ఆ కుండద్వయమును స్తుతించెను. మరియు ఆకుండములోని మట్టిని తిలకముగ ధరించెను. ఈ విధముగ రాధాకుండ శ్యామకుండములు శ్రీమన్మహా ప్రభువు ద్వారా పునరుద్ధరింపబడినవి. మహాప్రభువు యొక్క ఆదేశానుసారము శ్రీరఘునాథ దాస గోస్వామి రాధాకుండ తీరమునందు సుమారు నలుబదియైదు సంవత్సరములుండి భజనచేసి అనేక లీలలను దర్శించెను.

రాధా కుండము వద్దనున్న సరోవరములలో లలితాకుండము. విశాఖ కుండము, నారదకుండము సర్వోత్కృష్టమైనవి. నారద కుండములో నారదుడు స్వయముగ స్నానమాచరించి రాధాకృష్ణుల దివ్య దర్శనము చేసెను. సూర్యకుండ తీరమునందు శ్రీ సూర్యనారాయణుని మందిరమున్నది. శ్రీమతి రాధిక ప్రతిరోజు ఇచ్చటకు ఏతెంచి సూర్యుని పూజించెడిది. శ్రీకృష్ణుడు కపట బ్రాహ్మణ వేషమును ధరించి స్వయముగ రాధికచే పూజ చేయించెడివాడు.

**సఖీస్థలి :-**

దీనినే 'సఖీథరా' అనికూడ అందురు. ఇది మానసగంగకు ఉత్తరమున కొలది దూరమున యున్నది. ఇది చంద్రావళియొక్క గ్రామము. శ్రీపాద రఘునాథ దాస గోస్వామి పాదుల వారు విరహకాతరులై అన్నాదులను పరిత్యజించి ఒకదొన్నెడు మజ్జిగ మాత్రము తీసికొని దివారాత్రములను హరినామ జపముతో గడిపెడి వారు. వ్రజుడు అనునొక బ్రాహ్మణుడు ప్రతిదినము ఆయనకు మజ్జిగ నిచ్చెడివాడు. ఒకనాడు గోవులను మేపుచు గోవర్ధనమునకు దగ్గరలో నున్న ఈ సఖీస్థలికి వెడలి అచటనున్న పెద్ద పలాశపత్రమును తెచ్చి దానితో దాసగోస్వామికి మజ్జిగనిచ్చెను. శ్రీదాసగోస్వామి 'ఈదొన్నె ఎచ్చటి' దని ప్రశ్నింపగ 'సఖిస్థలి' లోనిదని ఆతడు సమాధాన మిచ్చెను. అప్పుడు దాసగోస్వామి వెంటనే దానిని దూరముగ విసరివైచి మిక్కిలి క్రోధముతో "ఆచంద్రావళీ గ్రామమున కెన్నడును వెడలకుము" అనెను. కారణమేమనిన శ్రీకృష్ణుని రాధికయొక్క ఆనుగత్యముననే సేవించవలయును. లలిత విశాఖాది సఖులందరు శ్రీమతి రాధిక ఆనుగత్యములోనే సేవింతురు. ఇదియేఉత్తమమైన సాధన. కాని చంద్రావళి మున్నగు సఖులు తాము స్వతంత్రముగ శ్రీకృష్ణుని సేవింప నభిలషింతురు. అందువలననే రఘునాథ దాసగోస్వామి ఆదొన్నెను విసరివైచెను.

**మాల్యహార్ లేదా మాలీహారీ కుండము :-**

ఒకానొక సమయమున శ్రీరాధాకుండ శ్యామకుండములకు పశ్చిమ భాగముననున్న మాలీహారీ కుండ తీరమునందు గల మాధవీ కుంజములో సఖులతో గూడి శ్రీరాధ ప్రాణనాథుడైన శ్రీకృష్ణుని నిమిత్తము ముత్యాలహారమును రచించుచుండెను. ఈ సందర్భమున శ్రీరాధాగోవిందుల అపూర్వమైన ఒక లీల ప్రకటమైనది. కార్తీక మాసములో దీపావళి రోజున దీపమాలా మహోత్సవము జరుగుచుండెను. ఆ సందర్భముగ వ్రజవాసులందరూ తమ తమ గో వృషభాదులను వివిధ భూషణాదులతో అలంకరించుకొనుచుండెను. అట్టి సమయములో రాధాదేవి కూడ ఈ తీరమునందలి ఉద్యానవనములో కృష్ణుని కొరకు ముత్యాలహారము తయారుచేయు చుండెను. శుక పక్షిద్వారా ఈ వార్తను వినిన శ్రీకృష్ణుడు అత్యంత కౌతుకముతో రాధిక వద్దకు వెడలి తనకు అత్యంత ప్రియమైన హంసి, హరిణీ యను ధేనువులను అలంకరించుటకై కొన్ని ముత్యముల నిమ్మని యడుగగా సఖులు గాని రాధిక గాని శ్రీకృష్ణునకు ముత్యములనీయక "మా ముత్యములు చాల విలువైనవి. నీ ఆవుల అలంకార నిమిత్తము ఇచ్చుటకు మావద్ద ముత్యములు లేవు" అని చెప్పెను. కృష్ణుడు అనేక విధములుగ అనునయ వినయ పూర్వకముగ ప్రాధేయపడెను. కాని వారు కొంచెము

కూడ ముత్యములను ఈయలేదు. అప్పుడు కృష్ణుడు తన తల్లియగు యశోదకడకేగి "అమ్మా! నాకు కొన్ని ముత్యముల నిమ్ము. వాటితో నేను ముత్యముల పంట పండింతు"ననెను. యశోద పక పక నవ్వి "ముత్యములెచ్చటనైనా పంటపండునా? ఇది ఆశ్చర్యముగనున్నదె" యనెను. కృష్ణుడు "అమ్మా! నీవు ఏమియు ఆశ్చర్యము పడనవసరము లేదు. ముత్యాల పంటను నీవు స్వయముగ చూచెదవు గాక! కావున నాకు ముత్యములనిమ్ము." అనగా యశోద ఇంటిలోని ముత్యములను తెచ్చి కృష్ణునకిచ్చెను. కృష్ణుడా ముత్యములను ఉత్తరీయమున కట్టుకొని సహచరులతో కూడి యమున యొక్క జలాహరణ ఘాట్ వద్ద నాలుగువందల గజముల భూమిని సాగుచేసి ముత్యములను నాటెను. ప్రతి దినము వాటికి కలశములతో పాలుపోసెను. అనతి కాలములోనే వాటికి అంకురములు వచ్చి పెద్ద పెద్ద లతలై పుష్కలముగ ముత్యములు పండెను. ఈవిషయము తెలిసిన రాధిక, సఖులు తాము కూడ ముత్యముల పంట పండించవలెనని తలంచి తమ తమ ఇండ్లలోని ముత్యములనే గాక ఆభరణములను కూడ భూమిలో నాటి కలశములతో పాలు పోయగా వాటినుండి ముత్యముల మొక్కలు రాలేదు సరిగదా ముండ్ల మొక్కలే వచ్చినవి. కృష్ణుడు తాను తలచిన విధముగా ఆవులనన్నిటిని తాను పండించిన ముత్యములతో చక్కగా అలంకరించెను. ఇంకనూ ముత్యములు మిగిలిపోయినవి. అప్పుడు రాధికాది గోపికలు వారి ముత్యములు నేలపాలగుటచే లజ్జితులై ఇంటిలోని పెద్దలకు మోము చూపజాలక కృష్ణుని వద్ద వెలయిచ్చి ముత్యములను కొనదలచి కృష్ణుని కడకేగిరి. అపుడు కృష్ణుడు " నా ముత్యములు వెల ఇచ్చి కొనెడివి గావు. మీలో ఎవరికి కావలయునో వారే వచ్చి తీసికొనుడ"నెను. దీనినే 'ముక్తలతా జన్మకథ 'యందురు. తనను తప్ప అన్యమెరుగని రాధికను కృష్ణుడు గూడ స్వయముగ హారములతో అలంకరించెను. అందువలన ఈ కుండమునకు మాలీహారీ కుండమని పేరు వచ్చినది.

**నారద కుండము :-**

ఇది కుసుమ సరోవరమునకు ఆగ్నేయమున నున్నది. శ్రీబృందాదేవి ఉపదేశానుసారము నారదుడిచ్చట తపస్సుచేసి రాధాగోవిందులను సపరివారముగ దర్శించెను. ఒకనాడు నారదుడు రాధాగోవిందుల అష్టకాలీయ లీలలను స్మరించుచు మానస సేవ చేయవలయునను తలంపుతో శివుని వద్దకు వెడలగ, శివుడు బృందాదేవి కడకు వెడలుమని చెప్పెను. నారదుడు బృందాదేవి వద్దకు వెడలి ప్రార్థింపగ ఆమె నిశాంత లీల మొదలుకొని నక్తలీల వరకు గల అష్టకాలీయ లీలలను సవివరముగ చెప్పి దానిని రహస్యముగ యుంచమని నారదునితో చెప్పెను. ఆలీలలను దర్శించుటకు ఉపాయమడుగగా బృందాదేవి "ఎవరు రాగానుగ మార్గములో అనగా గోపికల

ఆనుగత్యములో శ్రీకృష్ణ సుఖైక తాత్పర్యమే చరమ ఫలితముగ నెంచి సేవాభిలాషతో రేయింబవళ్ళు ప్రార్థించెదరో వారు స్వరూప సిద్ధినొంది శ్రీరాధాగోవిందుల నిత్య సేవలో ప్రవేశింపగలరు" అని చెప్పెను. నారదుడు బృందాదేవి వద్ద శలవు తీసికొని వ్రజమునకు వెడలి గోవర్థన పర్వత ప్రాంతమున ఏకాంతములో బృందాదేవి చెప్పిన ప్రకారము సాధన చేసి స్వరూప సిద్ధినొంది శ్రీరాధాగోవిందులను దర్శించెను. ఎచ్చట నారదుడు ఈ దర్శనమునొందెనో అదియే నారద కుండముగ ప్రసిద్ధి చెందినది. ఇచట నారదుని శ్రీమూర్తి గలదు.

**ఉద్ధవ కుండము:-**

ఇచట ఉద్ధవుడు శ్రీవజ్రవాభునకు, ద్వారకా మహిషులకు శ్రీకృష్ణదర్శనమును కలిగించెను. కృష్ణుడు అంతర్ధానము చెందిన తరువాత ద్వారకా మహిషులు కృష్ణ విరహములో వ్యాకులురై మథురకు వచ్చి కృష్ణ ప్రేయసియగు యమున ఆనందోల్లాసముతో నుండుట గాంచి ఇట్లనిరి. "ఓ కాళిందీ ! మేమందరమూ నీవలెనే కృష్ణ ప్రేయసిలమే ! అయినను మేము ఆతని విరహమునందిట్లు బాధపడుచుండగ నీవు మాత్రము విరహము లేక ఆనందముగ నెట్లుంటివి? దీనికి కారణమేమి?" అని అడుగగా కాళింది నవ్వుచూ ఇట్లనెను. "ఆత్మారాముడగు శ్రీకృష్ణుని యొక్క ఆత్మయే శ్రీమతి రాధిక. రాధాదేవి యొక్క దాస్య ప్రభావము వలన కృష్ణ విరహ వేదన నన్ను స్పృశింపలేకున్నది. మీకును కృష్ణునితో ఎన్నడును విచ్ఛేదము లేదు. మీ రా విషయమును తెలిసికొనలేక వ్యాకులరగుచున్నారు. పూర్వము గోపికలు కూడ అక్రూరుడు కృష్ణుని మథురకు తీసికొని వెళ్ళినపుడు ఇట్టి విరహమునే పొందిరి. కాని ఉద్ధవుని ఓదార్పు వాక్యములచే వారి దుఃఖము తొలగెను. కావున మీరు కూడ ఉద్ధవుని కడకు వెడలినచో నిస్పందేహముగ విరహదుఃఖము తొలగి కృష్ణునితో నిత్య విహార సుఖమును పొందెదరు" ఆమాటలు వినినంతనే మహిషులు ఉద్ధవుని వద్దకు వెడలు ఉపాయమును కాళిందీని యడుగగా "ఇప్పుడు ఉద్ధవుడు గుల్మలతా రూపములో గోపికల చరణరేణువు పొందునభిలాషతో గోవర్ధన సమీపమున నివసించుచున్నాడు. అందువలన మీరు అచ్చటకు వెడలి కృష్ణ గుణ గానము చేసిన యెడల ఉద్ధవుడు తప్పక సాక్షాత్కరించును' అనెను. మహిషలు అట్లే చేసిరి. అప్పుడు గుల్మము నుండి పీతాంబరధారియు, వనమాల విభూషితుడు, శ్యామ కాంతితో కూడినవాడునగు ఉద్ధవ మహాశయుడు అచట ఆవిర్భవించెను. పిమ్మట మహిషల యొక్క విరహమును పోగొట్టు నిమిత్తము ఒక మాసము పాటు శ్రీమద్భాగవత కథారసాస్వాదనము చేయించెను. ఆసమయములో సర్వత్ర భగవల్లీలా ప్రకాశమగుచుండగా అచట శ్రీకృష్ణుడు ఆవిర్భవించెను. అపుడు మహిషలు భగవల్లీలల యందు తమ తమ స్వరూపములను దర్శించి విరహవేదన దుఃఖమునుండి విముక్తులైరి. ఆస్థలమే ఉద్ధవ కుండము.

--o--

# 10. మథుర

పూర్వము "మధు" అను దైత్యుడు కఠోరమగు తపమాచరించి శ్రీమహాదేవుని కడనుండి అద్భుతమగు శక్తికలగిన ఒక శూలమును పొందెను. ఆ శూలముయొక్క మాహాత్మ్యమేమనిన అది యున్నంతవరకు ఎవరునూ ఆతనిని జయించలేరు. ఆతని పుత్రుడు లవణాసురుడు. దుష్టుడు, దుర్నీతిపరాయణుడు నగు లవణాసురుని మితిమీరిన అత్యాచారమును సహించలేక తండ్రియగు మధువు శివానుగ్రహముచే పొందిన తన శూలమును ఆతనికిచ్చి వరుణాలయమునకు వెడలెను. శూలమును పొందిన లవణాసురుడు తాపసులు వనవాసులునగు ఋషులపై అత్యాచారము ప్రారంభింపగ వేరు ఉపాయములేక వారు శ్రీరామచంద్రుని శరణుపొందిరి. రామచంద్రుడు ఋషులకు అభయమిచ్చి ఆ దైత్యుని సంహరించుటకు శత్రుఘ్నుని పంపెను. శత్రుఘ్నుడు లవణాసురునితో భీకరముగ పోరాడి చివరకు ఆతనిని సంహరించెను. అనంతరము శత్రుఘ్నుడు అచట జనపదమును స్థాపించి పాలించసాగెను. ఆతని వంశము లుప్తము కాగా మథురను శూరసేన వంశీయులు పాలింపసాగిరి. కంసుడు మథురను రాజధానిగ చేసికొని తన ఆధిపత్యమును విస్తరింపచేయగా యదుకుల తిలకమగు శ్రీకృష్ణుడు కంసుని సంహరించెను. అనంతరము యుధిష్ఠిర మహరాజు కృష్ణుని ప్రపౌత్రుడగు వజ్రనాభుని మథురకు రాజుగ అభిషేకించెను. వజ్రనాభుడు మథురామండలమునందు శ్రీకృష్ణునియొక్క పెక్కులీలా స్థలములను, భగవన్మూర్తులను ప్రకటము చేసెను.

ఈ మథురయందు శ్రీకృష్ణ జన్మస్థానము, ఆదికేశవ దేవాలయము, రంగమంచె, ద్వారకాధీశ మందిరము, విశ్రామఘాట్, గతశ్రమ నారాయణుడు, కంసటీల, రంగేశ్వరుడు, భూతేశ్వరుడు మున్నగునవి దర్శింపదగినవి.

## శ్రీకృష్ణ జన్మస్థానము :-

ఒకప్పుడు శూరవంశీయుడగు వసుదేవుడు మథురలో దేవకిని వివాహము చేసికొని ఆమెతో స్వగృహమునకు వెడలుటకై రథము నధిరోహించెను. అపుడు ఉగ్రసేన మహారాజు కుమారుడగు కంసుడు సోదరియగు దేవకికి సంతోషమును కలుగజేయుటకై స్వయముగ రథమును నడుపుచుండెను. మార్గమధ్యమున అశరీరవాణి వానిని సంబోధించి ఇట్లు పలికెను - "ఓరీ! మూర్ఖుడా! నీవు రథముపై తీసికొని వెడలుచున్న దేవకి అష్టమగర్భము నీ ప్రాణములను హరించును."క్రూరమతియగు ఆ కంసుడు అశరీరవాణిని వినినంతనె సోదరియగు దేవకిని సంహరింప నుద్యుక్తుడయ్యెను.

వసుదేవుడు సామ మార్గములచే కంసుని ఇట్లు శాంతపరచెను. "దీనురాలు, నూతన వధువు యగు ఈ దేవకి నీకు పుత్రిక వంటిది. స్నేహపాత్రురాలు, కనిష్ఠసోదరి. నీవు దీన వత్సలుడవు. అందువలన ఈ వత్సలను సంహరించుట నీకు తగదు. ఆకాశవాణి పలకినటుల ఈ దేవకివలన నీకెట్టి భయముండదు. ఎవరివలన నీవు భయము చెందుచుంటివో ఆ దేవకియొక్క పుత్రులను జనించిన వెంటనే నీకు సమర్పింతును" అని చెప్పి దేవకి ప్రాణములను కాపాడెను. కాని కంసుడు దేవకీ వసుదేవులను కారాగారమునందు బంధించెను. దేవకికి జన్మించిన ఆరుగురు పుత్రులను సంహరించెను. తండ్రియగు ఉగ్రసేనుని బంధించెను. భగవానుని ఆదేశము ప్రకారము యోగమాయ దేవకీదేవి సప్తమ గర్భజాతుడగు బలదేవుని ఆకర్షించి రోహిణి గర్భమున నిలిపెను. షడ్త్వైశ్వర్యపూర్ణుడగు భగవానుడు తనపూర్ణరూపముతో వసుదేవుని చిత్తమందు ఆవిర్భవించెను. అనంతరము వసుదేవునుండి వేదదీక్షావిధితో సమర్పితుడు, జగన్మంగళకరుడు, అక్షయమగు నైశ్వర్యముతో పరిపూర్ణుడు, సర్వ మంగళ స్వరూపుడు నగు విష్ణువును దేవకి మనస్సుతో ధరించెను. ఇట్లు దేవకీదేవి లోపల అజితుడగు భగవానుడు విరాజిల్లుట వలన ఆమె దేహ కాంతిచే కారాగృహమును ఆలోకితము చేయుచుండెను. ఆమె వదనము పరమానందముచే ఎల్లప్పుడు వికసితమైయుండెను. బ్రహ్మ, శివుడు, నారదాది మునులు, దేవతలు దేవకి కడ కేతెంచి వివిధ వాక్కులతో సర్వుల కోర్కెలను తీర్చు శ్రీహరిని స్తుతింప సాగిరి. అనంతరము దేవతలు "తల్లీ దేవకీ! అదృష్టమువలన మాకు శుభములు కలుగుటకై సాక్షాత్తుగ పరమ పురుషుడగు భగవానుడు బలదేవునితోపాటు నీ కుక్షిగతుడయ్యెను. అందుచే ఆసన్న మరణుడగు కంసుని వలన నీకెట్టి భయము లేదు. నీ పుత్రుడగు కృష్ణుడు యాదవ రక్షకుడగును" అని పలికిరి. ఇట్లు ఎనిమిదిమాసముల ఎనిమిది రోజులు గడువగా శ్రావణ కృష్ణ అష్టమి తిథినాడు రోహిణి నక్షత్రమున శ్రీకృష్ణుడు కంసుని కారాగారమున అవిర్భవించెను.

తమద్భుతం బాలకమమ్బుజేక్షణం
చతుర్భుజం శంఖ గదాద్యుదాయుధమ్ ।
శ్రీవత్స లక్ష్మ్యం గళశోభికౌస్తుభం
పీతామ్బరం సాంద్ర పయోద సౌభగమ్ ॥

మహార్హ వైదూర్య కిరీటకుణ్డల
త్విషా పరిష్వక్త సహస్రకుస్తలమ్
ఉద్దామ కాంచ్యఙ్గద కఙ్కణాదిభిః
విరోచమానం వసుదేవ ఐక్షతః ॥ ( భా. 10-3-9,10)

పద్మములవంటి లోచనములు గలవాడు, చతుర్భుజుడు, శంఖచక్ర గదాద్యాయుధములు ధరించినవాడు, శ్రీవత్సచిహ్నితమైన వక్షఃస్థలము గలవాడు. కౌస్తుభముచే విరాజిల్లు కంఠముగలవాడు, పీతాంబరములను ధరించినవాడు, నీల పయోధరము వలె సౌందర్యము గలవాడు, మహామూల్యములగు వైఢూర్యమణులచే శోభిల్లు మకుటము కుండలముల యొక్క కాంతులచే ప్రకాశించు ముంగురులు కలవాడు, అధిక దీప్తిమంతములగు మొలనూలు కేయూరములు వలయములు మున్నగు అలంకారములచే శోభిల్లుచున్నవాడునగు ఆ అద్భుతబాలుని వసుదేవుడు వీక్షించెను.

దేవకీ వసుదేవులు భగవంతుని స్తుతించిరి. భగవానుని ఆదేశానుసారము వసుదేవుడు ఆ అద్భుతశిశువు (కృష్ణుడు) ను యశోదకడ పరుండబెట్టి అచటనున్న యోగమాయను తీసికొని వచ్చెను. శ్రీకృష్ణజన్మస్థానము విశ్వవిఖ్యాతమైనది. జన్మస్థానమునకు ప్రక్కనే యోగమాయా మందిరమున్నది. అచటనే కంసుడు యోగమాయను సంహరింపబోవ ఆతని చేతులనుండి పైకెగిరి తన అష్టభుజ రూపమున దర్శనమిచ్చెను.

మథురాపట్టణమునందు దర్శించవలసిన శ్రీవిగ్రహములు అనేకములు గలవు. వానిలో పట్టణ మధ్యస్థముగనున్న శ్రీకేశవదేవుడు, శ్రీపద్మనాభుడు, శ్రీదీర్ఘవిష్ణువు, శ్రీ గతశ్రమనారాయణుడు, స్వయంభూ మహాదేవుడు, శ్రీవరాహదేవుడు ప్రసిద్ధమైనవి. శ్రీవరాహదేవుని క్రమముగ కపిలదేవుడను బ్రాహ్మణుడు, ఇంద్రుడు, రావణుడు, శ్రీరామచంద్రమూర్తి పూజించిరి. అనంతరము శత్రుఘ్నుడు వరాహదేవుని మథురాపట్టణమునకు తెచ్చెను. అప్పటినుండి వరాహదేవుడిచట విరాజిల్లుచున్నాడు.

**ఆదికేశవాలయము :-**

ఆదికేశవస్వామి ఆలయము కృష్ణజన్మస్థలమునకు కుడివైపున యున్నది. ఈ శ్రీమూర్తి సత్యయుగమునాటిది. ఆదికేశవునిగూర్చి వరాహపురాణమందును, పద్మపురాణమందును విశేషవివరణ యున్నది.

శ్రీకృష్ణుడు బృందావనమునందు పదిసంవత్సరముల ఎనిమిది మాసములు యుండి అత్యద్భుతమగు లీలలను చేసెను. కంసుడు అక్రూరుని బృందావనమునకు పంపి ధనుర్యాగమును జూచు నెపముతోను, మథురాపట్టణమును జూచు మిషతోను బలరామకృష్ణులను మథురకు రప్పించెను. గోపాలురతోగూడి బలరామకృష్ణులు విచిత్ర

శోభాయుక్తమగు ఆ పట్టణమందు ప్రవేశింపగనే పురస్త్రీలందరూ ప్రాసాదముల నధిరోహించి వారిపై పుష్పవృష్టిని గురిపించి అనిమిషనేత్రములతో శ్రీకృష్ణుని సౌందర్యమును వీక్షించ సాగిరి. బ్రాహ్మణులు గంధ పుష్పమాలలతో వారిని పూజించిరి. పురవీథులలో అట్లు వెడలుచున్న కృష్ణుడు కంసుని చాకలి వానిని జూచి ఉత్కృష్టములగు వస్త్రములను ఈయమనగా వాడు కృష్ణుని దూషించెను. కృష్ణుడు నఖములతో వాని శిరమును ఊడబెరికెను. రామకృష్ణులు తమకు యోగ్యమగు వస్త్రములను తీసికొనెను. అనంతరమొక సాలెవాడు వచ్చి రామకృష్ణులకు తగిన వేషమును రచించెను. కృష్ణుడాతని అనుగ్రహించెను. అనంతరము వారు ఒక మాలాకారుని గృహమునకు వెడలగ ఆతడు సుగంధపుష్పమాలలతో వారిని అలంకరించెను. కంసుని సేవిక యగు కుబ్జ భగవానుని కోరికమీద ఆతనికి దివ్యచందనము నొసంగి అందమగు శరీరమునొందెను. రామకృష్ణులావిధముగ అలంకృతులై ధనుర్యాగము జరుగు స్థలమునకు వెడలి అచట ఇంద్ర ధనువు వంటి ఒక అద్భుత ధనువును జూచి రక్షకులు నివారించుచున్నను శ్రీకృష్ణుడు బలవంతముగ దానిని పట్టుకొని ఎక్కుపెట్టి అవలీలగ విరచెను. రక్షకులు శ్రీకృష్ణుని సంహరింప నుద్యుక్తులు కాగా రామకృష్ణులా విరగిన ధనస్సుతో వారిని చంపి స్వేచ్ఛగా విహరింపసాగిరి.

**హోలీగేట్ :-**

అనంతరము మల్లక్రీడా స్థలమగు రంగస్థలము అలంకరింపబడి పురవాసులతో నిండియుండుట చూచి రామకృష్ణులచటకు వెడలిరి. రంగస్థలద్వారమున కృష్ణుని సంహరించుటకు ఏర్పరచిన కువలయాపీడమను ఏనుగును, మావటివానిని రామకృష్ణులు సంహరించి దాని దంతములను భుజముపై నిడుకొని రక్తపు మరకలతో అపూర్వముగ శోభిల్లుచు రంగస్థలమునకు చేరుకొనిరి. (ఆ రంగస్థలద్వారమును హోలీగేట్ అందురు. ఇప్పటికిని దానిని దర్శింప వచ్చును.) అప్పుడు విభిన్న ప్రకృతులుగల జనులు కృష్ణుని వివిధభావములతో దర్శింపసాగిరి.

మల్లానామశనిర్నృణాం నరవరః స్త్రీణాం స్మరో మూర్తిమాన్
గోపానాం స్వజనోఽసతాం క్షితిభుజాం శాస్తా స్వపిత్రోః శిశుః ।
మృత్యుర్భోజపతేర్విరాడ విదుషాం తత్త్వం పరం యోగినాం
వృష్ణీనాం పరదేవతేతి విదితో రఙ్గం గతః సాగ్రజః ॥(భా.10-43-17)

శ్రీకృష్ణుడు మల్లురకు పిడుగువలెను, మానవులకు పురుషోత్తముడుగను, స్త్రీలకు మూర్తీభవించిన మన్మథుడుగను, గోపాలురకు బంధువుగను, దుష్టరాజులకు శాసకుడుగను, జననీజనకులకు శిశువుగను, కంసునకు మృత్యుదేవ త గను, అజ్ఞానులకు విరాట్పురుషునిగను, యోగులకు పరమతత్త్వముగను, వృష్ణివంశీయులకు పరమ దేవతగను గనబడి బలదేవునితో రంగభూమి యందు ప్రవేశించెను.

ఆ సమయమున అచటనున్నప్రేక్షకులు శ్రీకృష్ణుడు చేసిన వివిధలీలలను ఒకరినొకరు ప్రసంగించు కొనుచుండిరి. చాణూర ముష్టికులను మల్లయోధులు బలరామ కృష్ణులతో నిట్లు పలికిరి - "శ్రీ కృష్ణా! బలరామా! మీరిరువురు బాహుయుద్ధమున కుశలురని వీరులవలన తెలిసికొని కంసరాజు స్వయముగ చూచుటకు మిమ్ములను ఇచటకు ఆహ్వానించినాడు. కావున మాతో మల్లయుద్ధము చేయుడు."అనగా కృష్ణుడు మల్లుల వాక్కులను విని" మేము బాలురము, అందువలన సమబలురగు మల్లులతోనే క్రీడింతు"మనిన మీరు సామాన్య బాలురుగారు, వేయియేనుగుల బలము కలిగిన కువలయాపీడ మను ఏనుగును అవలీలగ సంహరించిరి. గావున మాతోయుద్ధము చేయవలయునని పలికి తలపడిరి. అప్పుడు రంగస్థల దర్శనార్థమై వచ్చిన దయార్ద్రచిత్తలగు మహిళలు గుంపులుగా చేరి పరస్పరము ఈ యుద్ధము బలవంతులకు బలహీనులకు నడుమ జరుగుచున్నదనియు, ఇది అన్యాయమనియు చెప్పుకొనసాగిరి. రామకృష్ణులు కొద్దిసేపు ఇట్లు వీరరసము నాస్వాదించి అనంతరము వారిని హతమార్చిరి. అట్లు చాణూరుని, ముష్టికుని, కూటుని, శలుని, తోశలుని, సంహరింపగా మిగిలిన మల్లులు తమ తమ ప్రాణములను రక్షించుకొనుటకై పారిపోయిరి. బలరామకృష్ణులు తమతోవచ్చిన గోపాలురతో నృత్యము చేయసాగిరి.

**కంసటీల :-**

కంసుడు దుర్భాషలాడుచు నందుని వసుదేవుని వధింపుడని పలుకగా కృష్ణుడు వేగముగ నెగిరి ఎత్తైన మంచమీద నున్న కంసుని కడకు వెడలి ఆతనిని జుట్టుపట్టి క్రిందకులాగెను. వెంటనే కంసుడు మరణించెను. కంసుడు కూర్చొనిన ఎత్తైన మంచప్రదేశమునే కంసటీల అనెదరు.

**ద్వారకాధీశ మందిరము :-**

మథురా నగరములోని ఈ మందిరమును శ్రీకృష్ణుని మునిమనుమడగు వజ్రనాభుడు నిర్మించి శ్రీద్వారకాధీశ విగ్రహమును ప్రతిష్ఠించెను. ఈదేవాలయము

ఐదువేల సంవత్సరములకాలము నాటిది. ఈ ద్వారకాధీశునకు ఐశ్వర్య మార్గము ననుసరించి అతి వైభవముగ సేవ జరుగుచుండును.

**విశ్రామఘాట్ :-**

కంసుని సంహారానంతరము బలరామకృష్ణులు యమునానదిలో స్నానమాచరించి విశ్రాంతి తీసుకొనుటద్వారా అలసటను పోగొట్టుకొనిరి. అందువలన ఈఘట్టమునకు విశ్రామ ఘాట్ అనిపేరు. ఇచ్చటనే సూర్యతనయుడగు యమధర్మరాజు కార్తీక శుద్ధ విదియనాడు తన సోదరియగు యమునకు తిలకమును దిద్ది ఆమెకడ భుజించినాడు. ఈ తిథిరోజున ఎవరీ విధముగ భగినీ హస్త భోజనము చేయుదురో వారికి యమలోక దర్శనము లేకుండునటుల యమున యమధర్మరాజుని నుండి వరమును పొందెను. (భాయిార్ కపాలే దిలామ్ ఫోటా యమేర్ ద్వారే పడిలా కాటా) ఇచ్చట యమున, యమధర్మరాజు విగ్రహము లున్నవి.

**గతశ్రమ నారాయణుడు :-**

కంస సంహారానంతరము విశ్రామఘాట్‌లో స్నానమాచరించి అలసట తీర్చుకొని కృష్ణుడు నారాయణరూపముతో ఇచట యుండెను. అందుచేత ఈ నారాయణుని గతశ్రమ నారాయణుడు అని పిలతురు. ఇది కూడా మథురలోనే యున్నది.

**రంగేశ్వరుడు :-**

ఈ దేవాలయము మథురలోని శివాలయము. కంస సంహారానంతరము కృష్ణ బలరాములు పిల్లలతో కలసి ఆనందముతో ఆడుకొనుటను జూచి శివుడు కూడ వచ్చి వారితో నృత్యము చేసెను. ఆనందముతో నృత్యము చేయుటచే శివునకు రంగేశ్వరుడను పేరు వచ్చినది.

**భూతేశ్వరుడు :-**

ఇది మథురలోని శివుని ఆలయము. ఈ విగ్రహమును శ్రీకృష్ణుని మునిమమనుడు వజ్రనాభుడు ప్రతిష్ఠించెను. సమస్తప్రాణులకు ఈశ్వరుడు కావున "భూతేశ్వరు"డని పేరు వచ్చినది.

—0—

# 11. శ్రీ బృందావనము

శ్రీశ్రీరాధాకృష్ణుల నిత్య విహార స్థలము శ్రీబృందావన ధామము. అట్టి మహా మహిమాన్వితము పవిత్రమునగు శ్రీబృందావన ధామమును గూర్చి శ్రీల రూపగోస్వాములవారు తమ స్తవావళి యను గ్రంథములో ఇట్లు వ్రాసిరి.

ప్రతి నవనవ కుంజం ప్రేమ పూరేణ పూర్ణా
ప్రచుర సురభి పుష్పైః భూషయిత్వా క్రమేణ ।
ప్రణయతి బత బృందా తత్ర లీలోత్సవం యా
ప్రియగణ వృతరాధాకృష్ణయోస్తాం ప్రపద్యే ॥

ఆహా! ప్రేమరసమునందు నిమగ్నమై, నూతన నూతన కుంజములను సుగంధ కుసుమములచే అలంకరించి, సఖీగణముచే పరివృతులైన శ్రీశ్రీరాధాకృష్ణుల యొక్క లీలానందమును విస్తరింపజేయుచున్న శ్రీబృందావనమునకు నేను నమస్కరించు చున్నాను.

బృందావనం ద్వాదశకం బృందయా పరిరక్షితమ్ ।
మమచైవ ప్రియం భూమే సర్వపాతకనాశనమ్ ॥
తత్రాహం క్రీడయిష్యామి గోపీ-గోపాలకైః సహ ।
సురమ్యః సుప్రతీతం చ దేవ-మానవ - దుర్లభమ్ ॥ (ఆదివరాహ పురాణము)

హే పృథ్వీ! బృందాదేవి ద్వారా రక్షింపబడుచున్న ద్వాదశవనమగు బృందావనము సర్వపాతక నాశనమై నాకు నిశ్చయముగ ప్రియమగుచున్నది. నేనచ్చట గోపగోపికలతో లీలలు చేయుచుందును. ఇది అత్యంత మనోహరమై విఖ్యాతినొందినదై దేవదానవులకు గూడ దుర్లభమగుచున్నది.

తతో బృందావనం పుణ్యం బృందాదేవీ సమాశ్రితమ్ ।
హరిణాధిష్ఠితం తద్ధి బ్రహ్మరుద్రాది సేవితమ్ ॥
బృందావనం సుగహనం విశాలం విస్తృతం బహు ।
మునీనామాశ్రమైః పూర్ణం వన్య బృన్దా సమన్వితమ్ ॥
యథా లక్ష్మీః ప్రియతమా సదా భక్తిపరాయణా ।
గోవిన్దస్య ప్రియతమం తథా బృన్దావనం భువి ॥
వత్సైర్వత్సతరీభిశ్చ సాకం క్రీడతి మాధవః ।
బృన్దావనాన్తరగతః సరామో బాలకైర్వృతః ॥
అహో బృన్దావనం రమ్యం యత్రగోవర్ధనోగిరిః ।
తత్ర తీర్థాన్యనేకాని విష్ణుదేవ కృతాని చ ॥ (స్కంద పురాణము)

బృందావనము పుణ్యప్రదమైనది, అన్నివిధములుగను బృందాదేవిని ఆశ్రయించి యున్నది. మిక్కిలి విస్తృతమైనదియు, మునుల ఆశ్రమములచే పరిపూర్ణమైనదియు, తులసీవన సమన్వితమైనదియు, బ్రహ్మ రుద్రాది దేవతలచే సేవింపబడుచున్నదియు, అతీవ దుర్జ్ఞేయమైనదియు, పరమ శోభాయమానమైనదియునగు ఆ బృందావనమున శ్రీహరి అధిష్ఠించియున్నాడు. నిరంతర సేవాపరాయణురాలగు లక్ష్మీదేవి విష్ణువునకెట్లు ప్రియతమురాలో, ఆవిధముగనే ఈ పృథివీయందు బృందావనము గోవిందునకు అత్యంత ప్రియమైనది. మాధవుడు బలరామునితో గోపాలురతో వేష్టితమై గోవత్సములను తోడ్కొని బృందావనమునందు క్రీడించును. ఆహా! ఎచ్చట గోవర్ధనపర్వతము విరాజిల్లుచున్నదో, ఎచ్చట భగవానుడగు విష్ణువుచే సృష్టింపబడిన అనేకములగు తీర్థములు యున్నవో అదియే కదా రమణీయ మగు బృందావనము!

పూర్ణః ప్రేమరసైః సదా మురరిపోర్దాసః సఖా చ ప్రియం
స్వప్రాణార్బుదతోఽపి తత్పదయుగం హిత్వేహ మాసాన్ దశ ।
ప్రీత్యా యో నివసంస్తదీయకథయా గోష్ఠం ముహుర్జీవయ-
త్యాయాతం కిల పశ్య కృష్ణమితి తం మూర్ధ్నా వహామ్యుద్ధవమ్ ॥

శ్రీకృష్ణునియొక్క ప్రేమరసముచే పూర్ణుడు మరియు అతని దాసుడు మిత్రుడునగు ఉద్ధవుడు, తన ప్రాణముల కంటెను ప్రియతముడగు కృష్ణునియొక్క పాదపద్మములను వదలి బృందావనమునందు నివసించి, "శ్రీకృష్ణుడు మధురనుండి వచ్చినట్లే, మీరు చూచెదరు (చూడుడు)" - ఈవిధముగ ఊరట కలిగించు వాక్యములచే పదినెలలుపాటు కేవలము శ్రీకృష్ణుని ప్రసంగములచే వ్రజవాసుల ప్రాణములను కాపాడెను. అట్టి ఉద్ధవునికి నేను శిరము వంచి నమస్కరింతును.

శ్రీకృష్ణునియొక్క లీలలతోను, కృష్ణప్రేమికులునగు గోపగోపికలతో, అతులనీయ గో ప్రకృతి సంపదలతో నిండియున్న బృందావనమహిమను శాస్త్రములు ముక్త కంఠముతో ఘోషించుచున్నవి. సకల అవతారములలో కృష్ణుడు సర్వశ్రేష్ఠుడై నటుల సమస్త క్షేత్రములందు సర్వోత్కృష్టము శ్రీబృందావనము. బృందావనమునందు షడృతువులు ఎల్లపుడును యుండును. ఐదు ముఖ్యరసములు, ఏడు గౌణరసములు కలిపి ద్వాదశ రసములకు నిదర్శనముగ బృందావనములోని ద్వాదశ వనములు విలసిల్లుచున్నవి. ద్వాదశ రసములలో మధుర రసము సర్వోత్కృష్టము. ఇచ్చట ప్రవహించుచున్న యమునానది ముల్లోకములను పవిత్రముచేయు పతితోద్ధారిణి యగు గంగానది కంటెను అధిక సౌభాగ్యమును కలిగియున్నది. భగవానుని పాదపద్మములనుండి ఉద్భవించిన గంగ భగవానుని మిగిలిన అవయవములను

స్పృశించు భాగ్యము నోచుకొనలేక పోయినది. కాని బృందావనము నందలి యమునానదితోబాటు వ్రజమండలము నందలి ఆరువందల సరోవరములు, ఐదువేల కుండముల యందు శ్రీకృష్ణుడు గోపగోపికలతో అసంఖ్యాకములగు లీలలను చేయుచు విహరించినందువలన అవి అన్నియు భగవానుని సర్వ అవయవ స్పర్శను పొంది పరమపావనమైయున్నవి. ఇచ్చటి నదులు కుండములే గాక పర్వతములు కూడ భగవత్సేవానందమును అనుభవించినవి. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు శ్రీరాధాకృష్ణుల సేవచేయుటకై ఇచ్చట పర్వతరూపమున ఆవిర్భవించిరి. బర్సానా యందు బ్రహ్మ బ్రహ్మగిరిగను, నందగ్రామమున శివుడు నందీశ్వరపర్వతముగను, విష్ణువు గోవర్ధన రూపములోను యుండి గో గోపసమన్వితుడగు కృష్ణునకు సకల ఉపచారములను చేసిరి. అంతియేగాక వేదములు, ఉపనిషత్తులు గోరూపముననుండి కృష్ణుని సేవించి తమ జీవితములను కృతార్థము చేసికొనిరి.

సత్య యుగమునందు గరుత్మంతుడు నిరంతరము వేదపారాయణ చేయుట ద్వారా శ్రీమన్నారాయణుని సేవించెను. త్రేతాయుగమునందు హనుమంతుడు వేదసారమగు శ్రీరామనామమును నిరంతరము గానము చేయుచు రాముని సేవించెను. ద్వాపరయుగమున వేదరహస్యమగు శ్రీకృష్ణలీలలను చిత్రక పత్రకాదులు గానము చేసి భగవదానందానుభూతులను బడసిరి.

ఈ బృందావన ధామమునందు వృక్షరూపములోను, చిలుక గోరువంక నెమలి కోకల రూపములతోను, తుమ్మెద రూపముతోను దేవర్షులు బ్రహ్మర్షులు శ్రీకృష్ణలీలలను దర్శించుచు కీర్తించుచుందురు. వీరేగాక పార్వతీదేవి వైజయంతీ మాల రూపముతోను, లక్ష్మీదేవి శ్రీవత్సలాంఛనముగను, సరస్వతి మురళీరూపముతోను భగవానుని సేవించుచున్నారు. సంకర్షణుడు కౌస్తుభ రూపముతోను, చంద్రుడు నెమలి పింఛము రూపముతోను కృష్ణుని నిరంతరము సేవించి ధన్యులగుచున్నారు. ఇచ్చట దేవతలు, ఋషులు, శ్రుతులు, స్మృతులు బృందావన విహారియగు శ్రీకృష్ణుని సేవించి తమ తమ జీవితమును ధన్యాతి ధన్యము గావించుకొనిరి. దేవతలు, ఋషులు వారి వారి కార్యములను పరిత్యజించి కృష్ణలీలలను దర్శించుట కీర్తించుట యందు వ్రతులైయుండిరి. బ్రహ్మ, ప్రాచేతసుల శాపముచే ఎన్నడును ఒకచోట స్థిరముగ యుండని త్రిలోక సంచారి యగు నారదుడు, ఈ బృందావనములో స్థిరముగ యుండి తపస్సుచేసి కృష్ణలీల యందు ప్రవేశించెను. శ్రీకృష్ణుడు ఇచట యున్నంతకాలము నారదుడు కూడ యుండి శ్రీకృష్ణలీలలను దర్శించుచు కీర్తించెను. అట్టి బృందావనవనములో శ్రీకష్ణుడు చేసిన లీలలను మనమిచట యొకింత ఆలోచించెదము. అవి కాళీయమర్దనము, వంశీవటము, కేశఘాట్, ఇమ్లీతల , చీర్‌ఘాట్ (వస్త్రాపహరణము

చేసిన స్థలము), అక్రూరునకు విశ్వరూపమును చూపిన స్థలము (అక్రూరఘాట్), యజ్ఞపత్నులను అనుగ్రహించిన స్థలము, సేవాకుంజ్ (నిధువనము). ఇంకనూ ఇచట శ్రీగోవిందజీ మందిరము, శ్రీగోపీనాథ్‌జీ మందిరము, శ్రీమదన మోహన్‌జీ మందిరము శ్రీరాధారమణ మందిరము, శ్రీరాధాశ్యామసుందర మందిరము, శ్రీరాధాగోకులానంద మందిరము, శ్రీగోపీశ్వరుడు, రంగనాథజీ దేవాలయము, లాలాబాబు దేవాలయము, సాజీ దేవాలయము, మీరాబాయి దేవాలయము మున్నగునవి దర్శింపదగినవి.

**కాళీయదహ (కాళీయ మర్దనము చేసిన స్థలము) :-**

ఇది కృష్ణుడు కాళీయమర్దనము చేసిన స్థలము. ప్రాచీన యమున తీరమందున్నది. శ్రీకృష్ణుడొకనాడు గోవులను మేపుచు బలదేవుని విడచి తన సహచరులతోగూడి యమునా తీరమునకు వచ్చెను. ఎండవేడిమిచే బాధపడి దప్పిగగొన్న గోపాలురు, గోవులు అచ్చట యమునానదీ జలములను విషదూషితములని తెలియక త్రాగి అచటనే మృతులై పడిపోయిరి. యోగేశ్వరుడు, ఈశ్వరుడునగు శ్రీకృష్ణుడు తనను ఆశ్రయించిన గోపకులు, గోవులు ఈవిధముగ మరణించుట జూచి తన అమృతమయములగు దృష్టిచే వారిని బ్రతికించెను. అనంతరము యమునానదిలోగల ఒక హ్రదములో కాళీయుడను నొక విషసర్పమున్నదనియు, దాని విషజ్వాలలచే అచ్చటి జలము విషపూరితమైనదనియు, ఆ విషయవాయువులచే అచ్చటి పక్షులు వృక్షములు చనిపోవుచున్నవనియు తెలిసికొని, దుష్టదమనమునకై అవతరించిన శ్రీకృష్ణుడు కటి వస్త్రమును బిగించి తీరమునందున్న ఒక పెద్దవృక్షము నెక్కి కాళీయుని దమనమునకై ఆ హ్రదమునందు దుమికెను. ఆ శబ్దము వినిన కాళీయుడు క్రుద్ధుడై సుకుమార శరీరముతోను, ఉజ్వల కాంతితోను, పీత వస్త్రమును ధరించి చిరునవ్వు మోముతోనున్న కృష్ణుని కాటువేసి తన శరీరముతో ఆయనను చుట్టి బంధించెను. కృష్ణుడా బంధనమును సడలించి వేగముతో అత్యున్నతమైన ఆ కాళీయుని శిరముల పైకెగసి వానిని మర్దించెను. నాట్యవిశారదుడు మురళీ లోలుడునైన కృష్ణుడు వాని తలలపై నృత్యము గావింపగ, వాని నోళ్ళనుండి ముక్కునుండి రక్తము కారి అతని అహంకారము ధ్వంసమైనది. అపుడా నాగుని పత్నులు కృష్ణుని శరణువేడి పతిభిక్షనిమ్మని ఇట్లు వేడుకొనిరి.

*ఒల్లరు నిర్జరేంద్ర పద మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా*
*నొల్లరు చక్రవర్తి పదమొల్లరు సర్వరసాధిపత్యమున్*
*నొల్లరు యోగసిద్ధి మఱియొండు భవంబుల నొందనీ ని టీ*
*సల్లలితాంఘ్రి రేణువుల సంగతి నొంది ధన్యులెప్పుడున్.*

నమోఽనన్తాయ సూక్ష్మాయ కూటస్థాయ విపశ్చితే ।
నానావాదానురోధాయ వాచ్యవాచక శక్తయే ॥
నమః ప్రమాణ మాలాయ కవయే శాస్త్రయోనయే ।
ప్రవృత్తాయ నివృత్తాయ నిగమాయ నమోనమః॥ (భా. 10-16-43,44)

వారి కోరికను మన్నించి శ్రీకృష్ణుడు ఆకాళీయుని శిరములపై లీలచేయ నిచ్ఛగించి రాధిక మున్నగు గోపికలతో నృత్యము ప్రదర్శించెను. కృష్ణుని సంకల్పము నెరిగిన కాళీయుడు వాని శిరస్సులను విశాలముగావించి కృష్ణునకు నృత్య మంచెగ చేసెను. బాహ్యమునకు కృష్ణుడు కాళీయుని దమనము చేసినట్లు కనబడినను వాస్తవమునకు కృష్ణుడు ఆతనిని అనుగ్రహించుటకే అట్లు చేసెను. కాళీయుని మహద్భాగ్యమును వాని పత్నులు ఇట్లు కొనియాడుచు కృష్ణుని స్తుతించిరి.

కస్యాను భావోఽస్య న దేవ విద్మహే
తవాఙ్ఘ్రి రేణుస్పర్శాధికారః ।
యద్వాంఛయా శ్రీర్లలనాచరత్తపో
విహాయ కామాన్ సుచిరం ధృతవ్రతా ॥

ననాకపృష్ఠం న చ సార్వభౌమం
న పారమేష్ఠ్యం న రసాధిపత్యమ్ ।
నయోగసిద్ధీరపునర్భవం వా
వాంఛన్తి యత్పాద రజః ప్రపన్నాః ॥ (భా. 10-16-36, 37)

ఏపాదరేణువులను పొంది లక్ష్మీదేవి మిగిలిన విషయములను త్యజించి పెక్కుకాలము నియమముతో తపమాచరించెనో కదా! కాళీయుడు ఏ పుణ్యప్రభావముచే ఆపాద రేణువులను పొందుటకు అధికారి అయ్యెనో తెలియకున్నది. నీచరణ ధూళిని పొందిన వారు స్వర్గలోకమునుగాని, సార్వభౌమపదవిని, బ్రహ్మపదమును, పృథివియందు ఆధిపత్యమును, యోగసిద్ధిని చివరకు మోక్షమును కూడ కోరుకొనరు.

అట్టి దివ్యమగు కృష్ణచరణధూళిని పొందిన కాళీయుడు కృష్ణ పద చిహ్నములచే చిహ్నితుడై తన పూర్వస్థానమగు రమణక ద్వీపమునకు సకుటుంబముగ వెడలిపోయెను

**వంశీవటము :-**

శరత్కాల పూర్ణిమ రాత్రులురాగా శ్రీకృష్ణుడు గోపికలతో విహరింప దలచి, ఈ వంశీవటము క్రింద త్రిభంగ భంగిమతో మధురమైన వేణుగానము చేసెను. పూర్వము

నుండియే శ్రీకృష్ణునియందు సమర్పితమైన చిత్తముగల గోపికలు శ్రీకృష్ణుని వేణుగానమును విని ఒకరికొకరు తెలియ కుండగనే అచటకు చేరిరి. ఆ గోపికలలో కొందరపుడు పాలుపితుకుచుండిరి. కొందరు పొయ్యిపై పాలను కాగపెట్టుచుండిరి. కొందరు వంటచేయుచుండిరి. కొందరు పతి పుత్రాదులకు అన్నమును వడ్డించు చుండిరి. కొందరు పతిసేవ చేయుచుండిరి. కొందరు అలంకరించుకొనుచుండిరి. అయినప్పటికిని వారందరూ వారి పనులను పూర్తిచేయకయే విపరీతముగ వస్త్రాదులను, ఆభరణములను ధరించి వారివారి భర్తలు, తండ్రులు, సోదరులు, బంధువులు వారించుచున్ననూ సముద్రమున కలయుటకు వడిగా పోవు నదులవలె గోవిందుని కడకు వెడలిరి. శ్రీకృష్ణుడపుడు వారటుల రాత్రిసమయములో వచ్చుట ఉచితము కాదని, తిరిగి తమ తమ నెలవులకు పోయి ఆయా కార్యములను నిర్విహించు కొనుమని, స్త్రీలకు పతిపుత్రాదుల సేవయే పరమధర్మమనియు పలువిధముల ఉపదేశించెను. శ్రీకృష్ణుడు పలికిన అప్రియములగు ఈ వాక్కులను విని గోపికలు, "ధర్మజ్ఞుడవగు నో కృష్ణా! నీవిట్లు పలుకుట తగదు. పరమేశ్వరుడవు, సర్వ జీవుల అంతర్యామివియు నగు నీసేవ చేయుట వలననే మాకు పతిపుత్రుల సేవకంటెనూ అధికమగు ఫలము కలుగును. ఏలయన నీవు ప్రాణులకు ప్రియతమమైన ఆత్మవు, సుహృదుడవు, బంధువవు, ఇప్పటివరకు మాచిత్తము గృహకర్మలయందు నిమగ్నమై యుండెడిది. కాని నీ వేణుగానముచే మా మనస్సులను, హస్తములను నీవు హరించితివి. మా పాదములు నీ కడనుండి ఒక్క అడుగైననూ కదులుట లేదు. మేము వ్రజమున కెట్లు పోగలము, ఏమి చేయగలము?" అని పలికిరి. అపుడు శరత్కాలములో ఆకాశము, జలము, భూమి ఏవిధముగా నిర్మలమై యుండునో అట్టి నిర్మల హృదయములగు గోపికలతో శ్రీకృష్ణుడు రాసక్రీడ చేసెను.

**కేశీఘాట్ :-**

శ్రీకృష్ణుడు ఇచట కేశియను అసురుని సంహరించెను. కంసునిచే పంపబడిన కేశియను దానవుడు గొప్ప అశ్వరూపమును ధరించి వ్రజమునకు వెడలి భయంకరముగ సకిలింపుచు వ్రజవాసులను భయపెట్టుచు శ్రీకృష్ణుని కొరకు వెదుకసాగెను. అదిచూచి శ్రీకృష్ణుడు వానికడకు వెడలగా కేశి కృష్ణుని తన్నుటకు ప్రయత్నించెను. శ్రీకృష్ణుడు వాని రెండుకాళ్ళను పట్టుకొని గిరగిర త్రిప్పి కొట్టగ నాలుగువందల గజముల దూరమున పడెను. వాడు క్రోధముతో నోటిని తెరచి శ్రీకృష్ణుని కడకు రాగా కృష్ణుడు వాని నోటిలో తన ఎడమచేతిని ప్రవేశపెట్టెను. వాడాచేతిని నమలుటకు ప్రయత్నించగా కృష్ణుని చేయి కాలుచున్న ఇనుమువలె వానికి బాధను కలిగించుచు క్రమముగ లావెక్కెను. దానితో వాని శ్వాస రుద్ధమయ్యెను. అపుడా దానవుడు నరకయాతన

ననుభవించి మరణించెను. శ్రీకృష్ణుని చేతిలో ఆదైత్యుడు మరణింపగ గోపాలురు కృష్ణుని ప్రశంసించిరి. దేవతలు పుష్పవృష్టిని కురిపించిరి.

**ఇమ్లితల :-**

హిందీ భాషలో ఇమ్లితల అనగా చింతచెట్టు అని అర్థము. శ్రీకృష్ణుడు ఈ వృక్షఛాయలో గూర్చుండి యమునానది సౌందర్యమును చూచి మురళీ మ్రోగించెను. ఆ మురళీగానమునకు అనుకూలముగ కోకిలలు చిలుకలు గోరువంకలు గానము చేసినవి. నెమళ్ళు నృత్యము చేసెను. యమునానది తరంగములు మృదంగతాళములవలె కెరటములతో తీరములను తాకుచు శబ్దములను చేసినవి. కృష్ణుని మురళీగానముచే ప్రకృతి అంతయు పరవసించి పోయెను. శ్రీచైతన్యమహాప్రభువు బృందావనమునకు వచ్చినపుడు ఈస్థలమునుండియే బృందావన శోభను యమునా సౌందర్యమును తిలకించెను.

**చీర్‌ఘాట్ (వస్త్రాపహరణము చేసిన స్థలము) :-**

శ్రీకృష్ణుడు గోపికా వస్త్రాపహరణము చేసిన స్థలమును చీర్‌ఘాట్ అందురు. భగవద్బహిర్ముఖులగు పెక్కుమంది శ్రీకృష్ణుని ఈ వస్త్రాపహరణ లీలయొక్క ఆంతర్యమును తెలిసికొనక అపార్థము చేసుకొనుచున్నారు. కృష్ణుని వయస్సు ఆరుసంవత్సరములు. గోప కుమారికలు అనగా ఐదు సంవత్సరముల వయస్సుగల బాలికలు. వారు మార్గశిరమాసమునందు కాత్యాయనీ వ్రతమాచరించి సుగంధ మాలలతో, గంధ ధూప దీప నైవేద్యాదులతో ఆమెను ఆరాధించి శ్రీకృష్ణునే తమకు పతిగ నొసగుమని ప్రార్థించిరి.

కాత్యాయనీ మహామాయే మహాయోగిన్యధీశ్వరీ ।
నన్దగోపసుతం దేవి పతిం మే కురు తే నమః ॥ (భా.10-22-4)

మహామాయా! మహాయోగినీ! అధీశ్వరీ! కాత్యాయనీ దేవీ! నీవు నందసుతుడగు శ్రీకృష్ణుని మాకు పతిగ నొనర్చుము. నీకు నమస్కరించుచున్నాము.

ఇట్లు వ్రతమాచరించి మాసాంతమున వారు ధరించిన వస్త్రములను యమునాతీరమందుంచి ఆనందముతో కృష్ణచరితమును గానము చేయుచు నదిలో స్నానము చేయసాగిరి. వివస్త్రలై స్నానముచేయుట నేరమగుటచే పూర్ణ వ్రత ఫలితము

కలుగదు గావున శ్రీకృష్ణుడు వారి అపరాధమును తొలగించుటకై సఖులతో అచటకు చేరి వారి వస్త్రములను తీసికొని తీరముననున్న కడిమిచెట్టునెక్కి నవ్వుచుండెను. గోపికలదిగ్రహించి వస్త్రములివ్వుమని కృష్ణుని పలువిధముల ప్రార్థింపగ వారితో శ్రీకృష్ణుడు ఇట్లు పలికెను.

*నా యింటికి దాసుల రై*
*నా యాజ్ఞ వహించి మీరు నడచెదరేనిన్,*
*మీ యంబరము లిచ్చెద (*
*దోయంబలు వెడలి రండు తొయ్యలు లారా!*

గోపకుమారికలు శ్రీకృష్ణుడు చెప్పినట్లే ఆచరింప కృష్ణుడు ప్రసన్నుడై వారికి వస్త్రముల నొసంగి, రాబోవు శరద్రాత్రులయందు మీతో విహరించెదనని పలికెను.

సూచన : శ్రీకృష్ణ లీలలను శాస్త్రప్రకారము ఆలోచింపక, గురుముఖతః శ్రవణము చేయక, ఏవో చిత్రపటములను దృష్టిలో నుంచుకొని శ్రవణ కీర్తనలను చేసిన యెడల త్రిగుణాత్మకమగు మాయ వారిని రౌరవనరకమున బడవేయును.

**అక్రూర ఘాట్ ( అక్రూరుడు విశ్వరూపమును చూచిన స్థలము) :-**

కంసునిచే ఆదేశింపబడి అక్రూరుడు బృందావనమునకేతెంచి కంసునియొక్క దుర్బుద్ధిని స్పష్టముగ తెలిపి, కంస సంహారము కొరకు బలరామ కృష్ణులను రథముపై నధిరోహింప జేసి మథురకు గొనిపోవు చుండెను. మార్గమధ్యమున అక్రూరుడు సంధ్యావందనమునకై యమునానదీ జలమున స్నానమాచరించుచు వేద మంత్రములను జపించుచుండగ అచట బలరామ కృష్ణులను జూచి ఇట్లాలోచింప సాగెను. "వసుదేవుని పుత్రులగు బలరామకృష్ణులు రథమందే యున్నారు గదా! అయిన వారిపుడిచ్చట కెట్లు వచ్చిరి? మరి రథముపై లేరా!" అని సంశయించి లేచి రథమున గూర్చుండియున్న బలరామ కృష్ణులను చూచెను. "అయిన నీటియందు చూచుట మిథ్యయేనా" యని ఆలోచించి మరల నీటియందు ప్రవేశించి చూడగ సిద్ధ చారణ గంధర్వ అసురులచే స్తుతింపబడువాడు, సహస్రమస్తకుడు, ఫణికిరీటయుక్తుడు, నీలవసనుడు, మృణాల తుల్య శ్వేతవర్ణుడు, కైలాస పర్వతమువలె శోభిల్లు అనంతదేవుని దర్శించెను. ఆతని యొడిలోనున్న నీలనీరద శ్యాముడు, పట్టు పీతాంబరధారియు, చతుర్భుజుడు, పద్మాక్షుడునగు పురుషుని చూచెను.

"బృన్దావనం పరిత్యజ్య పాదమేకం నగచ్ఛామి" అని కృష్ణభగవానుడు చెప్పెను. అందువలన యశోదానందనుడగు కృష్ణుడు బృందావనమునందే ఉండెను. వసుదేవుడు గొనివచ్చిన కృష్ణుడు అక్రూరునితో మథురకు వెళ్ళెను.

**యజ్ఞ పత్నులను అనుగ్రహించిన స్థలము :-**

ఇది బృందావనమునుండి మథురకు పోవు మార్గమునందు కలదు. ఒకనాడు శ్రీకృష్ణుడు, గోపాలురు ఖాద్యములను ఏమియు వెంటతీసుకు వెళ్ళకుండగనే గోచారణమునకు వెడలెను. వారు యమునకు సమీపమున నున్న వనములో గోవులను మేపుచు కొంతసేపటికి క్షుధార్తులై బలరామ కృష్ణులను సమీపించి తమకు ఆకలి వేయుచున్నదని అన్నము కావలయునని ప్రార్థింప శ్రీకృష్ణుడు "ఇచటకు సమీపముననే బ్రాహ్మణులు యజ్ఞమును చేయుచున్నారు. మీరు అచటకు వెడలి మేమడగినట్లుగ వారిని యన్నమడుగు"డనెను. గోపాలురు అచటకు వెడలి వారికి నమస్కరించి దోసిలొగ్గి తాము కృష్ణ బలరాములు పంపగ వచ్చితిమని వారికి అన్నమిమ్మని పలికెను. బలరామకృష్ణుల మాహాత్మ్యమును తెలుపుచు ఆహారమడిగినను ఆవిప్రులు బలరామ కృష్ణులయందు సామాన్య మానవ బుద్ధిని కలిగి యున్నందున వారిని తిరస్కరించెను. గోపాలురు తిరిగిరాగా కృష్ణుడు వారిని మరల యజ్ఞపత్నుల కడకు పంపెను. యజ్ఞపత్నులు బలరామ కృష్ణులు క్షుధార్తులగ యున్నారని వినినంతనే నానావిధములగు అన్నాదులను పాత్రలయందుంచుకొని ఉత్సుకతో బలరామకృష్ణులకడకు వెడలి సమర్పించి భగవానుని అనుగ్రహమును పొందిరి. అనంతరము బ్రాహ్మణులు తమ పత్నులు కృష్ణానుగ్రహమును పొందిరని తలంచి వారికి ఆయనపైగల అలౌకిక భక్తిని స్మరించి పశ్చాత్తాప చిత్తులై తమను తాము నిందించుకొనిరి.

*కటకట మోసపోయితిమి కాంతల పాటియు బుద్ధిలేదు నేఁ*
*డట హరిఁ గానఁ బో నెఱుఁగ మేము దురాత్మల మేము కల్మషో*
*ద్భటులము విష్ణుదూరగుల ప్రాజ్ఞిత లేల తపంబులేల ప*
*ర్యటనము లేల శీలములు యాగములున్ మఱియేల కాల్పనే*

**(10-3 74)**

**సేవాకుంజము :-**

దీనినే నికుంజ వనమందురు. ఇచట శ్రీశ్రీరాధాగోవిందులయొక్క విహారము నిత్యము జరుగుచుండును. భగవానుడు విహరించిన ఆనాటి కుంజములు (పొదరిండ్లు) ఇప్పటికిని ఇచ్చట గలవు. సాయం కాలమునందు ఈవనమంతయు శుభ్రము

గావించి ఆలయ అర్చకులు వెలుపలికి వత్తురు. రాత్రులందచట ఎవ్వరు యుండుటకు వీలులేదు. వేకువ ఝామున దర్శించినచో ఆవనమందు రాధాకృష్ణ పదచిహ్నములు, వారు విహరించిన గురుతులు భాగ్యవంతులకు గోచరించు రాధాకృష్ణుల శయన మందిరమున అలంకరించిన పాన్పు నలిగియుండు అలంకారములు చెదరియుండుట, తాంబూలము నమలిన గుర్తు, లడ్డును ఆరగించి చిహ్నములు, దంతకాష్ఠము రెండుగ చీల్చబడి యుండుట మున్నగు దృష్టాంతము కనబడుచుండును.

ఇచ్చట లలితా కుండమున్నది. ఒకనాటి రాత్రి శ్రీరాధాకృష్ణులు సఖులతో గూ క్రీడించుచుండిరి. ప్రధాన సఖి యగు లలితకు తీవ్ర దప్పిక కలిగి శ్రీశ్యామసుందరుని "కృష్ణా! నాకు మిక్కిలి దాహమగుచున్నది. నీటిని త్రాగింపు" మనెను. అపుడు కృష్ణుడ ఇచటకు దగ్గరలోనే యమునానది ప్రవహించుచున్నది. అచటకు వెడలి స్వచ్ఛము శీతలమునగు జలమును పానము చేసి దాహమును పోగొట్టుకొను"మనెను. అం లలిత "నేను యమునకు వెడలలేను. ఇచటనే జలమునిమ్ము" అనగా లీలామయుడగ భగవంతుడు తన వంశీ ద్వారా భూమిని త్రవ్వగా భూగర్భమునుండి పవిత్రమగ గంగాధార పైకి వచ్చెను. అప్పుడు లలితాది సఖులందరూ కుతూహలముగ ఆ జలమును పానముచేసి తమ దప్పికను తీర్చుకొనిరి.

**నిధువనము :-**

శ్రీశ్రీరాధాకృష్ణులు నిరంతరము విహరించు స్థలము నిధువనము. ఈవనమునందు శ్రీకృష్ణుడు అలసట చెందిన రాధికకు పదసంవాహనము చేసెను. ప్రఖ్యాతినొందిన తాన్‌సేన్ యొక్క సంగీత గురువగు శ్రీహరిదాస్‌నకు ఇచ్చటనే "బంకెవిహారి" కృష్ణుడు దర్శనమిచ్చెను. శ్రీల శ్యామనంద ప్రభువు ప్రతిరోజు ఇచటి కుంజములను శుభ్రము చేయుచుండెను. ఒకనాటి ప్రాతఃకాలమున కుంజమును శుభ్రము చేయుచుండగ శ్రీరాధికయొక్క చరణ నూపురము ఒకటి దొరకెను. అతడా నూపురమును శిరమున ధరించి నుదుటిపై అద్దుకొనెను. అప్పుడాతని లలాటముపై నూపురాకృతిగల చిహ్నము ఏర్పడినది. అప్పటినుండి శ్యామానంద ప్రభువుయొక్క అనుయాయులు ఆ ఆకృతిలో తిలకధారణము చేయసాగిరి.

గావించి ఆలయ అర్చకులు వెలుపలికి వత్తురు. రాత్రులందచట ఎవ్వరునూ యుండుటకు వీలులేదు. వేకువ ఝామున దర్శించినచో ఆవనమందు రాధాకృష్ణుల పదచిహ్నములు, వారు విహరించిన గురుతులు భాగ్యవంతులకు గోచరించును. రాధాకృష్ణుల శయన మందిరమున అలంకరించిన పాన్పు నలిగియుండుట, అలంకారములు చెదరియుండుట, తాంబూలము నమలిన గుర్తు, లడ్డును ఆరగించిన చిహ్నములు, దంతకాష్ఠము రెండుగ చీల్చబడి యుండుట మున్నగు దృష్టాంతములు కనబడుచుండును.

ఇచ్చట లలితా కుండమున్నది. ఒకనాటి రాత్రి శ్రీరాధాకృష్ణులు సఖులతో గూడి క్రీడించుచుండిరి. ప్రధాన సఖి యగు లలితకు తీవ్ర దప్పిక కలిగి శ్రీశ్యామసుందరునితో "కృష్ణా! నాకు మిక్కిలి దాహమగుచున్నది. నీటిని త్రాగింపు" మనెను. అపుడు కృష్ణుడు ఇచటకు దగ్గరలోనే యమునానది ప్రవహించుచున్నది. అచటకు వెడలి స్వచ్ఛము, శీతలమునగు జలమును పానము చేసి దాహమును పోగొట్టుకొను"మనెను. అంత లలిత "నేను యమునకు వెడలలేను. ఇచటనే జలమునిమ్ము" అనగా లీలామయుడగు భగవంతుడు తన వంశీ ద్వారా భూమిని త్రవ్వగా భూగర్భమునుండి పవిత్రమగు గంగాధార పైకి వచ్చెను. అప్పుడు లలితాది సఖులందరూ కుతూహలముగ ఆ జలమును పానముచేసి తమ దప్పికను తీర్చుకొనిరి.

**నిధువనము :-**

శ్రీశ్రీరాధాకృష్ణులు నిరంతరము విహరించు స్థలము నిధువనము. ఈవనమునందు శ్రీకృష్ణుడు అలసట చెందిన రాధికకు పదసంవాహనము చేసెను. ప్రఖ్యాతినొందిన తాన్‌సేన్ యొక్క సంగీత గురవగు శ్రీహరిదాస్‌నకు ఇచ్చటనే "బంకెవిహారి" కృష్ణుడు దర్శనమిచ్చెను. శ్రీల శ్యామనంద ప్రభువు ప్రతిరోజు ఇచటి కుంజములను శుభ్రము చేయుచుండెను. ఒకనాటి ప్రాతఃకాలమున కుంజమును శుభ్రము చేయుచుండగ శ్రీరాధికయొక్క చరణ నూపురము ఒకటి దొరకెను. అతడా నూపురమును శిరమున ధరించి నుదుటిపై అద్దుకొనెను. అప్పుడాతని లలాటముపై నూపురాకృతిగల చిహ్నము ఏర్పడినది. అప్పటినుండి శ్యామానంద ప్రభువుయొక్క అనుయాయులు ఆ ఆకృతిలో తిలకధారణము చేయసాగిరి.

--0--

# 12. బృందావనములో గోస్వాములు

## శ్రీల మధవేంద్రపురి

శ్రీకృష్ణ ప్రేమయను కల్పవృక్షమునకు మూలము శ్రీల మాధవేంద్రపురి పాదులు. గోపాలోపాసనచే కృష్ణుని సాక్షాద్దర్శనము నొందిన కృష్ణ భక్త శిరోమణి. వీరు శ్రీ కృష్ణచైతన్య మహాప్రభువునకు పరమగురువు. శ్రీమన్నిత్యానంద ప్రభువు, శ్రీల అద్వైతాచార్యులు, శ్రీల ఈశ్వరపురీపాదులు వీరి ప్రధాన శిష్యులు. శ్రీల మాధవేంద్రపురి పాదులు తీర్థయాత్రలు చేయుచు కృష్ణ ప్రేమకు నిధియైన శ్రీబృందావన ధామమునకు వచ్చిరి. శ్రీకృష్ణుని లీలాస్థలములను దర్శించుచు శ్రీగోవర్ధన పర్వతము కడకు ఏతెంచి ప్రేమావేశముతో నృత్యము చేయుచు గోవర్ధన పరిక్రమ చేసి గోవింద కుండమందు స్నానమాచరించి తీరమునందలి వృక్షము క్రింద కూర్చుండి ధ్యానించుచుండెను. అట్టి సమయములో అయాచిత వృత్తితో జీవితమును గడుపుచున్న ఈ మహనీయుని కడుకు ఒక గోపబాలకుడు వచ్చి దుగ్ధభాండమును ఇచ్చి ఇట్లు పలికెను. "అయ్యా! ఈ గ్రామములో నున్నవారు భోజనము చేయకుండ ఉండరాదు. ఇచటకు మంచినీటికి వచ్చిన స్త్రీలు నీవు భోజనము చేయుకుండుటను గమనించి నీ కొరకు పాలను నాకిచ్చిపంపిరి. నీవు పాలను త్రాగి భాండమును నీ వద్దనే ఉంచుము. అందరికి పాలిచ్చి సాయంకాలము వచ్చి తీసుకొని వెళ్ళెదను" అని చెప్పెను.

మాధవేంద్రపురి ఆ పాలు త్రాగగా అవి అమృతము వలె నుండెను. ఆ గోపబాలకుడు గోపాలమూర్తియే కావచ్చునని తలంచి ఆతని కొరకు ఎదురుచూచుచు హరినామ సంకీర్తనము చేయుచుండెను. ఇట్లు వేకువ ఝాము కాగా ఆతనికి నిద్ర వచ్చెను. అపుడు స్వప్నమున గోపాలుడుదర్శనమిచ్చి ఒక పొదకడకు గొనిపోయి ఇట్లనెను. "మాధవా! నేను గోపాలకృష్ణుడను. నన్ను వజ్రుడు ప్రతిష్ఠించెను. మహమ్మదీయులు మందిరములపై దాడులు చేయుచుండగ నా అర్చకులు భయపడి నన్ను ఈ పొదయందు దాచి పారిపోయిరి. అప్పటి నుండియు నిత్యసేవ లేక ఎండలకు, వానలకు గురియై యున్నాను. గ్రామ ప్రజల సహాయముతో నన్ను పునఃప్రతిష్ఠించి నా సేవను ప్రకాశము చేయుము. ఎంతో కాలము నుండి నీ రాకకు ఎదురుచూచుచున్నాను".

శ్రీకృష్ణునియొక్క అట్టిస్థితికి మాధవేంద్రపురి ఎంతయో దుఃఖించి మరునాటి ఉదయము గ్రామప్రజల సహాయముతో ఆ గోపాలమూర్తిని వెలికి తీసి గోవర్ధన పర్వతముపై రాతి సింహాసనమున ప్రతిష్ఠించి బిందెలతో నీళ్ళు తెచ్చి మహాభిషేకమును చేసెను. మాధవేంద్రపురి స్వయముగ కృష్ణునకు షోడశోపచార పూజచేసి, హారతులిచ్చెను.

గోపాలుర ఇండ్లలోని పాలు, పెరుగు, వెన్న, నేయిలను తెచ్చిరి. అన్నకూట ఉత్సవమువలె పెద్దఎత్తున పలువిధములైన నైవేద్యములను శ్రీకృష్ణునకు సమర్పించిరి. ఆ సమయములో శ్రీకృష్ణుడు నివేదనమును ఆరగించుటను శ్రీలమాధవేంద్ర పురిపాదులు సాక్షాత్తుగ దర్శించిరి.

ఈవిధముగ ఒక సంవత్సర కాలము జరగినది. పూర్వము ద్వాపరయుగములో గోవర్ధన పూజా కాలమందలి అన్నకూటముతో సమానముగ వీరు ఇపుడర్పించెడి నివేదన పదార్థసమూహములుండెను. శ్రీకృష్ణుని సేవకు వ్రజవాసులు పదివేల ఆవులను సమర్పించెను. మధురావాసి యగు ఒక ధనికుడు కృష్ణునకు దేవాలయము కట్టించెను. భగవత్కైంకర్యమును వైరాగ్యవృత్తి కలిగిన యోగ్యులగు బ్రాహ్మణులకు అప్పగించి మాధవేంద్రపురి యథాప్రకారము భజనచేయుచుండిరి. ఇట్లు కొంతకాలము గడువగ మరల గోపాలుడు మాధవేంద్రపురి స్వప్నములో దర్శనమిచ్చి "నాతాపము ఉపశమించుటకు పురుషోత్తమ క్షేత్రమునకు వెడలి మలయజ చందనము తీసుకొని రమ్ము" అని ఆజ్ఞాపించెను.

గోపాలుని ఆదేశానుసారము శ్రీలమాధవేంద్రపురి మలయజ చందనము గూర్చి దక్షిణదేశమునకు బయలుదేరెను. మార్గమధ్యములో ' రేముణ' అనుగ్రామమందున్న గోపీనాథుని దర్శించి ప్రేమానందముతో నృత్యసంకీర్తన చేసెను. అతనికొరకు గోపీనాథుడు తనకు నివేదించిన క్షీరమును దొంగిలించి అర్చకుని ద్వారా మాధవేంద్రపురికి అందించెను. కావున అప్పటినుండి ఆగోపీనాథుని ' క్షీరచోరగోపీనాథ్' అనుచున్నారు. అనంతరము మాధవేంద్రపురి పూరీక్షేత్రమునకు చేరుకొనగా గజపతి మహారాజు ఆతని తేజస్సును, ప్రభావమును తెలిసికొని కావలసిన మలయజచందనమును, పచ్చకర్పూరమును, మోయుటకు సేవకులను ఇచ్చి పంపెను. వానితో మాధవేంద్రపురి బృందావనమునకు ప్రయాణమై రేముణ చేరగా అచట గోపాలుడు మరల స్వప్నమున దర్శనమిచ్చి "మాధవా! చందనమును గోపీనాథునకు పూసినచో నాతాపము ఉపశమించును. నీవు శ్రమపడి బృందావనమునకు తీసికొని రావలసిన యవసరము లేదు" అని చెప్పెను. గోపాలుని ఆజ్ఞానుసారము మాధవేంద్రపురి ఆచందనమును గోపీనాథునకు వినియోగించెను. భక్తుల కైంకర్యమును భగవానుడే స్వయముగ స్వీకరించును.

వ్రజమండలములనందలి శ్రీ గోపాలుని దేవాలయము ప్రపంచవిఖ్యాతినొందినది. వ్రజవాసులాతనిని రాజలాంఛనములతో సేవించుచుండిరి. ఔరంగజేబు హిందూ దేవాలయములను ధ్వంసము చేయుచుండగ అర్చకులు ఈ గోపాలమూర్తిని గుజరాత్‌లోని 'నాథద్వార్'కు తీసుకొని వెళ్ళిరి. అచ్చట గోపాలుడు శ్రీనాథ్‌జీ అనునామముతో పదివేల ధేనువులు, పదివేల సేవకులచే నిత్యము సేవింపబడుచున్నాడు.

# శ్రీ చైతన్యమహాప్రభువు

కలియుగ పావనావతారి, శ్రీశ్రీరాధాకృష్ణ మిళిత తనువు అయిన శ్రీకృష్ణ చైతన్య మహాప్రభువు పశ్చిమ వంగ రాష్ట్రాంతర్గతమగు శ్రీధామ మాయాపురమునందు అవిర్భవించి తన 24వ ఏట సన్యాసమును స్వీకరించి శ్రీపూరీ జగన్నాథక్షేత్రమునకు విచ్చేసిరి. అచట నుండి దక్షిణ భారత దేశమును దర్శించి కృష్ణప్రేమలో ముంచెత్తిరి. అనంతరము బలభద్ర భట్టాచార్యునితో ఝూరీఖండ మార్గముగుండా ప్రయాణము చేయుచు అరణ్యములో నున్న పులులు, సింహములు, ఏనుగుల చేత కృష్ణనామమును పలికించి నృత్యము చేయించిరి. మహాప్రభువు యొక్క దర్శనముచే నెమళ్ళు పురివిప్పి నాట్యము చేసినవి. లేళ్ళు మహాప్రభువును ప్రీతితో నిర్భయముగ నాకుతు ఆడినవి. ఖాద్యఖాదక సంబంధము కలిగిన వ్యాఘ్ర హరిణములు తమ ప్రవృత్తిని మరచి కృష్ణప్రేమలో మత్తులై మహాప్రభువుతో కలసి నృత్యము చేసినవి. ఇట్లు ప్రాణులన్నిటికి కృష్ణప్రేమను దానము చేయుచు మహాప్రభువు కాశీ, ప్రయాగల మీదుగ మథురా పట్టణమును చేరుకొనెను.

శ్రీమన్మహాప్రభువు మథురా పట్టణమును చేరినంతనే ప్రేమావిష్టుడై విశ్రామ తీర్ధమునందు స్నానమాచరించి శ్రీకృష్ణ జన్మస్థానమును, ఆదికేశవ స్వామిని దర్శించి ప్రేమావేశముతో నృత్యసంకీర్తనము చేసిరి. అచట శ్రీల మాధవేంద్రపురీ పాదుల శిష్యుడైన "సనోడియా విప్రుడు" అనెడి విశ్వబ్రాహ్మణుని కృష్ణ ప్రేమావేశమును జూచి అతనిని అనుగ్రహించెను. అతడు మహాప్రభువునకు భిక్షను ఇచ్చి వ్రజమండలమందలి శ్రీకృష్ణలీలా స్థలములను దర్శింపజేసెను. శ్రీమన్మహాప్రభువు మథురలోని యమునా నదియొక్క ఇరువది నాలుగు ఘట్టములందు స్నానమాచరించెను. అనంతరము ప్రేమావిష్టుడై ద్వాదశ వనములను దర్శించునపుడు వనములలోని పక్షులు, భ్రమరములు, వృక్షములు, లతలు, హరిణులు, ధేనువులు సాదరముతో తమ ప్రభువుకు అభ్యర్ధనమును తెలిపినవి. శ్రీమన్మహాప్రభువు కూడ వారిని ప్రేమావేశముతో స్పృశించి కృష్ణనామ సంకీర్తనము చేయించుచూ సర్వత్ర పరిభ్రమణము చేయుచు ఆరిట అనుగ్రామమును చేరిరి. అచ్చటి గ్రామ ప్రజలను శ్రీరాధాకుండ శ్యామకుండముల గూర్చి అడుగగ ఎవరునూ చెప్పలేకపోయిరి. సర్వజ్ఞుడగు శ్రీచైతన్యమహాప్రభు ఆ కుండములు లుప్తమై ధాన్యక్షేత్రములుగ మారుట గాంచి అచటి స్వల్పజలములో స్నానమాచరించి ప్రేమావేశముతో రాధాకుండమును స్తుతించి, అందలి మట్టిని తిలకముగ ధరించెను. అనంతరము గోవర్ధనగిరిని దర్శించి ప్రేమావిష్టులై గోవర్ధన శిలను ఆలింగనము చేసికొని ప్రేమోన్మత్తులై గోవర్ధన పట్టణము చేరిరి. అచట నున్న సత్యయుగము నాటి

శ్రీహరిదేవుని దర్శించి నృత్యసంకీర్తనము గావించి పలువిధముల స్తుతించిరి. మహాప్రభువు యొక్క అలౌకికమగు సౌందర్యము, నృత్యసంకీర్తనములనుగాంచి హరిదేవుని సేవకులు సత్కరించిరి. మహాప్రభువు ఆ రాత్రి అచటనే యుండి "నేను గోవర్ధన పర్వతమును ఎన్నడును అధిరోహించను. పై నున్న గోపాలుని దర్శనమెట్లు కలుగును?" అని ఆలోచింపసాగిరి. ఆ రాత్రి గోపాలుని సేవకులకు గ్రామప్రజలకు "రేపు మ్లేచ్ఛులు మీ గ్రామముపై దాడి చేయుదురు" అను వార్త తెలియగ వారు వెంటనే గోపాలుని "గాఠూలీ" అను గ్రామమందలి ఒక విప్రుని గృహములో యుంచి సేవింపసాగిరి. మరునాడు గోవర్ధన పరిక్రమ చేయుచు మహాప్రభువీ వార్తను విని ఆనందముతో ఆ గ్రామమున కేగి గోపాలుని దర్శించి అత్యంతానందమునొందిరి. అనంతరము నందగ్రామమునకు వెడలి అచట శ్రీనందమహారాజు, శ్రీయశోదాదేవిలను వారి నడుమ త్రిభంగభంగిమ రూపముతో నున్న మురళీధర శ్యామసుందరుని దర్శించి ప్రేమావేశముతో ఉద్దండ నృత్యము చేసిరి.

శ్రీ చైతన్య మహాప్రభువు బృందావనము చేరి కాళీయహ్రదములో స్నానమాచరించి ద్వాదశాదిత్యటీల, కేశీతీర్థము, రాసస్థలి, అక్రూరఘాట్, చీర్‌ఘాట్‌లను దర్శించి ఇమ్లితల కడ యమునానది బృందావనముల శోభను దర్శించి ప్రేమానందముతో ఒకింత విశ్రమించిరి. అచట కృష్ణదాసుడను నొక వైష్ణవుడు మహాప్రభువుయొక్క ప్రేమను చూచి ఆశ్చర్యపడి మహాప్రభుని పాదములకు నమస్కరించెను. మహాప్రభువు అతనిని కృష్ణభక్తుడుగ గుర్తించి ఆలింగనము చేసికొనగా ఇరువురు ప్రేమావేశముతో నృత్యసంకీర్తనము చేసిరి.

ఒకనాటి ప్రాతఃకాలమున కొందరు భక్తులు మహాప్రభుని పాదములకు నమస్కరించి బృందావనమందు కృష్ణుడు మరల ప్రకటమై లీలలు చేయుచున్నాడనియు, రాత్రి కృష్ణుడు కాళీయ దహలో కాళీయుని శిరముపై నృత్యము చేయుచున్నాడనియు, కాళీయుని శిరమున రత్నము ప్రకాశించుటను కూడ చూచితిమి, ఇందు సందేహములేదని తెలిపిరి. ఇట్లు మూడు రాత్రులు జరిగెను. ప్రజలు తండోపతండములుగ వచ్చి దర్శించుచుండిరి. మహాప్రభుని సేవకుడగు బలభద్ర భట్టాచార్యుడు కృష్ణదర్శనమునకై ప్రభుని ఆజ్ఞను వేడగా మహాప్రభువాతని వీపుపై చరచి "పండితుడవై యుండి మూర్ఖుని వలె ప్రవర్తించెదవేమి? కలియుగములో కృష్ణుడిట్లు దర్శనమిచ్చునా? మూర్ఖులు భ్రమతో కోలాహలముగ చేయునవి నిజమని నమ్మక స్థిరముగా నుండుము" అని హెచ్చరించెను. మరునాటి ప్రాతఃకాలమున విజ్ఞులు మహాప్రభుని కడకురాగా ప్రభువు

"మీరు కాళీయహ్రదమున కృష్ణుని చూచితిరా?" అని అడగెను. అపుడు వారు " ఇది భ్రమ మాత్రమే. జాలరివాడు దీపసహాయముతో నౌకపై చేపలు పట్టుచుండుట చూచి నౌకను కాళీయునిగను, దీపమును రత్నముగను, జాలరివానిని కృష్ణునిగను భ్రమపడిరి. అంతియే"అనిరి. వారు మహాప్రభువును కృష్ణునిగా గుర్తించి నమస్కరించిరి.

ఇట్లు కొన్ని దినములు అక్రూర తీర్థమందు వసించి మహాప్రభువు నీలాచలమునకు వెడలిరి. శ్రీమన్మహాప్రభువు తన అనుయాయులకు ఇట్లు ఉపదేశించిరి. "బృందావనము వెళ్ళి దర్శనము చేసికొనుము. కాని ఎక్కువ కాలము అచట ఉండవలదు. వ్రజవాసుల ఆచార వ్యవహారములను గూర్చి విమర్శించవలదు. గోవర్ధన పరిక్రమ చేయుడు. గోపాలుని దర్శించుటకు గోవర్ధన పర్వతమును ఎక్కరాదు, గోవర్ధనము సాక్షాత్తు శ్రీ కృష్ణుడు. శ్రీరూగోస్వామి, శ్రీసనాతన గోస్వాములను మహా ప్రభువు బృందావనమునకు పంపి వారిపై నాలుగు కార్యముల భారమునుంచెను. అవి (1) లుప్తములయిన శ్రీ కృష్ణుని లీలాస్థలములనుద్ధరించుట, (2) శ్రీవిగ్రహ సేవా ప్రకాశము, (3) శుద్ధ భక్తి గ్రంథములను రచించుట, (4) భక్తి సదాచారములను ప్రచారము చేయుట. మహా ప్రభువు ఆదేశమునను సరించి షడ్గోస్వాములు ఆపనులను నిర్వర్తించిరి.

## శ్రీలసనాతన గోస్వామి

శ్రీమన్మహాప్రభువు పార్షదులగు షడ్గోస్వాములలో ఒకరైన శ్రీల సనాతన గోస్వామి ద్వాదశ వనములతో కూడిన బృందావనములో ఒక్కొక్క రోజు ఒక్కొక్క వనములో భ్రమణము చేయుచుండెడివారు. విశేషముగ గోవర్ధనములోని మానసగంగ కడ నందగ్రామములోని పావనసరోవరము వద్ద ఎక్కువగా ఉండెడివారు. ఇచ్చట వీరి భజన కుటీరములు గలవు. రోజులోని ఇరువది నాలుగు గంటలలోను దాదాపు ఇరువది రెండున్నర గంటలు వీరు భగవద్భజనమందు నిమగ్నమైయుండెడి వారు. తన భజన కాలములో వీరు ఎన్నియో అనుభూతులనొందిరి.

శ్రీల సనాతన గోస్వామి మహావనములో భజన చేయునప్పుడు యమునా పులినము నందు శ్రీమదనగోపాలుడు గోపబాలురతో ఆడుకొనుచుండుటను సాక్షాత్తుగా దర్శించెను. అతని దృష్టిని మనస్సును శ్రీమదన గోపాలుడు ఆకర్షించెను. సనాతన గోస్వామి మదన గోపాలుని పట్టుకొనుటకు వెడలగ గోపాలుడు పరువెత్తుచు దొరికినట్లు నటించి మరల పరువెత్తుచు చివరకు "ద్వాదశాదిత్యటీల" కడకు వెడలి అచట శ్రీమూర్తి రూపము ధరించెను. సనాతనునకు స్వప్నములో "నేను మదనమోహనుడను.

గోకుల మహావనమునుండి నీ సేవను గ్రహించి నీకుటీరమునందుండుటకు ఇష్టపడి వచ్చితిని. నేను వచ్చిన మార్గమంతయు నా లీలా ప్రదేశములతో నిండియున్నది. కావున నీవు నా లీలాస్థలములను, నా సేవను ప్రకాశము చేయుము" అని ఆదేశించెను. సనాతనుడు ద్వాదశాదిత్యటీలపై ఒక చిన్న కుటీరము నేర్పరచి శ్రీమదన మోహనుని అచట ఉంచి సేవించుచుండెను. సనాతనుడు ప్రతిదినము భిక్షలో గోధుమపిండిని తెచ్చి దానితో లవణ విహీనముగ దళసరి రొట్టెను చేసి మదనగోపాలున కర్పించి, ప్రసాదమును స్వీకరించి భజనచేయుచుండెను. ఒకనాడుమదనమోహనుడు సనాతన గోస్వామిని ఉప్పు అడుగగా, "నేను ఉదాసీన వైరాగిని. నీకొరకు నేనెవరిని లవణమడిగెదను; ఈ రోజు లవణము, రేపు పాలు పెరుగు తెమ్మనెదవు" అనిన మదనమోహనుడు నవ్వుచు "నేను ఏర్పాటుచేసిన నీ కభ్యంతరామా? " అనెను. అప్పుడు సనాతనుడు సరియే, నేను వండిపెట్టెద ననెను. కృష్ణదాసుడను నౌక వర్తకుడు నౌకలో సరకులను మథురాపట్టణములో విక్రయించుకొనుటకు యమునానది పై వెడలుచుండగ ద్వాదశాదిత్యటీల సమీపమున ఇసుకలో అడ్డుకుపోయెను. ఎంతప్రయత్నించిననూ కదులదాయెను. అపుడు మదనమోహనుడు గొల్లవాని రూపమున అచటకేతెంచి "ఎదురుగనున్నటీలపై సనాతనుడను నౌక మహాత్ముడు నివసించుచున్నాడు. అతనిని దర్శించిన నీ నౌక సురక్షితముగ గమ్యమును చేరగలదు " అని చెప్పి వెడలిపోయెను. వెంటనే అతడు సనాతనునికడకేగి జరగిన విషయము తెలుపగ మదనమోహనుని చతురతను తెలిసికొని కుటీరముననున్న మదనమోహనుని దర్శించి ఆయనను ప్రార్థింపమనగా వర్తకుడట్లు చేసెను. అతని సేవకులు వచ్చి నౌక కదలినదని సంతోషముతో చెప్పగ అందరు వెడలిపోయిరి. అతడు ఆ సరకులపై వచ్చిన లాభముతో మదనమోహనునకు విశాలమగు శ్రీమందిరమును, అన్ని విధములగు సేవలకు కావలసిన ఏర్పాట్లు చేసెను.

అనంతరము పూరీ జగన్నాథక్షేత్రము యొక్క మహారాజగు ప్రతాపరుద్ర గజపతి యొక్క కుమారుడు పురుషోత్తమ గజపతి, మనోహరమగు శ్రీరాధా మరియు శ్రీలలితాసఖిల యొక్క శ్రీమూర్తులను బృందావనమునకు పంపెను. వీరిలో శ్రీరాధాదేవి మదనమోహనునకు ఎడమవైపునను, శ్రీలలితాసఖి కుడివైపునను విరాజిల్లుచు సేవలను స్వీకరించుచున్నారు.

శ్రీల సనాతనగోస్వామి బృహద్భాగవతామృతము, హరిభక్తి విలాసము, శ్రీకృష్ణలీలాస్తవము, శ్రీమద్భాగవత దశమస్కంధమునకు వైష్ణవతోషణియను టీకా మున్నగు గ్రంథములను రచించిరి. వీరు ఒక గ్రంథమును సవరణ చేయుచున్న

సమయములో శ్రీమతి రాధిక జడను సర్పముతో పోల్చబడియుండుటను చూచి అది సరికాదని ఆలోచించుచుండెను. కొంతసేపటికి గోవర్ధన తీరమందు కొందరు గోపకుమారికలు ఆడుకొనుచుండుటను చూచెను. వారిలో సర్వాంగ సుందరియగు నొక కన్య (రాధిక) శిరస్సునందు సర్పము వ్రేలాడుచుండుటను దర్శించెను. ఇట్లు శ్రీమతి రాధికయే తన చెలికత్తెలతో ఆడుచు శ్రీల సనాతన గోస్వామికి కలగిన ఆ సందేహమును నివృత్తి చేసెను. పరమపవిత్రమగు బృందావనములో శ్రీల సనాతన గోస్వామి రాధాకృష్ణుల దివ్యలీల నెన్నిటినో దర్శించెను. వీరు పారమార్థిక రంగములోనే గాక సమాజము యొక్క నైతికోన్నతికి కూడ ఎంతయో కృషిచేసిరి. వ్రజవాసులందరు వీరి పారమార్థిక నిష్ఠను గుర్తించి "బాబా" (తండ్రి) అని గౌరవించెడివారు. ఆషాఢ పూర్ణిమ తిథినాడు శ్రీల సనాతన గోస్వామి దివ్యమగు గోలోకధామమును చేరిరి. ఆ తిథినాడు వ్రజమండలములోని వారందరు తమ స్వంత తండ్రి మరణించినట్లే భావించి మస్తకముండనము గావించుకొని, ఆశౌచమునాచరించి వీరి ఆత్మశాంతి కొరకు గోవర్ధన పరిక్రమ చేసి భక్తులకు మహాప్రసాదమును వితరణము చేసిరి. ఆషాఢ పూర్ణిమను గురుపూర్ణిమ అనియు ముడయా పూర్ణిమ అనియూ పిలచెదరు. శయన ఏకాదశి నుండి గురుపూర్ణిమ వరకు బృందావనము, రాజస్థాన్, హర్యానా, పంజాబ్, ఉత్తరప్రదేశ్‌ల నుండి సుమారు అరువది లక్షలమంది గోవర్ధన పరిక్రమ చేయుదురు. పరిక్రమ చేయువారందరికి వ్రజవాసులే అన్నదానము చేయుదురు.అనాటినుండి ఇది ఒక ఆచారముగ అయినది. దీనిని బట్టి శ్రీలసనాతన గోస్వామి వారి యొక్క నిష్ఠ ఎంతటిదో తెలియుచున్నది.

## శ్రీల రూప గోస్వామి

శ్రీల రూపగోస్వామి శ్రీచైతన్యమహాప్రభువుల పూర్ణానుగ్రహమును పొందిన మహనీయులు, సనాతన గోస్వామికి సోదరులు. శ్రీచైతన్యమహాప్రభువులు తమ పార్షదులకు ఆదేశించిన విధముగ వీరు లుప్త తీర్థములను ఉద్ధరించుట, శ్రీ విగ్రహసేవా ప్రకాశము, భక్తి సదాచారమును ప్రచారము చేయుట, శుద్ధభక్తి గ్రంథములను రచించుట యను చతుర్విధ కార్యములను నెరవేర్చిరి. కృష్ణ భక్తిని,కృష్ణ లీలారహస్యములను తెలుపు అమూల్యగ్రంథములగు శ్రీలలితమాధవము, శ్రీవిదగ్ధమాధవము, ఉజ్వలనీలమణి, భక్తిరసామృత సింధువు, దానకేళికౌముది, శ్రీ లఘు భాగవతామృతము, ఉపదేశామృతము మున్నగు గ్రంథముల నెన్నిటినో రచించి ఆధ్యాత్మిక ప్రపంచమునకు అందించిరి. వీరి ఋణమును ఎవరును తీర్చలేరు. తీవ్ర వైరాగ్యముతో దినమునకు ఒక వృక్షము క్రింద నివసించుచు రోజంతయు

భగవత్సేవలోను, గ్రంథరచనయందును, నామసంకీర్తనమందును గడపెడివారు. తమ కొరకు ఎట్టి ఆశ్రమమును ఏర్పరచుకొనలేదు. ఒకనాడు కృష్ణునకు పాయసమును నివేదింపవలయుననెడి కోరిక వీరికి కలిగెను. కొన్ని క్షణములకే అపురూప సౌందర్యము కలగిన ఒక వ్రజబాలిక వచ్చి రూపగోస్వామికి కావలసిన సామగ్రిని ఇచ్చెను. ఆనందముతో పాయసమును వండి కృష్ణునకు నివేదించి ప్రసాదమును శ్రీల సనాతన గోస్వామికి ఇచ్చెను. వారు ప్రసాదమును అస్వాదించుచు ఈ పాయసము ఈ ప్రపంచవస్తువుకాదు. ఎచ్చట లభించినదని అడుగగా జరిగిన విషయమును రూపగోస్వామివారు విన్నవించిరి. అంత సనాతన గోస్వామి నీవు శ్రీమతి రాధికను కష్టపెట్టితివి, ఆ వచ్చిన వ్రజబాలిక సాక్షాత్తు శ్రీమతి రాధిక అని చెప్పి విలపింప సాగిరి. రూపగోస్వామి పశ్చాత్తాపముతో 'ఓ రాధికా, నిన్ను ఎంత కష్టపెట్టితిని' యని ఏడ్చుచు క్షమింప వేడుకొనిరి.

షడ్గోస్వాములలో శ్రీరూపగోస్వామి ప్రప్రథమముగ శ్రీచైతన్య మహాప్రభువుని ఆశ్రయించి వారి కృపాకటాక్షములనొంది, వారి మనోభావములను తెలిసికొని గ్రంథ రూపముగ ప్రకాశము చేసిరి. వీరు గౌడీయవైష్ణవులకు ఆది. వీరిని అనుసరించుచున్న గౌడీయ వైష్ణవ సంప్రదాయమును 'రూపానుగ సంప్రదాయము'ని అందురు.

శ్రీరూపగోస్వాముల వారు శ్రీచైతన్యమహాప్రభువులు ఆదేశించిన కార్యములలో లుప్త తీర్థ ఉద్ధారము, శ్రీవిగ్రహసేవ ప్రకాశము అను కార్యములు జరుగుట లేదని దుఃఖితుడైయుండెను. శ్రీగోవిందుని కొరకు ప్రతివనము, ప్రతి గృహము వెదకి వెదకి వేసారిపోయెను. ఒకనాడు యమునా తటమునందు విషణ్ణ హృదయముతో చింతాక్రాంతుడై కూర్చొని యుండెను. అపుడు స్వల్పవయస్సు కలగిన సుందర రూపముతో నున్న వ్రజబాలకుడు వచ్చి రూపగోస్వామి అట్లు విచారముగ యుండుటకు కారణము అడిగి తెలిసికొనెను. అతడు మధురవచనములతో అచటకు దగ్గరలో 'గోమాటీల'యను ఒక ఎత్తైన ప్రదేశము (మట్టిదిబ్బ) కలదనియు, అచట ప్రతిరోజు ఉదయమున కపిలధేనువు వచ్చి క్షీరమును వర్షించుననియు చెప్పి ఆ స్థలమును చూపి బాలకుడు అదృశ్యుడయ్యెను. శ్రీకృష్ణుడే ఆ వ్రజవాసి రూపములో వచ్చి తాను ఉన్నతావును చూపెను. పరమభాగవతోత్తముల సేవనే భగవానుడు స్వీకరించును. ఎచట భగవదారాధన సక్రమముగ జరుగదో అచట శ్రీమూర్తి గూడ అంతర్ధానమగును. ఉత్తమ భాగవతుడు లభించినపుడు భగవానుడు స్వయముగ ప్రకాశమగును. వ్రజబాలకుడు చూపిన ఆ గోమాటీల కడ యోగమాయాదేవి యున్నది. అందువలన ఆ స్థలమును మహాయోగపీఠమందురు. వ్రజబాలకుని మధుర వాక్కులకు పరవశించిన శ్రీ రూపగోస్వామి వ్రజవాసుల సహాయమున గోమాటీలను త్రవ్వి చూడగ అద్భుతమగు



శ్రీశ్రీరాధా మదనమోహనజీ దేవాలయము, బృందావనము.



శ్రీశ్రీరాధా గోవిందజీ దేవాలయము, బృందావనము.

కోటి చంద్రకాంతితో కూడిన త్రిభంగ భంగిమ రూపముతోనున్న గోవిందుడు దర్శనమిచ్చెను.

ఒక సింహాసనముపై శ్రీగోవిందుని స్థాపించి అభిషేకాదుల ద్వారా స్వయముగ సేవించుచుండెను. శ్రీల జీవగోస్వామివారి ప్రచేష్టవలన అతి ఉచ్చమగు శిఖరము కలిగిన ఏడు అంతస్థులతోనున్న రమణీయమగు మందిరము నిర్మింపబడెను. అనంతరము ఒరిస్సానుండి శ్రీరాధాదేవి మూర్తి వచ్చి శ్రీ గోవిందునకు వామపార్శ్వమున విరాజిల్లుచుండెను. దక్షిణదేశవాసియగు వృషభానుడను ఒక బ్రాహ్మణవైష్ణవుడు ప్రీతితో శ్రీరాధాదేవి శ్రీమూర్తిని సేవించుచుండెను. అతని అనంతరము ఆ గ్రామవాసులు శ్రీరాధాదేవిని సేవించుచుండిరి. తరువాతి కాలములో ఆ మూర్తిని ఒరిస్సారాజైన ప్రతాపరుద్రుని కడకు పంపగా జగన్నాథ దేవుని వామభాగమున నుంచి సేవకులు లక్ష్మీదేవి యనుకొని పూజింపసాగిరి. బృందావనమందు శ్రీగోవిందుడు ప్రకటముకాగా ఇచట శ్రీరాధాదేవి ప్రతాపరుద్రునకు స్వప్నమున తనను బృందావనమునందలి గోవిందుని కడకు కొనిపొమ్మని ఆదేశించెను. ఆమె ఆదేశముననుసరించి శ్రీరాధాదేవి మూర్తిని బృందావనమునందలి గోవిందునికి వామపార్శ్వమున ప్రతిష్ఠించిరి. ఈ శ్రీశ్రీరాధాగోవిందులు గౌడీయవైష్ణవుల అభిధేయ దేవత.

## శ్రీల జీవగోస్వామి

శ్రీరూపానుగ సంప్రదాయమునకు ప్రథమ ఆచార్యులు శ్రీల జీవగోస్వామి. శ్రీల రూపగోస్వామి శ్రీల సనాతన గోస్వాముల వారి సోదర పుత్రుడు. వీరు స్వతః సిద్ధ పండితులు. బాల్యముననే వ్యాకరణ కావ్యాలంకారాది శాస్త్రములను అధ్యయనము చేసిరి. వీరి పాండిత్యముతో సమానమగు పండితులు ఇంతవరకు జన్మించలేదు, జన్మింపబోరుయని ప్రముఖ పండితుల అభిప్రాయము. బృందావనము నందు నివసించుచు గురువగు శ్రీల రూపగోస్వామి కడ నుండి వారు అనుగ్రహముతో ప్రసాదించిన శ్రీరాధాదామోదరుల యొక్క సేవ చేయుచుండెడివారు. శ్రీశ్రీ రూపసనాతనులు తాము రచించిన గ్రంథముల యందలి లోపములను నవరించు బాధ్యత వీరికిచ్చిరి.

ఒకరోజు బృందావనమునందు విఖ్యాతినొందిన శ్రీల రూపగోస్వామిని జయించి తనపాండిత్యమును స్థాపించుకొనుటకు ఒక దిగ్విజయ పండితుడు వచ్చెను. అతడు శ్రీల రూపగోస్వామిని తనతో వాదింపుడనియు లేనిచో జయపత్రమును వ్రాసి యిమ్మని కోరెను. ఆ సమయమున శ్రీజీవగోస్వామి స్నానమునకు వెడలిరి. తృణము

కంటె హీనుడనను దైన్యభావన కలిగిన స్వాభావిక వైష్ణవులగు శ్రీల రూపగోస్వామి తన హరిభజనకే సమయము లేదు, ఇక ఈతనితో వృధాతర్కమునకు తావీయకూడదని తలంచి జయపత్రమును వ్రాసి యిచ్చిరి. ఆ దిగ్విజయ పండితుడు ఉత్సాహము, అహంకారములతో తాను పండితాగ్రేసరుడగు శ్రీరూపగోస్వామిని జయించి జయపత్రమునొందితినని బృందావనమంతయు చాటించుచు వెడలుచుండెను. ఈ వార్తను శ్రీలజీవగోస్వామి తెలిసికొని చింతాక్రాంతులై "నా గురుదేవులు తృణము కంటె హీనుడనను దైన్యభావన కలవారు. కావున వీరికి జయపత్రమును ఇచ్చిరి. దీని వలన గురుదేవులు రచించిన ఉజ్వల భక్తి రసగ్రంథముల భవిష్యత్ ప్రచారమునకు ఆటంకము కలిగి, శ్రీచైతన్యమహాప్రభువుల సిద్ధాంతము ప్రచారము కాదు" అని దీర్ఘముగా ఆలోచించి దిగ్విజయ పండితుని పిలచి ఇట్లు చెప్పిరి " మాగురువర్యులు తృణము కంటె హీనుడనను స్వభావము గలవారు. కావున మీకు జయపత్రమును వ్రాసియిచ్చిరి, అంతమాత్రమున మీరు వారిని జయించినట్లు కాదు. నన్ను శాస్త్రములలో జయించినచో వారిని జయించినట్లగును." అంత ఆ పండితుడు అహంకారముచే జీవగోస్వామితో తర్కము చేసి అవలీలగా ఓడిపోయెను. పండితుడు శ్రీరూపగోస్వామిని కడకేగి జరిగిన విషయము చెప్పెను. శ్రీలరూపగోస్వామి జీవగోస్వామిని పిలిచి "అకాలమున వైరాగ్య వేషము ధరించి సహనము లేనివాడవయితివి. ఈక్షణము మొదలు నాకడకు రావలదు" అని శాసించిరి. గురువాజ్ఞను మీరుటకు అవకాశము లేక జీవగోస్వామి విదీర్ణ హృదయముతో బృందావనములోని దక్షిణ ప్రాంతమున గల వనములో నిరాహారుడై గురు అనుగ్రహముకై ఏడ్చుచుండెను. వ్రజవాసుల ద్వారా ఈ విషయమును తెలుసుకొనిన శ్రీలసనాతనగోస్వామి శ్రీలరూపగోస్వామి కడకేగి "నీవు రచించు 'ఉజ్వల నీలమణి' గ్రంథమెంతవరకు వచ్చినది అని అడుగగా రూపగోస్వామి "జీవుడు లేడు అతడు ఉండిన పూర్తి అయి ఉండెడిది"అనెను. సనాతనగోస్వామి "నీవు దిగ్విజయుని వద్ద పరాజయము స్వీకరించుట నీ ధర్మము. నీ పరాజయము నోర్వక మహిమను వ్యాపింపచేయుటకు దిగ్విజయుని జీవుడు జయించుట శిష్యుని ధర్మము. కావున జీవగోస్వామిని క్షమించి రక్షింపుము" అనెను. శ్రీలసనాతనగోస్వామి యుపదేశమును అనుసరించి జీవుని క్షమించి తన కడకు రప్పించుకొనెను. జీవగోస్వామి గురుసేవ యందలి నిష్ఠయంతటిది. వీరు శ్రీమద్భాగవతము యొక్క అంతర్నిహిత తత్త్వమును 'షట్సందర్భములు'గ రచించిరి. అవి తత్త్వసందర్భము, పరమాత్మ సందర్భము, భగవత్సందర్భము, కృష్ణ సందర్భము, భక్తి సందర్భము, ప్రీతి సందర్భము. ఇంకనూ హరినామామృత వ్యాకరణము, ధాతుసంగ్రహప్రకాశము, గోపాల బిరుదావళి మున్నగు గ్రంథములను రచించిరి.

శ్రీల జీవగోస్వామి బృందావనమునందు 'విశ్వవైష్ణవ రాజసభ' అను విద్యాపీఠమును స్థాపించి అందు గోస్వాములు రచించిన గ్రంథములను బోధించి, ప్రచారము చేసిరి.

వారికడ శాస్త్రాధ్యయనము చేసిన వారిలో ముఖ్యులు శ్రీలనరోత్తమదాస ఠాకూరు, శ్రీల శ్రీనివాసాచార్యులు, శ్రీల శ్యామానంద ప్రభువు. వీరు ముచ్చురు శ్రీమన్మహాప్రభువుల సిద్ధాంతమును క్రమముగా అస్సాము, మణిపూర్ లందును, వంగదేశమునందును, ఓఢ్రదేశమందును ప్రచారము చేసిరి.

## శ్రీల రఘునాథదాసగోస్వామి

శ్రీచైతనమహాప్రభువు యొక్క పార్షదులగు షడ్గోస్వాములలో ఒకరు శ్రీల రఘునాథదాసగోస్వాముల వారు. రూపగోస్వామి మరియు రఘునాథదాసగోస్వాముల వైరాగ్యము పాషాణము పైని రేఖవలె అచంచలము, అకుంఠితము అని శ్రీచైతన్య చరితామృతము అనుగ్రంథములో వర్ణింపబడినది. వీరు గృహత్యాగము చేసి పూరీ జగన్నాథ క్షేత్రమునందు సుమారు పదునెనిమది సంవత్సరములు ఉండిరి. వీరి వైరాగ్యమునకు భగవత్సేవా తత్పరతకు సంతసించి శ్రీ చైతన్యమహాప్రభువు వీరికి శ్రీ గోవర్దన శిలను, గురివింద గింజల మాలను ప్రసాదించిరి. శ్రీల రఘునాథదాసగోస్వామి విశుద్ధ సాత్వికముతో పూజచేయుచు గోవర్ధన శిలను సాక్షాత్తు కృష్ణునిగా దర్శించెడివారు. శ్రీచైతన్యమహాప్రభువు అంతర్ధానము అనంతరము బృందావనమునకు వచ్చి శ్రీరూప సనాతనుల ఆనుగత్యములో రాధాకుండ తటమున నివసించుచు భగవద్భజన చేసిరి. గౌడీయవైష్ణవులు, శ్రీశ్రీరాధాకృష్ణులు గోపగోపికలతో మద్యాహ్నకాలమందు గోవర్ధనగిరి, రాధాకుండముల కడ చేసిన లీలలు ఎంతయో ముఖ్యమైనవిగా తలంతురు. కావున పెక్కుమంది భజనపరాయణులగు సాధువులు రాధాకుండ తటమునందు భజన చేయుచుందురు. శ్రీల రఘునాథదాసగోస్వామి రాధాకుండ తీరమందు సుమారు 48 సంవత్సరములు భజనచేసిరి. తమకొరకు ఎట్టి కుటీరమును నిర్మించుకొనక వృక్షఛాయయందు ఉంటూ దోసిటయందు పట్టినంత మజ్జిగను మాత్రమే స్వీకరించుచు భగవద్భజన చేయసాగిరి. ఒకనాటి రాత్రి శ్రీల సనాతనగోస్వామి రాధాకుండ పరిక్రమ చేయుచుండగ శ్రీల రఘునాథదాసగోస్వామి అచట నామసంకీర్తనయందు మగ్నుడై యుండుటను, అతని సమీపమున ఒక పెద్దపులి రాధాకుండములో నీటిని త్రాగుచుండుటను, సాక్షాత్తుగ శ్రీరాధాదేవి ఖడ్గ హస్తురాలై శ్రీల రఘునాథదాసగోస్వామికి కాపలాయుండుటను చూచెను. మరునాడు శ్రీల రఘునాథదాసగోస్వామిని కుటీరము ఏర్పరచుకొనుమనియు, శ్రీరాధాదేవికి కష్టమునీయ వలదనియు చెప్పగ అప్పటినుండి అతను కుటీరమున నివసింపసాగిరి.

శ్రీచైతన్య మహాప్రభువు బృందావనమున కేతెంచినపుడు శ్రీరాధాకుండ శ్యామకుండములను అవిష్కరించిరి. శ్రీల రఘునాథదాసగోస్వామి ఆ కుండద్వయమును భక్తుల స్నానమునకు అనుకూలముగ విశాలము చేయ సంకల్పించెను. కాని పరమ

విరాగముతో నుండు తనకు ఇది ఎట్లు సంభవమా యని చింతింపసాగిరి. శ్రీల రఘునాథదాసగోస్వామి పూరీక్షేత్రములో యున్నపుడు వారి తండ్రి ధనము పంపెడివారు. ఆవిధముగా ఇప్పుడు ధనము లభించినచో కుండ నిర్మాణము చేయవచ్చునుగదా! యని అనుకొని మరల "నా మనస్సు ఐహిక ధనము కొరకు ప్రాకులాడుచున్నదే!" యని ఆ ఆలోచనను పరిత్యజించి తన జపమునందు మగ్నులైరి. అనన్యభక్తులకు ఐహిక వస్తువులయందు మమకారములుండవు. కాని భక్తుల కైంకర్యమునకై స్వయముగ ముక్తి కూడ చేతులు జోడించి ఎదురుచూచుచుండును. **"అనన్యాశ్చింతయంతో మాం**----------"అనినట్లు భక్తుల సంకల్పమును భగవంతుడే నెరవేర్చును. ఒక శ్రీమంతుడు బదరీనారాయణుని కైంకర్యమునకై అధిక పరిమాణ ధనముతో బదరీనాథ్ బయలుదేరెను. బదరీనారాయణుడు ఆతనికి స్వప్నమునందు ప్రత్యక్షమై "వత్సా! నీవు నాకు సమర్పింపదలచిన ద్రవ్యమును నేను స్వీకరించితిని. ఇప్పుడు నా ఆదేశమును పాలింపుము. బృందావనమునందు శ్రీల రఘునాథదాసగోస్వామియను నా ప్రేమిక భక్తుడు రాధాకుండ శ్యామకుండములను నిర్మాణము చేయుచున్నాడు. ఆతనికి ధనముపై ఆశలేదు. కావున నా ఆదేశము లెలిపి ఈ ధనముతో కుండద్వయమును నిర్మింపమని విన్నవింపుము" అని చెప్పి అంతర్ధానమయ్యెను. ఆ శ్రీమంతుడు ఆనందముతో నృత్యము చేయుచు బృందావనమునకేతెంచి, శ్రీల రఘునాథదాసగోస్వామికి భగవదాదేశమును తెలిపి ధనమునొసంగెను. శ్రీల రఘునాథదాసగోస్వామి ఆ కార్యమును ఆ శ్రీమంతుని ద్వారా చేయించెను. శ్రీ రాధాకుండము చతురస్రముగ అందముగా తయారయ్యెను. కాని శ్యామకుండ తీరమునందు ఐదు ప్రాచీన వృక్షములుండెను. అందుచే అది వక్రముగాయుండెను. శ్రీల రఘునాథదాసగోస్వామి ఆ వృక్షములను నరకి శ్యామకుండము కూడ చతుర్భుజ రూపముగ చేయసంకల్పించెను. ఆ రాత్రి పాండవులు అతని స్వప్నమున గోచరమై "మేము కృష్ణానుగ్రహమునకై ఇచట వృక్షరూపమున తపము నాచరించుచుంటిమి. దయచేసి మా తపమునకు అంతరాయము కలగింపకుము" అనెను. వారి కోరిక ప్రకారము ఆ వృక్షములనట్లేయుంచి శ్యామకుండమును వక్రముగానే నిర్మించెను. ఇప్పుడు ఆ వృక్షములలో ఒక్క వృక్షము మాత్రమే కానవచ్చుచున్నది. శ్రీకృష్ణుని ప్రేమికభక్తుడగు ఉద్ధవుడు గోపికల పాదధూళికై బృందావనమున గుల్మము, లతగ జన్మించవలెనని ప్రార్థించెను. అట్లే గోపికల అనుగ్రహము గూర్చి దేవతలు, ఋషులు, కిన్నరులు వృక్షరూపములో తపస్సు చేయుచున్నారు. ఎందరో భక్తులు బృందావనమున తపమాచరించి భగవదనుగ్రహమును పొంది లీలలను దర్శించి ధన్యతనొందిరి.

శ్రీల రఘునాథదాసగోస్వామి 'ముక్తలత జన్మ కథ' యను గ్రంథమును వ్రాయునపుడు శ్రీరాధాకృష్ణులు అతనికి ఆ లీలను దర్శింపచేసిరి. శ్రీశ్రీరాధాకృష్ణుల పూర్ణ అనుగ్రహమును పొందిన ఐకాంతిక భక్తుడు శ్రీల రఘునాథదాసగోస్వామి.

# శ్రీ గోపాలభట్ట గోస్వామి

శ్రీగోపాలభట్ట గోస్వామి షడ్గోస్వాములలో ఒకరు. బాల్యముననే శ్రీచైతన్య మహాప్రభువుల పూర్ణానుగ్రహము నొందిరి. మహాప్రభుని ఆదేశముపై వీరు బృందావనమునకు చేరి శ్రీరూప సనాతనుల నాశ్రయించిరి. గ్రంథములను ప్రచారము చేయుచు ఉత్తరదేశమునందలి హరిద్వార్ మున్నగు ప్రదేశములను దర్శించి అచట నుండి గండకీనదీ తీరమునకు వచ్చిరి. నదిలో స్నానము చేసినపుడు ద్వాదశ సాలగ్రామ మూర్తులను పొంది బృందావనమునకు తిరిగివచ్చి శ్రద్ధతో వానిని పూజింపసాగిరి.

ఒకనాడు కొందరు భక్తులు శ్రీగోపాలభట్ట గోస్వామి వారికి ఆభరణములను, వస్త్రములను సమర్పించిరి. అతడు "వీటిని నేనేమి చేయుదును? శ్రీ కృష్ణ విగ్రహముయున్నచో అలంకరించెదను కదా!" యనుకొనెను. మరునాడు ద్వాదశ సాలగ్రామమూర్తులలో ఒక మూర్తి నుండి త్రిభువనమోహన త్రిభంగ ద్విభుజ మురళీధర వ్రజకిశోర శ్యామసుందర రూపముతో కృష్ణుడు ప్రకటమయ్యెను. ఈ మూర్తిని దర్శించి ఆనందముతో రూపసనాతనులకు తెలుపగా వారు దర్శించి ఈ మూర్తికి శ్రీరాధారమణుడు అని నామకరణము చేసిరి. వైశాఖ పూర్ణిమనాడు ఈ విగ్రహము ప్రకటమయ్యెను.

శ్రీగోపాలభట్ట గోస్వామి బృందావనములో శ్రీరూపసనాతనుల వారి సాంగత్యములో శ్రీమన్మహాప్రభుని ఉపదేశానుసారము శ్రీరాధాకృష్ణ భజన, గ్రంథ ప్రచారము చేయుచు వైష్ణవ స్మృతి శాస్త్రమగు సత్క్రియాసారదీపికమును రచించిరి.

# శ్రీల మధుపండితుడు

శ్రీల మధుపండితుడు శ్రీకృష్ణుని గుణములను కీర్తించుచు అహోరాత్రులు గడపెడివాడు. ఒకనాడు భక్తులకడ శ్రీకృష్ణుని నామ, రూప, గుణ, లీలల మాధుర్యమును విని శ్రీకృష్ణుని దర్శించవలెననెడి తీవ్ర అభిలాష, ఉత్కంఠలచే బృందావనమును చేరి కేశీ ఘాట్ అనుచోట శ్రీపరమానంద భట్టాచార్యులతో నివసింపసాగెను. హృదయములో కృష్ణదర్శన లాలస ప్రబలముగ యున్న కారణమున ఎచ్చటను స్థిరముగ యుండలేక పిచ్చివానివలె బృందావనమంతయు తిరుగుచు ఒకనాడు వంశీవటము క్రింద ప్రేమవిహ్వలుడై విలపించుచు మూర్ఛితుడయ్యెను. భక్తవత్సలుడగు భగవంతుడు భక్తుని వ్యాకుల క్రందనమునకు స్థిరముగ యుండలేక లలిత త్రిభంగ రూపముతో మధుర మురళిని వాయించుచు శ్రీగోపీనాథుని రూపముతో అతనికి దర్శనమిచ్చెను.

చాతకపక్షివలె అతని రూప సౌందర్యమును దర్శించుచు, "ప్రభు! నీవు నావద్ద ఎల్లప్పుడు ఇట్లే యుండవలయును " అని ప్రార్థింప భగవంతుడు శ్రీమూర్తిగ మారెను.

శ్రీ మధు పండితుడు శ్రీరాధికతో గోపీనాథుని ప్రతిష్ఠించి సేవింపనారంభించెను. అనంతరము దేవాలయమును నిర్మించి నిత్యసేవకు ఏర్పాటు చేసెను. గౌడీయవైష్ణవులకు గోవింద, గోపీనాథ్, మదనమోహనులు ప్రాణస్వరూపులు.

బృందావనమందలి ఈ మూడు దేవాలయములు అనగా శ్రీరాధాగోవిందులు, శ్రీరాధా గోపీనాథులు, శ్రీరాధా మదనమోహన దేవాలయములు విఖ్యాతినొందినవి. ముఖ్యముగ శ్రీగోవిందుని దేవాలయముపై వెలిగించిన జ్యోతి ఆగ్రా వరకు కనుపించెడిది. ఒకమారు ఔరంగజేబు ఆగ్రా నుండి ఈ జ్యోతిని దర్శించి హిందు దేవాలయముల వైభవమును జూచి ఓర్వలేక ధ్వంసము చేయ ఆజ్ఞాపించెను. భరత్‌పూర్ రాజునకు శ్రీకృష్ణుడు స్వప్నమున ప్రత్యక్షమై ఈ మూడు విగ్రహములను తన రాజ్యమునకు తీసుకుపోవలసినదిగా ఆదేశించెను. రాజు వెంటనే గోవింద, గోపీనాథ్, మదన మోహనులను భరత్ పూర్‌నకు తరలించెను. భరత్‌పూర్ కామ్యవనమునందు కలదు. ఇచట ఆరుమాసములు సేవించి అనంతరము తన రాజధానియగు జయపూర్‌నకు గొనిపోయెను. తరువాత రాజామానసింగ్ దేవాలయములను నిర్మించి సేవకు తగిన ఏర్పాట్లను చేసెను. అతని కుమార్తె వివాహానంతరము మదనమోహనుని యందలి అతిశయించిన ప్రీతిచే మదనమోహనుని తనతో కరోలి తీసుకువెళ్ళి అచట మందిరమును నిర్మించి సేవింపసాగెను. ఇప్పటికిని ఈ ముగ్గురును అట్లు సేవింపబడుచున్నారు.

## శ్రీల నరోత్తమ, శ్రీనివాస, శ్యామానంద ప్రభువులు

శ్రీల నరోత్తమ ఠాకూరులు బాల్యముననే పాండిత్యమును సంపాదించి, వైరాగ్యముతో గురుపదాశ్రయమునకై బృందావన ధామమున కేతెంచిరి. అచట శ్రీల లోకనాథ గోస్వామిని అజ్ఞాతముగ సేవించి వారి అనుగ్రహముచే దీక్షనొందిరి. గుర్వాదేశముపై శ్రీల జీవగోస్వామిని ఆశ్రయించి భక్తిరస శాస్త్రములను నేర్చుకొనిరి. శ్రీల జీవ గోస్వామి వీరికి ' ఠాకూర్ 'అను బిరుదు ఇచ్చిరి. వీరు చాలా దైన్యముతోను నమ్రవినయభావములతో సంస్కృత పండితులై శాస్త్రవిజ్ఞానమును సంపాదించి వంగభాషలో పెక్కు సంకీర్తనములను రచించిరి. వీరిచే రచితమైన శ్రీప్రేమ భక్తి చంద్రిక అను కీర్తన గ్రంథము గౌడీయ వైష్ణవులకు అమూల్యమైనది. వీరు శ్రీరాధా గోకులానందులను శ్రీవిగ్రహముల సేవను ప్రకాశము చేసిరి.

శ్రీల శ్రీనివాసాచార్యులు సంస్కృత పండితులు. శ్రీల రూపసనాతనుల మాహాత్మ్యమును తెలిసికొని వారిని దర్శించుటకు బృందావనము పయనమైరి.

మథుర చేరగనే శ్రీల రూపసనాతనులు లీలలు ముగించి స్వధామమగు గోలోకమునకు ఏగిరని తెలిసికొని మూర్ఛితుడాయెను. అపుడు వారిరువురు కలలో దర్శనమిచ్చి "మా అభిన్న స్వరూపుడైన శ్రీగోపాలభట్టగోస్వామి కడ దీక్షామంత్రోపదేశమునొంది, శ్రీల జీవగోస్వామి వద్ద భజన శిక్షా ప్రళాని గూర్చి నేర్చుకొని, మాచే రచింపబడిన గ్రంథములను వంగదేశమందలి విభిన్న స్థలములలో ప్రచారము చేయుము" అని చెప్పిరి. శ్రీ రూపసనాతనులు శ్రీలజీవగోస్వామి వారికి కూడ స్వప్నమున అటులనే ఆదేశించిరి. శ్రీనివాస ఆచార్యులు శ్రీ జీవగోస్వామి కడకు వచ్చినంతనే వారి కడనుంచుకొని శాస్త్ర విషయములను నేర్పిరి. శ్రీగోపాలభట్ట గోస్వామికడ దీక్షనొంది శ్రీనివాసాచార్యులు రాధాకుండములో శ్రీరఘునాథ దాసగోస్వామి, శ్రీల కృష్ణదాస కవి రాజగోస్వామి మున్నగు మహానీయులను దర్శించిరి. అనంతరము ఒకనాడు జీవగోస్వామి పాదులు ఉజ్వల నీలమణియను గ్రంథమునందలి ఒక శ్లోక వ్యాఖ్యానమును శ్రీనివాసాచార్యులు వద్ద విని చాలా ఆశ్చర్యమునొంది శ్రీనివాసునకు "ఆచార్య" అను బిరుదును ఇచ్చిరి. వంగదేశమునందు శ్రీమన్మహాప్రభుని సిద్ధాంతమును, భక్తి రస గ్రంథములను ప్రచారము చేసి, శ్రీరాధాకాలాచాంద్ ల శ్రీవిగ్రహసేవను ప్రకాశము చేసిరి.

శ్రీల శ్యామానంద ప్రభువు బాల్యముననే గృహత్యాగము చేసి శ్రీల హృదయ చైతన్యఠాకూరులు కడ మంత్రోపదేశమునొంది బృందావనమున వ్రజమండలము, గోవర్ధనము, రాధాకుండములను దర్శించిరి. శ్యామానంద ప్రభువు రాధాకుండ తీరమున ప్రేమానురాగములతో భగవంతుని గూర్చి దుఃఖించుచు శ్రీల రఘునాథ దాస గోస్వామి కడకు వెడలిరి. శ్యామానందుని హృదయవేదనను తెలిసికొని శ్రీల రఘునాథదాసగోస్వామి బహు విధములుగ ఉపదేశించిరి. శ్యామానందుని శ్రీనివాస నరోత్తములకు పరిచయము చేయగ వారు మువ్వురు శ్రీల జీవగోస్వామి కడ శాస్త్రమును అభ్యసింపసాగిరి. శ్యామానందులు శ్రీలజీవగోస్వామి అనుగ్రహముచే శ్రీరాధాశ్యామ సుందరులను సేవించుచు వారి కృపనొందిరి. శ్రీరాధాశ్యామసుందరుల మందిరమునకు దగ్గరలోనే నిధువనమున్నది. శ్రీల జీవగోస్వామివారి ఆదేశ ప్రకారము శ్రీశ్యామానంద ప్రభువు నిధువనమును శుభ్రము చేయుచుండగ ఒక రోజు శ్రీరాధిక యొక్క చరణనూపురము లభించెను. శ్రీరాధిక సఖులు నూపురమును వెదుకుచు శ్రీ శ్యామానంద ప్రభువుకు దర్శనమిచ్చి నూపురముతో అతని లలాటమున తిలకమును దిద్దిరి. అప్పటినుండి శ్యామానందప్రభువు, వారి అనుయాయులు నూపుర ఆకారమును బోలిన తిలకమును ధరించుచున్నారు. శ్రీశ్యామానంద ప్రభువు గోస్వాములు రచించిన గ్రంథములను ఒరిస్సా రాష్ట్రమున ప్రచారము గావించిరి.

# వ్రజమండలములో గౌడీయ వైష్ణవులు

శ్రీల భక్తివినోద ఠాకూరులు క్రీ॥శ॥ 1890 వ సం॥లో కృష్ణలీలా దర్శనార్థము వ్రజమండలమునకు వచ్చిరి. వ్రజమండలములో భజనకు సర్వోత్కృష్ట స్థానమగు శ్రీ రాధాకుండమునకు సమీపములో "స్వానంద సుఖదకుంజము" అనునొక కుటీరమును నిర్మించి ఏకాంత భజన చేసి భగవదనుభూతిని బడసిరి.

అనంతరము శ్రీలభక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి ప్రభుపాదులవారు బృందావనము, మథుర,గోవర్ధనము, రాధాకుండము మున్నగు స్థలములలో గౌడీయ మఠములను స్థాపించిరి. గౌడీయ వైష్ణవులకు బృందావనము ముఖ్యమైన భగవల్లీలా క్షేత్రము. ఎనుబది నాలుగు క్రోసుల పరిమితి కలిగిన వ్రజమండలమునందు ఎన్నియో కృష్ణలీలా స్థలములున్నవి. పెక్కుమంది ఇవి ఏవియూ దర్శింపక శ్రీకృష్ణ జన్మ స్థానమును చూచి బృందావన దర్శనమైనదని తలంతురు. శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి ప్రభుపాదులవారు **"గౌర ఆమార్ యేసబస్థానె కరలభ్రమణరంగే। సెసబస్థాన హేరిబ ఆమి ప్రణయ భకత సంగే॥"** అను శాస్త్ర వాక్యము ప్రకారము ప్రేమిక భక్తుల ఆనుగత్యములో వ్రజమండల పరిక్రమ, భగవల్లీలా స్థలముల దర్శనము చేయుటకు వీలుగా "వ్రజమండల పరిక్రమ"ను ఏర్పాటుచేసిరి. వందలాది భక్తులతో ఈ స్థలములను దర్శించుచు ఆయా క్షేత్ర మాహాత్మ్యములను అచట ఉపన్యసిస్తూ, సంకీర్తనలు చేయుచు సుమారు మాసము రోజులు పరిక్రమ చేయుదురు. శ్రీల ప్రభుపాదులు దీని పూర్తి బాధ్యతను శ్రీల భక్తిహృదయ వనదేవ గోస్వామి మహరాజుగారికి ఇచ్చిరి.

శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతీ గోస్వామి మహరాజుగారి శిష్యులలో శ్రీల భక్తి విలాస తీర్థగోస్వామి మహారాజుగారు, శ్రీల భక్తి హృదయ వనదేవగోస్వామి మహారాజుగారు, శ్రీల గోస్వామి మహరాజుగారు, శ్రీల కేశవ మహరాజుగారు, శ్రీల మాధవ మహరాజుగారు, శ్రీల పూరి మహరాజుగారు మున్నగువారు ఆశ్రమములను మఠములను స్థాపించిరి, ఎందరో త్యాగులు తమ సాధనకై కుటీరములను, ఆశ్రమములను ఏర్పరచుకొని సాధనయే ముఖ్యముగ జీవించుచు రాధాకృష్ణుల కృపను బడయుచున్నారు. శ్రీరాధాకృష్ణుల దర్శనమునొందిన మహనీయులు ఇప్పటికినియున్నారు.

శ్రీల ప్రభుదత్త బ్రహ్మచారిగారు ఒక ఆశ్రమమును నిర్మించి శ్రీమద్భాగవత కథలను ప్రచురించి అందరికి అందించిరి. శ్రీ వ్రజమండలమునందు కేవలము ప్రేమిక భక్తులే గాక కర్ములు, జ్ఞానులు, యోగులు, సిద్ధులు కూడ నివసించి వారివారి సాధనలను బట్టి సిద్ధిని పొందుచుందురు.

శ్రీలరూపసనాతన గోస్వాముల వారి ఆనుగత్యములో వారు అనుగ్రహించిన పద్ధతిలో సాధనచేసి శ్రీచైతన్య మహాప్రభువుల కటాక్షమును, మహాప్రభువు ప్రసాదించిన ఉన్నత ఉజ్వల రసమును ఆస్వాదించి తమ జీవితములను సార్థకము చేసికొనిన పెక్కుమంది సాధువులీ వ్రజమునందు గలరు. అప్రాకృతమగు ఈ వ్రజమునందు నివసించి వ్రజమాహాత్మ్యము నెరింగియు వ్రజమాధురిని అస్వాదింపవలెనను ఉత్కంఠలేక కేవలము సాధన పేరుతో వ్రజవాసము చేయు వారిని రాధాకృష్ణులు శిక్షింతురు. ఈ విషయమునందు పెక్కు దృష్టాంతములు గలవు.

మన జీవిత ముఖ్యోద్దేశ్యము శుద్ధభక్తిని, తద్వారా భగవత్ప్రేమను పొందుటయే. సాధకులు నివసించ తగిన ప్రదేశము వ్రజమండలము. రాధాకృష్ణుల కృపను కోరుచు అనన్యచిత్తముతో శ్రీశ్రీరాధాకృష్ణులను ఆరాధించుటయందు దృఢసంకల్పము గలవారము కావలెను.

> తన్నామరూప చరతాది సుకీర్తనాను
> స్మృత్యోః క్రమేణ రసనామనసీ నియోజ్య!
> తిష్టన్ వ్రజే తదనురాగి జనానుగామీ
> కాలం నయే దఖిల మిత్యుపదేశసారమ్॥ (శ్రీల రూపగోస్వామి)

క్రమమార్గము ననుసరించి ప్రాపంచిక రుచులయందు నివిష్టమైయున్న జిహ్వను భగవన్నామ రసాస్వాదన యందు, విషయచింతనల యందు నిమగ్నమై యున్న మనస్సును భగవంతుని దివ్యమంగళకర రూపమును స్మరించుటయందును నియమించి వ్రజవాసము చేయుచు వ్రజవాసుల ఆనుగత్యములో కాలమును గడుపవలెను. ఇదియే సకల ఉపదేశముల సారము.

ఈ విధముగ సాధన భజనలను చేసిన తప్పక శ్రీమతి రాధిక కృపచే ఎన్నియో భగవదనుభూతులనుపొంది, భగవల్లీలను దర్శించి, వ్రజము యొక్క మాధుర్యమును అనుభవింపగలము. ఇవియే **'వ్రజమాధురి'**.

*జై గిరిరాజ్ మహరాజ్ కి జై*

జై వృషభాను నందని శ్రీమతి రాధికా కి జై



